మొటిమల నుండి
కాపాడుతుంది

నల్ల మచ్చలను
తగ్గిస్తుంది

ముఖఛాయను
ప్రకాశవంతం చేస్తుంది

ముడతలను
తగ్గిస్తుంది

# చందనం
చర్మానికి
# మంచిది











THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

# స్వాతి
సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM


పాఠక దేవుళ్ళకు నమస్కారం
ఎడిటర్
వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 35 | 31.8.2018 | సంచిక 9

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


True knowledge leads to unity, ignorance to diversity



ముఖచిత్రం : శోభిత ధూళిపాళ
Courtesy : ADORN



# ఎవరు శ్రేష్ఠులు!

ఇంతకీ శ్రేష్ఠులంటే ఎవరు? ఎంతమంది అమాయకులు వుంటే శ్రేష్ఠులు కింద లెక్క? ఏ రంగంలో వుంటే శ్రేష్ఠులయినట్లు? చేసే పనినిబట్టి శ్రేష్ఠత్వమా? వుండే అధికారాన్నిబట్టి శ్రేష్ఠత్వమా?

భగవద్గీతను శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశం చేసేడు కాబట్టి అర్జునుడిస్థాయిలో వున్నవాళ్ళే ఉన్నత పురుషులు, తక్కినవారు కాదు అనవచ్చునా?

భగవద్గీతను పాలతో పోల్చారు.

పాలు ఏ వయస్సులోనివారికైనా, ఎటువంటి దేహపరిస్థితులలో వున్నవారికైనా ఉపయోగపడినట్లే, భగవద్గీతకూడా అందరికీ అన్వయిస్తుంది.

ఇందులో చిన్నాపెద్దా తారతమ్యం లేదు.ఏ కార్యరంగానికైనా అన్వయిస్తుంది. ప్రాముఖ్యం కలిగినవి, లేనివి అనే తేడా లేదు. ఈ దృష్ట్యా చూస్తే ప్రతి రంగంలోను, ప్రతివ్యక్తీ ఒకవిధంగా శ్రేష్ఠుడే. అతని వెనకాల అతనిని అనుకరించి,

తమ జీవిత విధానాన్ని మలచుకొనేవారు ఒకరో, ఇద్దరో వుంటారు. వారికి మార్గదర్శకంగా వుండడానికైనా తాము సరిగ్గా ప్రవర్తించాలి.

వేదాంతం ప్రచారంచేసే సాధువులు,సన్యాసులు, బ్రహ్మచారులు వీరి ఉపన్యాసాలను వినే శ్రోతలకి శ్రేష్ఠపురుషులు.

అత్యున్నతమైన వేదాంతాన్ని అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు చక్కగా వివరించి చెప్పినా ఆచరణలో నిత్యమూ అనుష్ఠానం, తపస్సు, అధ్యయనం లేకపోతే శ్రోతలు, వేదాంతం వినడానికి మాత్రమేనని ఆచరణలో కాదని అనుకుంటారు.

'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః'- ఇందులో నిగూఢమైన నిజం తెలుసుకుని జాగ్రత్తగా నడుచుకుంటే వ్యక్తిగత జీవితం, సమాజం నందన వనంగా మారతాయి.

స్వామి శారదాప్రియానంద


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433

# ఊహించిన కంటె ఎక్కువ చక్కటి రిజల్ట్స్... మంచి వాతావరణం... Call : 99596 16106


SNIGDHA
Anoo's International Beauty School Student.

నా పేరు స్నిగ్ధ. మేము వైజాగ్‌లో ఉంటాము. నాకు అనూస్ అంటే చాల ఇష్టం. ఎందుకంటే నేను చిన్నప్పటి నుండి అనూస్ గురించిన విషయాలు వింటూ చాల ప్రభావితమయ్యాను. మా పక్కింటి ఆంటీ శ్యామల వైజాగ్ క్లినిక్‌లో ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నానని అక్కడి విషయాలు మాతో చెబుతూ ఉంటే, తన ట్రీట్‌మెంట్ రిజల్ట్ స్వయంగా చూసిన నేను అనూస్ ట్రీట్‌మెంట్‌లో జాయిన్ అయ్యాను. నేను స్కిన్ ట్రీట్‌మెంట్ మరియు అన్ వాంటెడ్ హెయిర్ రిమూవల్ ట్రీట్‌మెంట్ తీసుకున్నాను. అంతేకాదు, నాకు అనూస్‌లో మేకోవర్ చేసి, నన్ను చాల అందంగా చేశారు. ట్రీట్‌మెంట్‌లో నేను ఊహించినట్లే, వేరేవారి దగ్గర విన్నకంటె నాకు ఇంకా చక్కటి రిజల్ట్ వచ్చింది... నేనింతకు ముందు చూసిన సెలూన్స్‌కి అనూస్‌కి అస్సలు పోలికే లేదు. నాకు అనూస్ వాతావరణం చాల నచ్చటమే కాక అల్టిమేట్‌గా అనిపించింది. అనూస్ ట్రీట్‌మెంట్ తీసుకుంటున్న సమయంలో అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ గురించి తెలిసి, యు-ట్యూబ్‌లో అప్లికేషన్ చూశాను. మా అమ్మ చేత కెమికల్ డై మాన్పించి, అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ మొదలు పెట్టించాను. తన వెంట్రుకలు చక్కగా నలుపు రంగులోకి వచ్చి ఇపుడు జుట్టు బాగుంది. అది చూసి మా రిలేటివ్స్ అందరూ అడిగారు, వాళ్ళకి కూడ అప్లై చేశాను. వారి అభినందనలు, వారి సంతోషం చూసి చాల సంతోషమనిపించింది. అనూస్‌పై ఉన్న ఇష్టం నా చేత బ్యూటీ ఫీల్డ్ వైపు అడుగు వేయించింది. అనూస్ క్లినిక్‌కి వెళ్ళినప్పుడు అనూస్ ఇంటర్నేషనల్ బ్యూటీ స్కూల్ గురించి కూడ తెలిసింది. నా భర్త పేరు సమర సింహారెడ్డి ఆయన నా ఇష్టం గమనించి నన్ను అనూస్ ఇంటర్నేషనల్ బ్యూటీ స్కూల్ కోర్సులో జాయిన్ చేశారు. అక్కడి టీచర్స్, టీచింగ్ మెథడ్స్, స్టూడెంట్స్‌ను వారు గైడ్ చేసే విధానం, ఇవాల్టి జీవన విధానంలో మనం మనల్ని ఎలా కాపాడుకోవాలి, మన కాళ్ళ మీద ఎలా నిలబడాలి అన్నది తెలుపుతుంది. అనూస్ సిస్టర్స్ యొక్క ఎక్స్‌పెక్టేషన్స్ తగినట్లున్న అక్కడి పద్ధతి చూసి నాకు చాల సంతోషమనిపించింది. అనూస్ సిస్టర్స్, వారు సంస్థను నడిపే తీరు చూసి, నేను వారిలా కావాలని ఆశపడుతున్నాను. వారు నన్ను అలా మారుస్తారని ఆశిస్తూ..ఇంత మంచి అందమైన ప్రపంచాన్ని భావి తరాలకు పరిచయం చేసిన అనూస్ సిస్టర్స్‌కు మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలుపుతూ... **ప్రేమతో స్నిగ్ధ.**


www.anoos.com

## మీకు జుట్టుకు సంబంధించిన ప్రతి సమస్యకు సరైన పరిష్కారం కావాలంటే ?




మీకు జుట్టు నల్లగా ఉండి సమస్యలు ఉంటే అనూస్ హెయిర్ కేర్ ప్యాక్‌ను ప్రతి వారం వాడండి.
మీకు తెలుపు జుట్టు ఇపుడిప్పుడే వస్తూ ఉంటే అనూస్ హెన్నా ప్రతి వారం వాడండి
మీకు తెలుపు జుట్టు ఎక్కువగా ఉంటే, మూడు వారాలు హెన్నా మరియు
ఒక వారం అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ వాడండి.
మీకు చాల ఎక్కువ తెలుపు జుట్టు వచ్చినట్లైతే ప్రతి వారం అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ అప్లై చేయండి.
ఎందుకంటే అనూస్ సిస్టర్స్ తమ జుట్టు కోసం పైన చెప్పిన విధానాన్ని అనుసరిస్తారు కాబట్టి.
దగ్గర్లో ఉన్న అనూస్ క్లినిక్స్‌లో ఫ్రీ అప్లికేషన్‌కై సంప్రదించండి.







**అనూస్ హెర్బల్ ప్రోడక్ట్స్ మీ దగ్గరలోని సూపర్ మార్కెట్స్‌లోగాని, షాపులోగాని పొందాలంటే, పదే పదే అడిగి ఒత్తిడి పెంచండి.**

Black Xpert Application URL : https://www.youtube.com/watch?v=JIuUHIb-
**Henna** Application **URL :** https://www.youtube.com/watch?v=A0uyzQHlukg&t=3s

ANOO'S
SALON & CLINIC Since 1983
TELANGANA | ANDHRAPRADESH
KARNATAKA | USA

Watch Anoo's Programme
Every Saturday in STAR MAA at 7.30 AM
Every Saturday in HMTV at 1.30 PM.
Every Saturday in CVR Health at 2.30 PM.
Every Saturday in V6 at 3.30 PM

*Services & International Beauty School Courses:* 99596 16106
*Product Enquiries:* 9100034054



## సాక్షి

**17.8.2018**

'**మ**రీ ఎక్కువగా ఆలోచించకండి' వ్యాసం ప్రతి ఒక్కర్నీ ఆలోచింపచేసింది. ఆశావహ దృక్పథంతో వెళ్తూ, వర్తమానము ను ప్రతి ఒక్కరూ సద్వినియోగం చేసుకోవలసిన అవసరం చాలా ఉంది. అప్పుడే భవిష్యత్తు బాగుంటుంది.

లక్ష్మీ గిరిజకుమార్ రాజమహేంద్రవరం

'**ఆ**నందం అంటే' ఏమిటో నర్మగర్భంగా చెప్పిన సంపాదకీయంలో స్వామి అక్షరాత్మానందగారి ఉవాచ జీవితసత్యాన్ని అభివ్యక్తీకరించింది.

'సత్యాన్వేషణ' చాటిచెప్పిన ఎంత మోసినా బరువనిపించదు బంగారం, ఎంతచేసినా చాలనిపించదు సత్సంగం. అద్భుతమైన ఉపదేశం ఇది.

'ఉచ్చు' సీరియల్ అద్భుతంగా ఉంది. 'ప్రణతోస్మి దివాకరం', 'సర్కారీ కొలువు' కథలు బాగున్నాయి.

ఎస్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

**త**మకు అనుకూలంగా మలచుకునే నాయకులు వారి పార్టీలు ఉంటాయి దీనిని మార్చగలిగేది భారతీయ యువతే అని 'మనము... మన స్వాతంత్ర్యం'లో మంచి సందేశం ఇచ్చారు.

ఎదుటివారి కోణంనుండి ఆలోచించాలంటే కొంచెం దయాగుణం అలవాటుచేసుకుంటే కోపం సమస్య ఇట్టే మీనుండి దూరం అవుతుంది అని 'మీకు నిజంగా కోపమా!' ఫీచర్ ద్వారా ఇచ్చిన వివరణ బాగుంది.

'ఉచ్చు' సీరియల్ ప్రారంభంనుండే మమ్మల్ని ఆకట్టుకుంది.

జి.వి.మురళీమోహన్ ముచ్చుమిల్లి

**స్వా**తంత్ర్య దినోత్సవం సందర్భంగా సంకుచిత అంశాలవైపు భావోద్వేగాలు రెచ్చగొట్టే నేతలవైపు మళ్ళవద్దని నేటి యువజనాభాకి ఇచ్చిన సందేశం సముచితంగానూ, సందర్భోచితంగా ఉంది.మీకు అభినందనలు.

కొత్తసీరియల్'ఉచ్చు' అద్భుతంగా ఉంది. అన్ని సీరియల్స్ యువ హృదయాల్ని ఉత్సాహభరితంగా చేశాయి.

'ప్రణతోస్మి దివాకరం', 'సర్కారీ కొలువు' కథలు బాగున్నాయి.

'Whats App' అలరించగా, 'ఈ శీర్షిక మీదే' ఆకట్టుకుంది.

ఎ.చైతన్య వాకలపూడి

## వచ్చేవారం స్పెషల్

### శ్రావణంలో లక్ష్మీ కటాక్షం

'**స**ర్కారీ కొలువు', 'ప్రణతోస్మి దివాకరం', 'సరిగమనం', 'నానారూప పదార్థ నిషేధపర్వం' కథలు మా ఇంటిల్లిపాదికి ఎంతో నచ్చాయి.

'ఒక చిన్నమాట' శీర్షిక అద్భుతంగా ఉంటుంది. 'మనిషిలో మనిషి' సీరియల్ ఆసక్తిగా వుంటోంది.

ఎ.వి.సోమయాజులు కాకినాడ

'**చి**వరిరోజుల్లో...' శీర్షికలో వర్జీనియా ఊల్ఫ్ గురించి చదివి తెలుసుకున్నాం. ప్రముఖులైనవారు తమ చివరిరోజుల్లో ఎదుర్కొన్న అనుభవాల్ని చక్కగా ఆవిష్కరించి మాకు అందజేస్తున్నందుకు స్వాతికి అభినందనలు.

పి.వరవయ్య హైదరాబాద్

# ఇది మంచి సమయం

**23.8.2018 నుండి 26.8.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షఋతువు, శ్రావణమాసం, శుక్లపక్షం. 27.8.2018 నుండి కృష్ణపక్షం.**



**23.8.2018 గురువారం**
తిథి: ద్వాదశి ప. 10.16 వరకు
నక్షత్రం: ఉత్తరాషాఢ పూర్తి
వర్జ్యం: మ. 12.42-2.31 వరకు
దుర్ముహూర్తం: ప. 10.00-10.51 వరకు. మ. 3.08-3.59 వరకు
రాహుకాలం: మ. 1.45-3.20 వరకు
మంచి సమయం: ఉ. 7.50 నుండి 8.55 వరకు
సూర్యోదయం: 5.49కి
సూర్యాస్తమయం: 6.22కి

**24.8.2018 శుక్రవారం**
తిథి: త్రయోదశి మ. 12.51 వరకు
నక్షత్రం: ఉత్తరాషాఢ ఉ.6.48 వరకు
వర్జ్యం: ప. 11.18-1.06 వరకు
దుర్ముహూర్తం: ప.8.19 నుండి 9.10 వరకు. మ. 12.35-1.36 వరకు
రాహుకాలం: ప. 10.33-12.09 వరకు
మంచి సమయం: ప. 10.00-11.05 వరకు
సూర్యోదయం: 5.49కి
సూర్యాస్తమయం: 6.21కి
వరలక్ష్మీ వ్రతం

**25.8.2018 శనివారం**
తిథి: చతుర్దశి మ. 3.16 వరకు
నక్షత్రం: శ్రవణం ప. 9.49 వరకు
వర్జ్యం: మ. 2.17-4.04 వరకు
దుర్ముహూర్తం: ఉ.5.45-7.27 వరకు
రాహుకాలం: ప. 8.58-10.33 వరకు
మంచిసమయం: ప. 8.55-10.00 వరకు
సూర్యోదయం: 5.49కి
సూర్యాస్తమయం: 6.20కి

**26.8.2018 ఆదివారం**
తిథి: పూర్ణిమ సా. 5.26 వరకు
నక్షత్రం: ధనిష్ఠ మ. 12.36 వరకు
వర్జ్యం: రా. 8.31-10.17 వరకు
దుర్ముహూర్తం: సా. 4.50-5.41 వరకు
రాహుకాలం: సా. 4.55-6.32 వరకు
మంచి సమయం: ఉ.7.30-9.20 వరకు
సూర్యోదయం: 5.50కి
సూర్యాస్తమయం: 6.20కి

**27.8.2018 సోమవారం**
తిథి: బహుళ పాడ్యమి సా. 7.15 వరకు
నక్షత్రం: శతభిషం మ. 3.04 వరకు
వర్జ్యం: రా. 10.01-11.45 వరకు
దుర్ముహూర్తం : మ. 12.24 నుండి 1.25 వరకు. మ. 3.07-3.58 వరకు
రాహుకాలం: ఉ. 7.23-8.58 వరకు
మంచి సమయం: ఉ. 7.30 నుండి 11.30 వరకు
సూర్యోదయం: 5.50కి
సూర్యాస్తమయం: 6.19కి

**28.8.2018 మంగళవారం**
తిథి: విదియ రా. 8.40 వరకు
నక్షత్రం: పూర్వాభాద్ర సా. 5.08 వరకు
వర్జ్యం : రా. 3.24-5.07 వరకు
దుర్ముహూర్తం: ప. 8.18-9.09 వరకు రా. 11.00-11.51 వరకు
రాహుకాలం: మ. 3.19-4.54 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.50కి
సూర్యాస్తమయం: 6.18కి

**29.8.2018 బుధవారం**
తిథి : తదియ రా. 9.38 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర సా.6.48 వరకు
వర్జ్యం: లేదు
దుర్ముహూర్తం: ప. 11.43 నుండి 12.34 వరకు
రాహుకాలం: మ.12.09 నుండి 1.45 వరకు
మంచి సమయం: ఉ. 7.20 నుండి 11.20 వరకు
సూర్యోదయం: 5.50కి
సూర్యాస్తమయం: 6.17కి

* మనలో మహామహుల గుణాలున్నాయి.

# రొమ్ము క్యాన్సర్-ఖచ్చితంగా తెలుసు కోవాల్సిన విషయాలు

**రొమ్ము క్యాన్సర్ వంశపారంపర్యమా ?**

వయస్సు పైబడే కొద్ది ఈ క్యాన్సర్ వచ్చే రిస్క్ పెరుగుతూ వస్తుంది. అంతేగాక రొమ్ము క్యాన్సర్ కొన్ని కుటుంబాలలో వారి జెనిటిక్ కోడ్ మీద ఆధారపడి వచ్చే ప్రమాదం ఉంటుంది. అయితే ఫ్యామిలి హిస్టరి లేని వారికి ఈ క్యాన్సర్ రాదు అనుకోవటానికి లేదు కాబట్టి 30 ఏళ్ల నుండే ప్రతి స్త్రీకి రొమ్ము క్యాన్సర్ పట్ల అవగాహన తప్పనిసరి.

**కుటుంబ చరిత్రలు ఈ క్యాన్సర్ ఎక్కువగా ఉంటే ఏ ఏ జాగ్రత్తలు తీసుకోవచ్చు ?**

జీవనశైలి, పర్యావరణం, హార్మోన్లకు సంబంధించిన అనేక విషయాల మీద ఆధారపడి ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదం ఉంటుంది. ఫ్యామిలి హిస్టరిలో బ్రెస్ట్ క్యాన్సర్ వచ్చినవారు ఎక్కువగా ఉన్నప్పుడు ముందుగానే పసిగట్టటానికి BRCA1, BRCA2 అనే జెనెటిక్ పరీక్షలు చేయించు కోవచ్చు, ఈ జీన్ మ్యుటేషన్ పరీక్షలు పాజిటివ్‌గా ఉన్నప్పుడు డాక్టర్ సలహా మేరకు ముందుగానే రొమ్ములను తొలగించు కోవటం కాని లేదా ఎప్పటికప్పుడు పరీక్షలు చేయించుకుంటూ జాగ్రత్తగా ఉండటం చేయ వలసి ఉంటుంది. ఆ స్త్రీ వయస్సు మరియు రిపోర్టుల మీద ఆధారపడి వారికి తగిన కౌన్సిలింగ్ ద్వారా ఏ విధమైన నిర్ణయం తీసుకుంటే బాగుంటుంది అనే విషయం వైద్యులు నిర్ణయిస్తారు.

**ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదం ఎవరిలో ఎక్కువ ?**

1. దగ్గరి బంధువులలో (అమ్మ, అమ్మమ్మలు, అక్క చెల్లెలు, మేనత్తలు) ఈ క్యాన్సర్ ఉన్నప్పుడు.
2. వారు 40 ఏళ్ల కంటే చిన్న వయస్సులోనే ఈ క్యాన్సర్‌కు గురయినప్పుడు.
3. రెండు వక్షోజాలు ఈ క్యాన్సర్‌కు గురయిన కుటుంబాలలో.
4. ఆ కుటుంబానికి చెందిన పురుషులలో కూడా ఈ క్యాన్సర్ బయటపడినప్పుడు.
5. ఆ కుటుంబ సభ్యులలో ఇతర క్యాన్సర్స్ ఎక్కువగా కన్పించటం కాని అండాశయాలకు సంబంధించిన క్యాన్సర్స్ వచ్చినప్పుడు.
6. జీన్ మ్యుటేషన్ స్ట్రాంగ్ గా ఉన్నవారిలో మరియు అందరికి తెలిసిన విషయాలైన పెళ్లి లేటుగా చేసుకోవటం, పిల్లల్ని ఆలస్యంగా కనడం, పాలు ఇవ్వలేక పోవటం, సంతానలేమి సమస్యలకు అధిక మోతాదులో హార్మోన్ల మందులు వాడటం, 10 ఏళ్ల కంటే చిన్న వయస్సులోనే రజస్వల కావటం, 50 ఏళ్లు పైబడినా నెలసర్లు అవక పోవటం ఇలా ఈస్ట్రోజన్ స్థాయిలు అధిక మోతాదులో దీర్ఘకాలికంగా ఉన్నప్పుడు ఇంకా వారికి అధిక బరువు కూడా తోడయితే ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదం ఎక్కువ అవుతుంది. అభివృద్ధి చెందిన దేశాలలో, అభివృద్ధి చెందుతున్న దేశాలలో పట్టణాలలో ఈ క్యాన్సర్‌కు గురయ్యే మహిళల సంఖ్య అధికంగా ఉంటోంది. ముప్పై ఏళ్ల వయస్సులో 200000 మందిలో ఒకరిలో కన్పించే ఈ క్యాన్సర్ 80 ఏళ్ల వయస్సులో ప్రతి 10 మందిలో ఒకరిలో కన్పించేంతగా అధికమవుతుంది.

**బ్రెస్ట్ క్యాన్సర్ పట్ల పెంపొందించు కోవల్సిన అవగాహన ఏమిటి ?**

రొమ్ములో నొప్పిలేని గడ్డను నిర్లక్ష్యం చేయకుండా ఉండటం చిన్న పరిమాణంలో ఉండగానే కనుక్కోగలగటం, 20 ఏళ్ల నుండే స్నానం చేసేటప్పుడు పరీక్షించుకుంటూ రొమ్ములో కదలకుండా గట్టిగా ఉన్న గడ్డను పసిగట్టడం అంతేగాక 30 ఏళ్లు పైబడ్డాక అల్ట్రాసౌండ్, డిజిటల్ మామోగ్రఫి వంటి పరీక్షలు చేయించు కోవటం ద్వారా చేతికి కూడా తగలనంతగా చిన్న సైజులో ఉన్నప్పుడే కనుక్కోగలుగుతారు అప్పుడు కణితిని మాత్రమే తీసివేయగలిగే లంపెక్టమి చేయగలుగుతారు. మిగతా భాగాలకు వ్యాపించిన సంధర్భాలలో రొమ్మును మొత్తంగా తీసివేసే మాస్టెక్టమి తప్పనిసరి. లేటు అయ్యేకొద్ది మాస్టెక్టమి అనివార్యం అవుతుంది.

**లావుగా ఉన్న స్త్రీలలో, వక్షోజాలు పెద్దగా ఉన్నవారిలోనే ఈ క్యాన్సర్ వస్తుంది.**

దీనిలో నిజమే లేదు. ఈ క్యాన్సర్ ఎవరిలోనైనా రావచ్చు, చివరికి పురుషులలో కూడా ఈ క్యాన్సర్ వస్తుంది కొంత వరకు లావుగా ఉన్నవారిలో లేటుగా కనుక్కొనే ప్రమాదం ఉన్నా వక్షోజం పరిమాణంగా పెద్దగా ఉండటం వలన గడ్డను మాత్రమే తీసి వేయగలగటం, చిన్నగా ఉన్నవారిలో త్వరగా మిగతా భాగాలకూ వ్యాపించే ప్రమాదం ఎక్కువ కావటం మొత్తంగా తీసి వేయటం జరుగుతూ ఉంటుంది. కణితి సైజు మీద ఆధారపడి ఏ రకమైన ట్రీట్‌మెంట్ ఇవ్వాల్సి ఉంటుందో నిర్ధారిస్తారు. అంతే కాకుండా ట్యూమర్ టైపు కూడా ట్రీట్‌మెంట్ విధానాలలో ప్రధాన పాత్ర పోషిస్తుంది అయితే అధిక బరువు ఉన్నవారిలో అన్ని అణన్య సమస్యలు ఎలా ఎక్కువగా వస్తాయో అలానే ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదమూ పెరుగుతుంది.




**Dr. Ch. Mohana Vamsy**
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad
Ph: 98480 11421
**Kurnool : 08518 273001**
**Guntur : 0863 2223300**


**రొమ్ము క్యాన్సర్ లక్షణాలు ఏ విధంగా ఉంటాయి ?**

1. రొమ్ములో కణితి తగలటం
2. రొమ్ములో, చంకలో గడ్డ వాపు కన్పించటం
3. చనుమొన సైజులో మార్పు, లోపలికి తిరిగి ఉండటం
4. రొమ్ముపై చర్మం మందం కావటం, సొట్టపడటం
5. బ్రెస్ట్ సైజులో, షేపులో, రంగులో మార్పు
6. రొమ్ము మీద ఎంతకూ నయం కాని పుండు
7. చనుమొన నుండి రక్తస్రావం

కాని ఈ లక్షణాలు కన్పించే సరికే రొమ్ము క్యాన్సర్ తొలిదశను దాటి పోయే ప్రమాదం ఉంటుంది. క్యాన్సర్ కణితి రకం, స్టేజ్, గ్రేడింగ్ విషయాల మీద ఆధారపడి సర్జరి, సర్జరితో పాటు కీమో, రేడియేషన్, హార్మోన్ థెరఫి నిర్ధారిస్తారు. రొమ్ములోని సన్నటి గొట్టాలు లోబ్స్‌కు పరిమితమయ్యే క్యాన్సర్స్ మరియు ఇతర భాగాలకు త్వరగా వ్యాపించే క్యాన్సర్స్ వంటి రకాలు ఉంటాయి. ట్రీట్‌మెంట్స్ లేటు అయ్యే కొద్ది ఈ క్యాన్సర్స్ కూడా అదుపు తప్పుతాయి వయస్సు పైబడిన స్త్రీలలో కంటే చిన్న వయస్సులో వచ్చే రొమ్ము క్యాన్సర్స్‌ను అదుపు చేయటం కష్టమవుతుంది. చిన్న వయస్సులో వచ్చే రొమ్ము క్యాన్సర్ కణితులకు అధికంగా వ్యాపించే గుణం ఉంటుంది. ఈ రోజుల్లో వక్షోజాలలో ఎటువంటి మార్పు బయటికి కన్పించకుండా రీకన్‌స్ట్రక్టివ్ ఆంకో ప్లాస్టిక్ సర్జరీ ట్రీట్‌మెంట్స్ కూడా చేయగలుగుతున్నాం. అవగాహన పెంపొందించు కొని రొమ్ములోని ఎటువంటి మార్పుని నిర్లక్ష్యం చేయకుండా ఉంటే చాలా మంచిది.

(సశేషం)

# ఆదర్శజీవీ! మహాత్మా!

**భా**రతీయ రాజకీయాలలో ఆయన ఒక సమున్నత ఒంటరి శిఖరం. "శిఖరాన్ని అందరూ చేరాలని అనుకుంటారు. శిఖరారోహణ చేసినతర్వాత అక్కడే నిలిచేవాళ్ళు ఎవరూ వుండరు" ఆ మాటల్ని వాజ్‌పేయి ప్రధానిగా తాను ఎన్నికయినప్పుడు ఒక ఇంటర్వ్యూలో చెప్పారు.

**మ**నదేశ రాజకీయాలలో ఆఖరిక్షణం వరకు నిక్కచ్చిగా, నిజాయితీగా, దేశప్రయోజనాలకే పెద్దపీట వేసిన గొప్ప యోధుడు, సంస్కరణవాది. మీదుమించి మానవత్వానికి, ఉదారతకు పెట్టిందిపేరు అటల్‌జీ. 1924 డిశంబరు 25న కృష్ణబిహారి, కృష్ణాదేవి దంపతులకు గ్వాలియర్‌లో జన్మించారు.

రాజనీతిశాస్త్రంలో ఎమ్.ఎ. హిందీ, ఇంగ్లీషు, సంస్కృతభాషలలో డిగ్రీ పూర్తిచేశారు.

తాను యువకుడిగా వున్నప్పుడు బ్రిటీష్ కలోనియల్ రూల్‌ను వ్యతిరేకించి జైలుకు వెళ్ళారు.

తొలినాళ్ళలో ఆయన వామపక్షవిద్యార్థి సంఘం 'ఆల్ ఇండియా స్టూడెంట్ ఫెడరేషన్'లో సభ్యుడిగా పనిచేశారు.ఆపై 1939లో బాబా సాహెబ్ ఆప్టే ప్రభావంతో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌లో చేరారు. 1942లో తన అన్నగారితో కలిసి 'క్విట్ ఇండియా' ఉద్యమంలో జైలుకు వెళ్ళారు.

1951లో భారతీయ జనసంఘ్‌లో చేరి 1957లో తొలిసారి లోక్‌సభ సభ్యుడిగా ఎన్నికయ్యారు. ఆ తర్వాత 1962లో రాజ్యసభకు మొదటిసారి ఎన్నికయ్యారు. 1968 సంవత్సరంలో జనసంఘ్‌కు అధ్యక్షుడుగా బాధ్యతలు స్వీకరించారు.

1975లో ఇందిరాగాంధీ విధించిన ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా ప్రతిపక్ష నేతలతో కలిసి అరెస్టు అయ్యారు. 1977లో జనసంఘ్ మద్దతుతో ఏర్పడిన జనతాపార్టీ ప్రభుత్వంలో విదేశాంగమంత్రిగా బాధ్యత చేపట్టారు. మంత్రిహోదాలో ఐక్యరాజ్యసమితిలో తొలిసారిగా హిందీలో ప్రసంగించారు.

1980లో జనసంఘ్ భారతీయ జనతాపార్టీగా పునర్వ్యవస్థీకరింపబడినప్పుడు పార్టీ తొలి అధ్యక్షులుగా వున్నారు. పార్లమెంట్ సభ్యులుగా వాజ్‌పేయి దాదాపు 47 సంవత్సరాలపాటు సేవలను అందించారు. 10 సార్లు లోక్‌సభకు ఎన్నిక కాగా రెండుసార్లు రాజ్యసభకు ఎన్నికయ్యారు. 1984లో గ్వాలియర్ నుంచి మాత్రమే ఆయన ఓడిపోయారు.

1996లో తొలిసారి ప్రధానిగా ఎన్నికై 13 రోజులపాటు పనిచేశారు. 1998లో రెండవసారి ప్రధానిగా ఎన్నికై 13 నెలలు ఆ పదవిలో వున్నారు.

ఆ సమయంలోనే పోఖ్రాన్‌లో అణుపరీక్షలు నిర్వహించారు. 1999లో మూడవసారి ప్రధానిగా బాధ్యతలు చేపట్టారు. ఫిబ్రవరిలో ఢిల్లీ, లాహోర్‌ల మధ్య బస్సు సర్వీసులను మొదలుపెట్టారు.

మే, జూలై నెలలమధ్య కార్గిల్‌లో పాక్ చేసిన దురాక్రమణను ధీటుగా తిప్పికొట్టారు.

2004 వరకు దాదాపు పూర్తికాలం కాంగ్రెసేతర ప్రధానమంత్రిగా మొదటిసారి దేశాన్ని పాలించారు.

**అ**టల్ అంటే కఠినమైనది లేదా స్థిరమైనది అని అర్థం. అటల్‌జీ తాను ఏ పక్షంలో వున్నా కూడా రాజధర్మం పాటించటంలో నిక్కచ్చిగా వ్యవహరించేవాడు. బాబ్రీమసీదు కూల్చివేత ఒక దురదృష్టకరమైన సంఘటన, అది జరిగివుండాల్సినది కాదు



నాటి భారత ప్రధాని (2002) శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయితో జరిపిన అనేక విదేశీ పర్యటనలలో సైప్రస్, డెన్మార్క్, లండన్ మరియు కామన్‌వెల్త్ దేశాలలో పర్యటించిన సందర్భంగా వాజ్‌పేయితో 'స్వాతి' ఎడిటర్ శ్రీ వేమూరి బలరామ్

## అటల్‌జీతో నా అనుబంధం

**అ**రుదైన రాజకీయ దిగ్గజం, కవితలతో భావుకత్వ పరిమళాలు వెదజల్లిన స్నేహ స్వభావి, రాజకీయాలకు అతీతంగా దేశ అంతర్గత, విదేశీ సరిహద్దుల సమస్యలను పరిష్కరించేందుకు మనసా,వాచాకృషిసల్పిన మహానేత, మాజీ ప్రధానమంత్రి అటల్ బిహారీ వాజ్‌పేయి- తనదైన ఓ శకాన్ని స్థాపించి, వెళ్ళిపోయారు. ఈయనతో నాకున్న అనుబంధాన్ని ఈ సందర్భంగా స్మరించుకుంటున్నాను.

ఆయనతో కలిసి రెండుసార్లు విదేశీ పర్యటనలు చేసిన అరుదైన అవకాశం 'స్వాతి' పత్రికల సంపాదకుడిగా నాకు దక్కింది. *2002* సంవత్సరంలో అక్టోబర్ ఏడో తేదీనుంచి పదమూడో తేదీవరకు అప్పటి ప్రధాని అటల్ బిహారీ వాజ్‌పేయితో సైప్రస్,డెన్మార్క్, లండన్ దేశాల పర్యటనలో పాల్గొన్నాను.

ఎంతో హాస్యచతురత ప్రదర్శించే వ్యక్తిగా పేరున్న వాజ్‌పేయి ఆ యా దేశాలతో గల సమస్యలపట్ల దేశాధినేతలతో జరిపిన చర్చలు, పర్యటనల్లో స్వదేశీ ఔన్నత్యాన్ని చాటుతూ చేసిన ప్రసంగాలు విని నేను

# మానవుడా!



అని నిజాయితీగా తేల్చిచెప్పిన మనిషి వాజ్‌పేయి.

అలాగే గుజరాత్‌లో గోధ్రా అల్లర్లు జరిగినప్పుడు వాజ్‌పేయి ఎంతో ఆవేదన చెందారు. రాజధర్మాన్ని అనుసరించి మోడీ సమాజంలోని అన్ని వర్గాలపట్ల సమాదరణ కలిగివుండాలని చెప్పారు. సుస్థిరమైన ప్రభుత్వంకోసం, పొరుగుదేశాలతో మంచి సంబంధం కోసం గట్టిగా ప్రయత్నించారు అటల్‌జీ.

స్వర్ణచతుర్భుజి పథకం జాతీయ రహదారులను 4నుండి 6 వరుసలుగా విస్తరించటానికి ఉద్దేశించింది. ఢిల్లీ, ముంబయి, చెన్నై, కోల్‌కతా అనే 4 మెట్రోపాలిటన్ నగరాలను కలిపే జాతీయ రహదారులను అదే విధంగా శ్రీనగర్ నుంచి కన్యాకుమారి వరకు పోరుబందరు నుండి సిల్‌సార్ వరకు వున్న రహదారులన్నింటినీ 4/6 వరుసలుగా విస్తరించే గొప్ప పథకాన్ని అమలులో పెట్టినవారు వాజ్‌పేయి. 1999లో ఇస్లామిక్ ఛాందసవాదుల నుంచి నిరసనలు వెల్లువెత్తుతున్నా పట్టించుకోకుండా పాక్‌ను పర్యటించారు.

1999 ఫిబ్రవరి 19వ తేదీ ప్రధాని వాజ్‌పేయి అట్టారి వాఘా సరిహద్దులో పాకిస్తాన్‌లోకి ప్రవేశించారు. ఈ బస్సుయాత్ర ఇరుదేశాలమధ్య శాంతిని పెంచాలనీ ఆకాంక్షించారు.

"మనం స్నేహితుల్ని మార్చుకోగలం.కానీ ఇరుగు పొరుగులను మార్చుకోలేం కదా" అని వాజ్‌పేయి అన్నారు. పొరుగుదేశాలవారికి స్నేహహస్తం అందించటం కోసం ఢిల్లీ, లాహోర్ బస్సు యాత్ర చేసినా, ముషారఫ్‌ను ఆగ్రాకు రప్పించినా, ఆ ఘనత అంతా కూడా వాజ్‌పేయిదే.

వాఘా సరిహద్దు వద్ద 50 ఏళ్ళు పైగా రగులుతున్న విద్వేషపుగోడలను బద్దలుకొట్టి పాకిస్తాన్‌కు స్నేహహస్తాన్ని అందించారు వాజ్‌పేయి.ఆ తర్వాత 3 నెలలకు పాకిస్తాన్ కార్గిల్‌లో అతిక్రమణకు తెగబడితే, తగిన బుద్ధి చెప్పిన ధీశాలి కూడా ఆయనే.

ఎవరిని ఎక్కడ వుంచాలో, ఏ సమయానికి ఏమి చేయాలో తెలిసిన గొప్ప రాజనీతిజ్ఞుడు వాజ్‌పేయి. ఆనాటి ఆర్మీచీఫ్ పాకిస్తాన్‌పై దాడి చేయటానికి అనుమతి కోరితే వాజ్‌పేయి అంగీకరించలేదు. అలా అని మెత్తగా వ్యవహరించారు అని అనటానికి అవకాశం లేదు. ఆ సమయంలో వాజ్‌పేయి అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్‌కు రాసిన లేఖలో 'కార్గిల్‌లో పోరాటం ద్వారా పాకిస్తాన్‌ను వెనక్కు పంపలేకపోతే, మరో పద్ధతిలోనైనా తరిమికొడతాం. వెనక్కితగ్గే అవకాశమే లేదు" అని స్పష్టంగా తెలియజేశారు.

అవసరమైతే అణ్వాస్త్రాలను ప్రయోగించటానికి కూడా సిద్ధంగా వున్నట్టు సంకేతాన్ని ఇచ్చారు. ఆ తరువాత, అమెరికా కమాండర్ ఇన్ చీఫ్ జిన్నీని ముషారఫ్‌తో మాట్లాడేందుకు పంపించారు.

పాక్ ప్రధాని కాశ్మీర్ సమస్య గురించి ఎత్తబోతే, ఆపి "ముందు కార్గిల్ దాడులు ఆపండి, లేదంటే చేజేతులారా అణుయుద్ధం కొనితెచ్చుకున్నవాళ్ళు అవుతారు" అని జిన్నీ చెప్పారు. దాంతో పాక్‌సేనలు కార్గిల్ నుంచి వెనక్కితగ్గాయి. ఇది వాజ్‌పేయి ధైర్యానికి, రాజనీతిజ్ఞతకు గొప్ప మచ్చుతునక.

అలాగే, 2003 మార్చిలో అమెరికా అధ్యక్షుడు జార్జ్‌బుష్ ఇరాక్‌పై యుద్ధాన్ని ప్రకటించి తమ మిత్ర దేశాలను యుద్ధంలో పాలుపంచుకోమని పిలిచారు. 20,000 మంది సైనికులను పంపాలని స్వయంగా బుష్ కోరినా వాజ్‌పేయి తిరస్కరించారు.

అంతేకాక, పార్లమెంటులో అమెరికా దాడిని ఖండిస్తూ ఇరాక్ దేశపు సార్వభౌమత్వాన్ని ఎలుగెత్తి ప్రపంచానికి చెప్పారు. వాజ్‌పేయి ప్రతిపక్షంలో 4 దశాబ్దాలు పార్లమెంటులో పనిచేశారు.

దొంగదాడికి తెగబడితే గట్టిగా బుద్ధిచెప్పినవాడు. శాంతికాముక దేశం మనదైనా, పోఖ్రాన్ అణుపరీక్ష ద్వారా మన శక్తిసామర్థ్యాలను లోకానికి, గట్టిగా చూపించినవాడు. దేశాభివృద్ధికోసం రోడ్ల విస్తరణ పథకాలను రూపుదిద్దినవాడు.

భారతదేశంలో అంతర్భాగమైన కాశ్మీర్‌కోసం ఐక్యరాజ్యసమితిలో శత్రువుల వాచాలత్వానికి అడ్డుకట్ట వేసారు అటల్‌జీ. కార్గిల్ దాడుల సమయంలో ధీరుడిలా పాకిస్తాన్‌కు గట్టి హెచ్చరికనే చేశారు.

నేటి కాలపు బురద రాజకీయాలలో కమలంలా వికసించినవాడు అటల్ బిహారీ వాజ్‌పేయి.

మంచి రాజకీయాలకు ఆయన చుక్కాని. ఆయన చూపిన మార్గంలో నేటి మన నాయకులు నడిస్తే అదే ఆయనకు ఇచ్చే గొప్ప నివాళి.

ఆనందంతో ఉప్పొంగిపోయేవాడిని. ఇప్పుడాయన దూరమయ్యాక ఆ ఆనందపు స్మృతులు కళ్ళను చెమ్మగిల్లింపజేస్తున్నాయి.

ఆ వారం రోజుల పర్యటన, అటల్‌జీతో సన్నిహితంగా గడిపిన సందర్భాలు నా జీవితంలో మరవరాని, గర్వించతగ్గ అనుభూతులు.

మరుసటి సంవత్సరం(2003) డిశంబరు ఐదో తేదీ నుంచి ఎనిమిదో తేదీ వరకు కామన్వెల్త్‌దేశాల (చోగమ్) శిఖరాగ్ర సమావేశాలలో పాల్గొనేందుకు అటల్‌జీతో వెళ్ళే రెండో అవకాశం లభించింది.

నైజీరియాలో నాలుగురోజులపాటు జరిగిన కామన్వెల్త్ ప్రభుత్వాధినేతల శిఖరాగ్ర సమావేశానికి ఆనాటి ప్రధానమంత్రి వాజ్‌పేయి గారి వెంట వెళ్ళిన పత్రికాబృందంలో తెలుగు పత్రికలలో ఒక్క 'స్వాతి'కే ప్రాతినిధ్యం లభించింది.

ఇలా రెండుసార్లు ఈ రాజకీయ యోధుడితో కలిసి విదేశీ పర్యటనలు చేశాను. ఆయన పక్కనే ప్రత్యేక విమానంలో కూర్చుని వెళ్ళడం ఓ మధురానుభూతి. డెబ్బై ఏళ్ళకుపైగా దేశంకోసం శ్రమించిన ఈ రాజకీయ భీష్ముడు సెలవు తీసుకున్నారు శాశ్వతంగా...! ఆయన ఆత్మకు శాంతి కలగాలని, శిరస్సు వంచి ప్రార్థిస్తున్నాను. ◆

# ఒక చిన్నమాట

సాఫల్యము ఆనందాన్నిస్తుందా? ఆనందం సాఫల్యానికి దారితీస్తుందా? ఈ విషయంలో మనకు సరైన అవగాహన ఉందా? ఆలోచించేకొద్దీ చిక్కుప్రశ్నలా తోస్తుంది.

మరి కొంతమంది "ఇందులో చిక్కేముంది. సాఫల్యము, విజయము ఉంటే ఆనందమే కదా!" అని కూడా అడగవచ్చు.

సాధారణంగా ఒకదానితో మరొకటి చేర్చి ఇదే అది అని భ్రమపడటం కూడా జరుగుతుంది. లాభము, సంపాదన ఉంటే అదే ఆనందమని అనుకుంటారు.సాఫల్యానికి అందే ఫలమే ఆనందం అని కూడా భావించవచ్చు.

కాని సాఫల్యం ఆనందాన్ని ప్రతిఫలించదు. సాఫల్యం ఆనందంలో ఒక అంశం కావచ్చు. అయితే జీవితంలో విజయం సాధించినవారు, అత్యంత ధనవంతులు ఎప్పుడూ ఆనందంగా ఉంటారని చెప్పలేము. శిఖరాగ్రం చేరుకునే తపనలో వాళ్ళెంత ఆనందం పోగొట్టుకున్నారో ఎవరికి ఎరుక?

సాఫల్యంగురించి బార్బారా బుష్ ఈ విధంగా అంటారు. "నీ జీవితం ముగిసేటప్పుడు ఇంకొక పరీక్ష నెగ్గలేదే అని దుఃఖపడవు.

ఇంకొక కేసు గెలవలేదనీ, మరొక బేరము కలిసి రాలేదనీ బాధపడవు. భర్తతోనో, భార్యతోనో, బిడ్డతోనో,స్నేహితునితోనో,తల్లిదండ్రులతోనో సమయం గడపలేకపోయానే అనేదే నీ బాధ"

కాబట్టి సాఫల్యము, ఆనందము వేరు, వేరు కావచ్చు కాని అవి పరస్పర ఆశ్రితాలూ కావచ్చు. వీటిగురించి కొన్ని భావాలు ప్రస్ఫుటమవుతాయి.

సాఫల్యము ప్రపంచంలోని ధనమైతే, ఆనందాన్ని దానిని ఖర్చుపెట్టటంగా భావించవచ్చు.

సాఫల్యాన్ని అంచనావేయగలము. కొలతలుంటాయి. ఆనందానికి కొలతలుండవు. విజయాన్ని సంపాదించాలి. ఆనందాన్ని పొందాలి.

విజయమంటే మనకిష్టమైన పనిచేయటం. ఆనందం మనంచేసే పనిని ఇష్టపడినప్పుడు వస్తుంది. విజయం వెంట మనం పడాలి. ఆనందాన్ని మనం సాధించాలి.విజయం ఈర్ష్యకు తావు కల్పించవచ్చు. ఆనందాన్ని పంచుకోవచ్చు. ఈ విధంగా మాటల్లో ఎన్నో విధాలసాఫల్యాన్ని,ఆనందాన్ని వర్ణించుకోవచ్చు. ఆధ్యాత్మిక గురువు దాదా వాస్వాని ఆనందంగా ఉండటమే సాఫల్యమని చెపుతారు.

ఈ సందర్భంలో టావ్ ఆలోచనను పేర్కొంటారు. "నీవు ప్రేమించే ఉద్యోగం చేశావంటే ఒకనాడు కూడా పనిచేసినట్లుండదు"

సాఫల్యాన్ని, ఆనందాన్ని కూడా పొందగలిగే మార్గం దాదా వాస్వాని చెపుతారు.

"కేవలం వేతనంకోసం పనిచేయవద్దు. దేవుడి ప్రేమ కోసం నీవు పనిచెయ్యి. నీవు మానవజాతిపట్ల ప్రేమకొద్దీ పనిచేయవచ్చు లేకపోతే పని మీద ప్రేమతోనే పనిచెయ్యవచ్చు. అప్పుడు నీ పనే నీకు ఆనందాన్ని, ఉత్సాహాన్ని ఇస్తుంది"



పనిచేసేవారిలోను మూడు రకాలు ఉన్నారని యాండ్రూ కార్నెగి చెపుతారు.

మొదటి రకం ఎంత తక్కువ పనిచేస్తే అదే చాలనుకునేవారు. రెండవ రకం తమకెంత పని ఇస్తే అంతమాత్రమే చేసేవారు.

మూడో రకం తమ విధినీ నిర్వహిస్తారు. అంతకు మించీ చేస్తారు. పనిపట్ల ఒకరి దృక్పథం కూడా సాఫల్యమో, వైఫల్యమో తెలియజెపుతుంది.

సంపదలో ఆనందం లేకపోయినా ఆనందం అనుభవించటంలో ఎంతో సంపద ఉంటుంది.

జీవితంలో పదవి, హోదా, సంపద, పలుకుబడి, అధికారము అన్నీ జీవితాన్ని బయటనుండే స్పృశిస్తాయిగాని లోతుల్లోకి వెళ్ళవు.

మేనేజ్‌మెంట్ పద్ధతిలో ఆనందానికి కూడా దీన్ని మూలాలు వెతుక్కోవచ్చు. మేనేజ్‌మెంట్, కమ్యూనికేషన్, పబ్లిక్ రిలేషన్స్ వంటివన్నీ ఉద్యోగాలకు సంబంధించినవని, అవి అధ్యయన విషయాలని మాత్రమే మనం చాలావరకు భావిస్తాము.

ఇవన్నీ మన జీవితంలో భాగమైతే వ్యక్తిత్వ వికాసమే కాదు, సాఫల్యంకూడా మన వెంటే ఉంటుంది. ఆనందానికి కొన్ని సూత్రాలు తెలుసుకుందాం.

చిత్రంగా ఇది సాఫల్యానికికూడా సోపానాలవుతాయి. కృతజ్ఞత అత్యంత కీలక విషయం. మనవద్ద లేని వాటికోసం తపన చెందామంటే అది లేమినే సూచిస్తూ వస్తుంది.

ఆ విధంగా లేమిలో జీవించటం దుఃఖదాయకమే. మన దగ్గర ఉన్నవాటిని దృష్టిలో పెట్టుకున్నామంటే, దానికి కృతజ్ఞత తెలుపుకున్నామంటే ఆనందం మన స్వంతం అవుతుంది.

"మా దగ్గర ఏమి ఉంది? భవంతులా, కార్లా, హోదానా, సంపదా?" అని లేమిని సూచించుకునే బదులు మన ఆరోగ్యం గురించో, శరీర దారుఢ్యం గురించో, సుఖసంసారంగురించో ఆలోచించుకుని తృప్తి పొందవచ్చు. మనకున్నదానిపట్ల కృతజ్ఞతతో జీవితాన్ని స్వీకరిస్తే సాఫల్యమూ సిద్ధిస్తుంది.

తర్వాత మనం గతాన్ని గురించి, భవిష్యత్తును గురించి ఆలోచిస్తూ ప్రస్తుతంలో జీవించటం మరచిపోతాం. అన్నిటికంటే అమూల్యమైనది ప్రస్తుతం. ప్రస్తుతాన్ని అనుభవంలోకి తెచ్చుకుంటే సమస్యలున్నా అధిగమిస్తాం. సమయాన్ని సరిగ్గా వెచ్చించుకోటం నేర్చుకుంటే (టైమ్ మేనేజ్‌మెంట్) సగానికిపైగా సమస్యలు తీరిపోతాయి.

లక్ష్యాలు ఏర్పరచుకోటంలోనూ జాగ్రత్తలు పాటించాలి. నిర్దిష్టంగా, అర్థవంతంగా, సాధ్యమయ్యేవిగా, నిర్దిష్ట సమయంలో పూర్తయ్యేవిగా ఉండాలి. వాటిని పునఃపరిశీలించి, అవసరమైన మార్పులు చేర్పులతో లక్ష్యసాధనకు ప్రయత్నించగలిగేలా ఉండగలగాలి. ఉదయాలు చాలా శక్తివంతంగా ఉంటాం.

పనులకు ఉదయాలను కేటాయిస్తే సమర్థవంతంగా పనులవుతాయి. ప్రారంభం ఎలా ఉంటే దినమూ అలాగే గడుస్తుంది.

ఏమి సాధించాలన్నా, ఏది పొందాలన్నా ముందు శరీరం ఆరోగ్యంగా, దృఢంగా ఉండాలి.

ఆరోగ్యవంతమైన శరీరంతో సకారాత్మకంగా జీవితాన్ని ఆహ్వానించే వీలుంటుంది.

జీవితంలో సాఫల్యం ఉంటే కావలసినవి పొందవచ్చు. అప్పుడు ఆనందం పొందవచ్చు. వీటిని విడివిడిగా పొందలేమని కొందరంటారు.

దాదా వాస్వాని మాటల్లో సాఫల్యమంటే ఆనందంగా ఉండగలగటం, ఇతరులు ఆనందంగా ఉండేటట్లు చూడటం. ప్రేమించాలి. ప్రేమింపబడాలి. మనతో శాంతిసామరస్యాలతో మనం మనగలగాలి. మన చుట్టూ ఉన్నవారితో, దేవుని అంతరిక్ష న్యాయాలతో, శాంతిసామరస్యాలతో జీవించాలి.



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

విచిత్ర
విశేషాల
సీరియల్
వచ్చేవారమే

ఈమె వయసు పాతిక సంవత్సరాలు
గ్రాండ్ రెస్టారెంట్ వద్ద కిడ్నాపయ్యింది
ఈమె జాడ తెలిపినవారికి యాభై లక్షల బహుమతి
టీ.వీ.స్క్రీన్ మీద నిండుగా కనబడుతున్న ఆ అందమైన యువతిని చూసి
అప్రయత్నంగా 'ఓ మైగాడ్' అనుకున్నాడతను.
టీ.వీలో కనపడుతున్న యువతి, తనవద్దకొచ్చిన యువతి ఇద్దరూ ఒక్కటే!
ఐతే పెదవికింద పుట్టుమచ్చ ఒక్కటే తేడా!
ఆ యువతుల్లో అసలెవరు? నకిలీ ఎవరు? తలపట్టుకున్నాడతను

# సూర్యదేవర రామ్మోహనరావు

# డబ్బులెవరికీ ఊరికే రావు సీరియల్లో

ఇటువంటి విచిత్ర సంఘటనలెన్నో?!
వచ్చేవారమే ప్రారంభం!

Courtesy :BETTER PHOTOGRAPHY

# వరలక్ష్మీ వ్రతం

ఏ వ్రతం లేదా పండుగని చేయాలని ప్రాచీనులు నిర్ణయించారో దానిలో ఉన్న పరమార్థాన్నిగాని మనంగమనిస్తే మన జీవితంలో ఒడిదుడుకులకి అవకాశం రానేరాదు.

ఏదో మొక్కుబడిగా వ్రతం అనగానే కేవలం పూజాపునస్కారాలకే అంకితం చేసుకుంటే కొన్నాళ్ళకి 'వ్రతం' అనగానే 'ఇంతేగా!' అనే నిర్లిప్త భావం కలుగుతుంది. ఈ నేపథ్యంలో వరలక్ష్మి వ్రతం గురించి నాలుగుమాటలు చెప్పుకుందాం!



Courtesy : DEEPAM

## సూర్యోదయానికి ముందే

వ్రతం అనగానే ఇంటికి యజమానురాలైన గృహిణి తెల్లవారు జామునేలేచి స్నానం చెయ్యాలని చెప్పింది వ్రతకల్పం.

నిజానికి తెల్లవారుజామునేగాని నిద్రలేచినట్లయితే ఎంతో ఉత్సాహంగా ఉంటారు రోజురోజంతా.

రాత్రంతా సుఖంగా నిద్రపోయి ఉన్న కారణంగానూ, నిన్నపడ్డ శ్రమ మొత్తం రాత్రి నిద్రతో తొలగిపోయే కారణంగానూ తెల్లవారుజామున ఆ రోజు చేయాల్సిన పనులకి ఓ ప్రణాళికని తమకి తాము వేసుకోగలుగుతారు. అంతేకాక పెద్దపని కూడా ఓ పెద్దపని కాదనే ఓ ఆలోచనకి రాగలుగుతారు. తెల్లవారు జామున ఎవరూ అంటే భర్తా పిల్లలూ... ఇలా ఎవరూ లేవని కారణంగా ఓ గంటలో కావలసినంత పని అరగంటలోనే పూర్తిచేసుకోగలుగుతారు.

ఇంతేకాదు, నిదానంగా నిద్ర లేచినవారికి తర్వాత ఇల్లంతా పరిశుభ్రంగా ఉండి కన్పిస్తుండడంతో రోజు రోజంతా వాళ్ళ మనసూ బుద్ధీ ప్రశాంతంగా ఉండాలి, ఉంచుకోవాలనే ఆలోచనకి వస్తారు. లేదా కనీసం ప్రశాంతంగా ఉంచుకుంటే ఇంత బాగుంటుందా? అని అనుకోగలుగుతారు.

## ఎవరికి ఏం అవసరమో?

"ఈ రోజు ఫలానా వ్రతం కాబట్టి మీమీ పనుల్ని మీరే ముగించుకోండి! నేను ఏపనినీ చేయ(లే)నంటూ మాట్లాడ్డం కుటుంబ ఐకమత్యాన్ని దెబ్బతీస్తుంది.

చాలామంది ఇళ్ళలో పండుగ లేదా వ్రతం లేదా నోము వచ్చిన రోజున తాను ఆ పనిలోనే నిమగ్నమైపోయి వీళ్ళని పట్టించుకోకుండా ఉండడాన్ని గమనిస్తాం. అంతేకాదు... తన వ్రతానికి, నోముకి పండుగకి సంబంధించిన పనులకి వీళ్ళని అడ్డుగా వస్తున్నట్లు నోరు చేసుకోవడాన్ని కూడా గమనిస్తూ ఉంటాం! అందుకే వరలక్ష్మి వ్రతం చెప్తాంది-

వాళ్ళ పనుల్ని పూర్తిచేయడంకోసం ఎవరెవరికి ఏమేం అవసరమో గమనించి వాళ్ళకి తనతో తాత్కాలికంగా అవసరం లేకుండా చేసుకోవాలని. పిల్లలకి అమ్మ లేదా తనకి భార్య ఇంత పనిని చేసుకుంది ఈరోజున అనే ఆలోచన కలగడమే కాక, ప్రత్యక్షంగా చూస్తున్న కారణంగా ఓ చిన్న పని మిగిలినా ఆ పనిని వాళ్ళే పూర్తిచేసుకుంటూ సహకరిస్తారు, వ్రతాన్ని చేస్తున్న గృహిణికి. ఆలోచించుకోవాలి.

**వరలక్ష్మి వ్రతం : 24.8.2018**

## తోటి స్త్రీలతో...

ఈ రోజుల్లో ఎందరో స్త్రీలు ఎంతో మానసిక సంఘర్షణతోనో, పనులతో సతమతమైపోతూనో, పెద్ద గొంతుకతో నోరుపారేసుకుంటూనూ ఒక్కో సందర్భంలో చేతుల్లో ఏది వుంటే దాన్ని విసిరేస్తూ తీవ్ర కోపం అసహనం... వంటి వాటితో రోజు రోజునీ పాడుచేసుకుంటున్నారు ప్రశాంతత లేకుండా.

అందుకే పెద్దలు ఈ ఇబ్బంది స్త్రీకి లేకుండా చేయాలనే ఉద్దేశ్యంతో తోటి స్త్రీలతో (ఆధ్యాత్మికభావం పూజాపురస్కార విధానం) చక్కని కలుపుగోలుతనం ఉండాలనే విధానాన్ని ఏర్పాటుచేశారు.

దానికి అనుగుణంగా 'ఆ తీరు స్త్రీలని స్వయంగా తానే బొట్టు పెడుతూ, పేరుతో పిలుస్తూ తమ ఇంటికి వాయనాన్ని తీసుకోవడానికి రావలసిందిగా ఆహ్వానించా''లనే నియమాన్ని పెట్టారు.

పేరు అనడం, పిలవడం అనే ఈ పద్ధతికే పేరంటం (పేరు అంటూ పిలవడమన్న మాట) అనే పేరుని పెట్టారు. అయితే ఇక్కడో చిన్న మార్పు వచ్చేసింది లోకంలో.

ఈ వరలక్ష్మి వ్రతంరోజున అందరు స్త్రీలూకూడా లక్ష్మిరూపిణులే కాబట్టి వాళ్ళనిపిలుస్తూ ఉండే సందర్భంలో పార్వతీ లక్ష్మిగారూ! వాణీ లక్ష్మిగారూ! కృష్ణవేణి లక్ష్మిగారూ!.. అని ఈ తీరుగా లక్ష్మి అనే పేరుని వాళ్ళవాళ్ళ పేర్లకి చివరన తగిలించి మరీ పిలవాలన్నారు. మంచి ఆచారమైనప్పుడు మధ్యలో ఈ అలవాటు మరిచిపోయినా పాటించకపోతున్నా మళ్ళీ ఆ అలవాటుని పునరుద్ధరించుకోవడం మంచిదే తప్ప తప్పుకాదు కదా! పరిశీలించుకోవాలి!

## పదిమంది ఇళ్ళని చూస్తుంటే

పిలుపులకోసమని ఓ పదిమంది ఇళ్ళకి వెళ్ళడం జరుగుతుంది కాబట్టి ఏ ఇంటి తీరు ఎలా ఉందో

మన కళ్ళకి స్పష్టంగా అర్థమవుతుంది.

ఇంటిని ఎలా ఉంచుకోకూడదో, ఎలా ఉంచుకోవాలో ఆ విషయం తెలుస్తుంది! ఇల్లు అంటే కేవలం మంచి వస్తువులతో చక్కగా అలంకరించుకుని సర్దుకుని ఉండడమనేది అర్థంకాదు.

ఇంట్లో ఉండే మనుషులూ, వాళ్ళ మధ్య ఉండే సంబంధాలూ ఆత్మీయతలూ, ఎవరైనావస్తే మాత్రమే ఆప్యాయతలని ఒలికింపజేస్తున్నారా? అనే తీరు ప్రవర్తనలూ, గుండెనిండు ఆనందంతో ఆప్యాయతతో పలకరిస్తున్న తీరుతెన్నులూ.... ఇలా ఇవన్నీ మనకి తెలిసే అవకాశముంటుంది!



వాళ్ళు మనింటికొచ్చి "అలాఉండు! ఇలాఉండు!" అని సలహాలూ సూచనలూ ఇయ్యడం ఎంతవారికైనా అసహ్యమనిపిస్తుంది! అదే మరి మనకి మనమే మన గమనింపు మీద తెలుసుకోగలిగితే, నిజంగా ఆచరించితీరాలనే ఉత్సాహం కలుగుతుంది.

## పేరంటంలో

కొందరు మనింటికొస్తూనే వ్రతానికి సంబంధించిన విశేషాలూ, మాటలూ కాకుండా ఆ ఇంటావిడ గురించిన చాడీలనీ, ఈ ఇంటావిడ గురించిన విశేషాలనీ చెప్తూ దాంతోపాటు తమ గొప్పదనాన్ని కూడా చెప్పుకుంటూ కన్పిస్తారు.

మరొక కొందరు మనింటి రహస్యాలని పట్టిపట్టి లాగడమే తమ పనిగా కన్పిస్తారు. అదే మరి వాళ్ళ ఇంటి విశేషాలని పొరపాటున కూడా చెప్పకపోవడం కన్పిస్తూ ఉంటుంది. మరొకావిడ అడక్కపోయినా సలహాలూ, సూచనలూ ఇస్తూనే కన్పిస్తుంది.

ఇంకొకావిడ ఈ వ్రతం వంకతో పదిమంది స్త్రీల మధ్యకొచ్చి తాము చేస్తున్న వ్యాపారాన్ని ప్రచారం చేసుకోవడమే తన ధ్యేయంగా దొరికిపోతుంది.

తానూ తన పిల్లలూ తన భర్తమాత్రమే ఈ 125 కోట్ల భారతదేశంలో గొప్పవాళ్ళు అన్నట్లుగా అహంకారాన్నీ, అతిశయాన్నీ ప్రదర్శించుకుంటూ కన్పిస్తుంది. ఇలా ఎవరెవరి తీరుతెన్నులేవో మనకి మనం స్వయంగా గ్రహించుకోగలిగేలా చేస్తాయి వ్రతాలు లౌకిక దృష్టితో గమనిస్తే.

ఇదే సమయంలో ఎవరు తన కుటుంబం గురించి చెప్పినా ఆ విషయాన్ని తనలోనే దాచుకుంటుందో సరైన సూచనని అతిశయం లేకుండా ఒక తల్లిలా విషయాన్ని అర్థం చేసుకుని సరైన సలహాతోపాటు తెలియచెప్తుందో అలాంటి స్త్రీనికూడా మనం గుర్తించగలం. అందుకే అలనాటి స్త్రీలు అత్రిమహర్షి భార్య అనసూయకీ, వశిష్టుని భార్య అరుంధతికీ...

ఇలా గౌరవపూర్వకంగా నమస్కరిస్తూ వాళ్ళని మార్గదర్శకురాళ్ళుగా భావిస్తూ తమ జీవితాన్ని ధన్యం చేసుకుని కన్పిస్తారు.

## వ్రతకథ

ఒక్క వరలక్ష్మీ వ్రతానికే కాదు, ప్రతి వ్రతానికీ ఓ కథంటూ ఉంటుంది! దానిలో ప్రతి స్త్రీ ప్రవర్తించాల్సిన తీరుతెన్నులు వివరంగాకన్పిస్తాయి.

వరలక్ష్మీ వ్రతకథనే తీసుకుంటే ఆమె పేరు 'చారుమతి'. 'చారు'అంటే అందరినీ ఆకర్షించగల 'మతి' అంటే 'బుద్ధి కలిగినది' అని అర్థం.

అంటే ఆమె ఏం మాట్లాడినా అది అందరికీ నచ్చే తీరులో ఉంటుందన్నమాట! ఎప్పుడూ అసూయ, అహంకారం, ద్వేషం... వంటివేమీ లేకుండా ధర్మబద్ధంగా మాట్లాడుతున్నట్లయితే అది అందరికీ నచ్చితీరుతుంది కదా!

కాబట్టి అలా మాట్లాడడం అందరినీ ఆకర్షిస్తుందని ప్రతి స్త్రీగ్రహించాలన్నమాట! ఆమెకి లక్ష్మీదేవి కలలో కన్పించి తన అనుగ్రహం కలగాలంటే ఏ వ్రతాన్ని ఆచరించాలో ఆ విధానాన్ని స్పష్టంగా చెప్పిందంటుంది వ్రతకథ.

అంటే ఏమన్నమాట?

నిజమైన లక్ష్మీ అనుగ్రహం కలగాలంటే చారుమతి ఏ విధంగా ధర్మబద్ధంగా ఉందో అలా ఉండాలని అర్థమవుతుంది కదా!

ఇదే నిజమైతే మరి ఎందరో అధర్మపరులకి చెప్పలేనంత ఐశ్వర్యం ఉందికదా! మరి ఈ మాట ఎంత వరకు నిజం? అని అడగాలనిపిస్తుంది మనకి.

ఎందరికో ధనం ఉండచ్చునేమోగాని ఆ ధనం ఉన్నా మానసిక ఆనందం, బాంధవ్యంతో సంతోషం ఎందరికి ఉంది? అని పరిశీలిస్తే అలాంటివాళ్ళ ఇళ్ళల్లో ఉన్న ధనం చారుమతికి ఉన్న ధర్మబద్ధ విధానంతో సంపాదించిన ధనమో కాదో మనకి అర్థమయిపోతుంది.

అందుకే 'దుఃఖం విత్తస్య లక్షణమ్' మనోవ్యధకి గురికావడమే కొందరి ధనంవల్ల కలిగే ప్రయోజనమం(టుం)ది శాస్త్రం.

## అందరికీ చెప్పడం

చారుమతికి కలలో కన్పడి లక్ష్మీదేవి తన అనుగ్రహం కలగాలంటే ఏ వ్రతాన్ని ఎలా చెయ్యాలో చెప్పిందని చెప్తుంది కథ.

సహజంగా ఇలాంటి లక్ష్మీ దేవి అనుగ్రహం కలిగే ఉపాయమే- అందునా స్వయంగా లక్ష్మీదేవి నోటితోనే చెప్పగా తెలిసిందనగానే ఎవరైనా ఆ రహస్యాన్ని ఎవరికీ ఏ మాత్రమూ చెప్పనే చెప్పరు.

అయితే ఆమె పైన అనుకున్నట్లుగా చారుమతి అయిన కారణంగా తోటి స్త్రీలందరికీ వివరంగా చెప్పింది. చెప్పడమే కాకుండా అందరికీ తానే ఉపదేశకురాలూ, మార్గదర్శకురాలూ అవుతూ చేయించింది కూడా. దాంతో ఆ స్త్రీలందరికీ ఒక్కో ప్రదక్షిణకీ ఒక్కో తీరు బంగారు ఆభరణాలు లభించాయని చెపుతుంది కథ.

ఏదైనా ఓ విషయాన్ని హృదయపూర్వకమైన నమ్మకంతోగాని విని పాటించినట్లయితే అది తప్పక ఫలితాన్ని ఇస్తుందని శాస్త్రం చెబుతోంది.

అలా చారుమతి చెప్పిందాన్ని ఆమె నేతృత్వంలోనే వాళ్ళంతా ఆచరించారు కాబట్టి అందరికీ లక్ష్మీ అనుగ్రహం కలిగింది.

దాంతో వాళ్ళందరికీ చారుమతిమీద గౌరవాభిమానాలు పెరిగాయికూడా.

ఇలా స్త్రీలలో ఐకమత్యాన్ని పెంచేది వ్రతాలే అని తెలుసుకునే వీలుంది కదా!

డా॥ మైలవరపు శ్రీనివాసరావు

# మన్మథ ఎక్స్‌ప్రెస్

అమ్మలక్కలందరూ అమ్మాయిని సర్వాంగ సుందరంగా అలంకరిస్తున్నారు. శోభనం గదిని నందనవనంలాతీర్చిదిద్దుతున్నారు. సునంద మాత్రం ముభావంగా ఉంది. మరోవైపు కొత్త పెళ్ళి కొడుకు సుందర్ కూడా అలాగే ఉన్నాడు.

అతనికి ఈ పద్ధతులన్నీ చిరాకు పుట్టిస్తున్నాయి. అరేంజ్డ్ మ్యారేజ్ ఈ రేంజ్‌లో ఉంటుందని అతను ఊహించలేదు. ఐతే బంధుగణమంతా ఇంట్లో సందడిగా తిరుగుతూండడం ఒకవిధంగా సంతోషంగానే ఉంది. తమకు ఇంతమంది బంధువులున్నారా! అని మొదటిసారిగా ఆశ్చర్యపోయాడతను. సునందది కూడా అదే స్థితి.

అగరొత్తుల సువాసనలు, సిరిమల్లెల పరిమళాలురాబోయేవి మధురక్షణాలన్న విషయాన్ని చెప్పకనే చెబుతున్నాయి.కానీ అతని మనసుమీద ప్రభావం చూపలేకపోతున్నాయి. చిరాకుగా టైమ్ చూసుకున్నాడుసుందర్.తనుగదిలోకివచ్చి అరగంటైంది. ఇంకా ఏంచేస్తోంది తొందరగా రాకుండా?

తను చెప్పదల్చుకున్నదేదో చెప్పేసి ముసుగు తన్నేసి పడుకుంటే ఓ పనైపోతుంది అనుకుంటూ తలుపువంక దృష్టిసారించాడు. అప్పుడే తలుపువద్ద బయటనుంచి ఎవరో గెంటినట్టుగా లోనికి ప్రవేశించింది సునంద.

మామూలుగా సినిమాల్లో కనిపించే ఫక్తు అదే ఫస్ట్‌నైట్‌సీన్. నవ్వుకున్నాడు సుందర్. సునంద కూడా లోపలికి వచ్చేందుకు ఇంతగా సిగ్గుపడుతుందా?

పెళ్ళికిముందే ఇద్దరూ అన్ని విషయాలూ మనసువిప్పి మాట్లాడుకున్నారు కదా. మరి అంత సిగ్గెందుకు? సునందముఖంలో ఏ విధమైన ప్రతిక్రియా లేదు.

మెల్లగా వచ్చి తన చేతిలోని పాలగ్లాసును అతనికి అందించింది. అంతా సినిమాల్లో చూపించినట్టుగానే జరుగుతోంది. సుందర్ మాత్రం అత్యంత రిలాక్స్ మూడ్‌లో ఉన్నాడు. ఏమాత్రం టెన్షన్ లేదు. అతనివంక చూసిన సునంద భృకుటి ముడి వేసింది. పెళ్ళికి ముందు ఎంతగా కలిసి తిరిగిమాట్లాడుకున్నా ఇంతటి ఏకాంతంలో ఇద్దరూ కలుసుకోవడం ఇదే తొలిసారి. అందులోనూ రాత్రి సమయం.సునందకు గుండెదడ హెచ్చింది.

తాము మాట్లాడుకున్న మాటలన్నీ గాలికొదిలేస్తే? ఎంతైనా అతను మగాడుకదా? అందులోనూ వాతావరణం అందుకు అనుకూలంగానే ఉంది.

ఛి ఛీ... తనేమిటి ఇలా ఆలోచిస్తోంది. పెళ్ళంటే నమ్మకం. నమ్మి పెళ్ళిచేసుకున్నది ఇందుకా?' ఆమె అడుగు ముందుకు పడలేదు.

తలుపువద్దే నిలబడిపోయింది. అది చూసిన సుందర్ తనే మెల్లగా లేచి ఆమెవద్దకు వెళ్ళాడు. అతను సమీపిస్తుండడం చూసి ఆమె గుండెదడ మరింత హెచ్చింది. సన్నగా చెమటలు పట్టాయి.

ఆమె నుదుటిమీద ఉన్న స్వేదబిందువులు చూసిన సుందర్‌కు నవ్వొచ్చింది.

గదిలో ఏసీ ఉన్నా ఆమెకలా చెమటలు పట్టడం చూస్తే చిలిపిగా మరేదోచెయ్యాలనిపించింది. అంతలోనే ఆ ఆలోచన మానుకున్నాడు.



'తన తక్షణ కర్తవ్యం ఆమెను అనునయించాలి. ఆమెలో గూడుకట్టుకున్న బెరుకును భయాన్ని తొలగించాలి. ఆమెను కంఫర్ట్ చెయ్యాలి.

పెళ్ళికి ముందు ప్రమాణాలు గుర్తుచేసి కుదుట పరచాలి' అనుకుంటూ మెల్లగా ఆమె భుజం చుట్టూ చేతులు వేశాడు.

కుడిచేత్తో ఆమె చుబుకాన్ని ఎత్తి కళ్ళల్లోకి చూశాడు. ఆమెచూపులు ఒకచోట నిలవడం లేదు. కనుగుడ్లు విపరీతమైన వేగంతో కదులుతున్నాయి. చిన్నగా నవ్వాడు సుందర్.

"ఏమైంది? ఎందుకలా ఉన్నావు?" అనడిగాడు మెల్లగా, అనునయంగా. ఆ ప్రశ్నతో ఆమెచూపులు స్థిరంగా అతని మీద నిలిచాయి. పెదవి విప్పి ఏదో చెప్పాలని ప్రయత్నించిందికానీ మాటరాలేదు. ఏం మాట్లాడాలో తెలియలేదంటేనే బాగుంటుంది.

"పెళ్ళికిముందు గలగల మాట్లాడేదానివి ఇప్పుడేంటి భీతహరిణిలా ఉన్నావు?"

అప్పటికీ ఆమె నోరు పెగల్లేదు.

"సునందా, మనం పెళ్ళికి ముందు ఏమేం మాట్లాడుకున్నామో అవన్నీ తు.చ. తప్పకుండా పాటిద్దాం. ఇందులో ఏమాత్రం సందేహంలేదు. సరేనా?" అన్నాడు ఆమె భుజం మీద చిన్నగా తడుతూ. ఆమె పెదాలు సన్నగా విచ్చుకున్నాయి చిరునవ్వు కోసం. అప్పటికీ ఇంకా ఏవో సందేహాలున్నాయి ఆమె చూపుల్లో.

"ఒరేయ్ అబ్బాయ్, పడుకోబోయేముందు ఆ కొబ్బరికాయను పగలగొట్టి పడుకోవాలి మర్చిపోకు" అంటూ అమ్మమ్మ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. మెల్లగా మంచం కిందికి తొంగిచూశాడు. పొయ్యిలో పిల్లిలా అక్కడ ఒక పళ్ళెంలో బుద్ధిగా ఒదిగి కూర్చుని ఉందా కొబ్బరికాయ.

అదా నీ సందేహం అన్నట్టు చూశాడు సుందర్. నవ్వొచ్చింది. "ఏమిటో ఈ ఆచారం? ఇది దేనికి సంకేతం? సంసారజీవితం ప్రారంభోత్సవానికి సంకేతమా? ఈ శబ్దానికి పిల్లలు సంసారజీవితం ప్రారంభించారన్న సంకేతం బయట ఉన్న అమ్మలక్కలకందరికీ తెలియాలన్నమాట" నవ్వాగలేదతనికి.

**"కొత్త బండి కొనుక్కుంటే దానికి పూజ చేయించి కొబ్బరికాయ కొట్టి ప్రారంభిస్తారు" అన్నాడు అతను. అలాగా అన్నట్టు తలూపి అంతలోనే "ఛీ" అంటూ ముఖాన్ని రెండు చేతుల్లో దాచుకుంది ఆమె. మెల్లగా ఆమె చేతులు విడదీసి "ఇందులో సిగ్గుపడేందుకేముంది? ఇదికూడా ప్రారంభోత్సవమే కదా. మన దాంపత్య జీవితానికి" అన్నాడతను. ఇంతలో...**



"ఎందుకు నవ్వుతున్నారు?"

"మరింకేం చెయ్యమంటావు. లోపలికొచ్చేటప్పుడు మీ ముసలివాళ్ళు నీకేమీ చెప్పలేదా?" అన్నాడు గుంభనంగా నవ్వుతూ.

"లేదే" అని అంతలోనే "ఆ, చెప్పారు. పడుకోబోయేముందు కొబ్బరికాయను పగలగొట్టి పడుకొమ్మన్నారు" అంది సునంద.

"అలా ఎందుకు చెయ్యాలట?"

"ఏమో అడగలేదు. వాళ్ళు చెప్పింది చేస్తే సరి"

"లాజికల్‌గా దాని అర్థం తెలుసా"

"తెలీదు"

"ప్రారంభోత్సవమంటే తెలీదా?"

అడ్డంగా తలూపింది సునంద.

"కొత్త సినిమా ప్రారంభోత్సవానికి పూజ చేసి కొబ్బరికాయ కొడతారు. కొత్తబండి కొనుక్కుంటే దానికి పూజ చేయించి కొబ్బరికాయ కొట్టి ప్రారంభిస్తారు. ఇప్పుడర్థమైందా?"

అలాగా అన్నట్టు తలూపి అంతలోనే "ఛీ" అంటూ ముఖాన్ని రెండు చేతుల్లో దాచుకుంది.

మెల్లగా ఆమె చేతులు విడదీసి "ఇందులో సిగ్గుపడేందుకేముంది? ఇదికూడా ప్రారంభోత్సవమేకదా. మన దాంపత్య జీవితానికి ప్రారంభోత్సవం"

విప్పారిన కళ్ళతో "అలాగా?" అన్నది.

"అంతకాక ఇంకెంత. మనం అనుకున్న ప్రకారమైతే అంతకన్నా ఇంకేమీ లేదుకదా" అన్నాడు కళ్ళు పెద్దవి చేస్తూ. మరింతగా సిగ్గుపడింది సునంద. మెల్లగా మంచం దగ్గరికి నడిపించుకుని వెళ్ళాడు.

ఇద్దరు వియ్యపురాళ్ళు నిశ్శబ్దంగా కూర్చుని ఉన్నారు. "మూడురాత్రులయ్యాయి కానీ విశేషమేమీజరిగినట్టులేదు" అన్నది సునందతల్లి సుకన్య.

"ఈ కాలపు పిల్లల్ని అర్థం చేసుకోలేకున్నాం" సుందర్ తల్లి భారతి పెదవి విరుపు.

"పెళ్ళికి ముందు చిలకా గోరింకల్లా చెట్టాపట్టాలేసుకుని తిరిగినవాళ్ళు పెళ్ళయ్యాక ఇలా ఉండగలరు? అప్పటివరకూ ఉన్న బంధనాలన్నీ విడిపోయాయన్న ఆనందంతో ఉప్పొంగి ఉప్పెనలా మారిపోవాలిగానీ ఇలా అంటీముట్టనట్టుగా ఉండడం సాధ్యమా?"

"ఏమిటి మీ చర్చ?" అంటూ సుందర్ తండ్రి అక్కడికి వచ్చాడు అదే సమయంలో.

తడబడి సునంద తల్లి దిగ్గున లేచి నిలబడింది. వెంటనే ఇద్దరూ సిగ్గుపడిపోయారు.

"మీ మాటలు వినబడ్డాయి. ఐనా మనలో మాట. మనం తప్పుగా ఆలోచిస్తున్నామేమో. పూర్వకాలపు ఆచారాలను ఈ కాలంలో అమలుచేస్తే ఫలితం ఉంటుందా. కనిపెట్టగలమా?" ఆ మాటలకు మరింతగా సిగ్గుపడ్డారిద్దరు వియ్యపురాళ్ళు.

"వాళ్ళు ఒకటికాలేదని మనమెలాచెప్పగలం? నేను చెప్పేదాంట్లో నిజంపాలెంతో మీరే ఆలోచించండి" అంటూ అక్కణ్ణుంచి నిష్క్రమించాడు. లోతుగా ఆలోచించడానికి సిగ్గుపడ్డారిద్దరు ఆడవాళ్ళు.

"ఏంటి వదినగారూ. ఇలాఅడ్డంగా దొరికిపోయాం. ఈవయసులో మాట్లాడుకునే మాటలేనా అనుకోరూ. సిగ్గుతో చచ్చిపోతున్నాను" అన్నది సుకన్య ముఖాన్ని చేతుల్తో కప్పుకుంటూ.

"ఇది మరీ బాగుంది. మన మాటలు ఆయన వింటారని కలగన్నామా? మీరేమీ అనుకోవద్దు. ఆయన ఇవన్నీ పెద్దగా పట్టించుకోరు" అన్నది భారతి. అయినా సుకన్య సిగ్గుతగ్గలేదు. ఆరోజు రాత్రి భారతి తన భర్త విష్ణుమూర్తితో మాట కలిపింది. "ఏమండీ వాళ్ళిద్దరూ సంతోషంగానే ఉన్నారంటారా?" అని.

"నీకెందుకొచ్చింది సందేహం?"

"వాళ్ళకేదైనా ముద్దుముచ్చట ఉంటేనే కదా, మనకు మనవడో మనవరాలో ఉంటారు"

"మన కర్తవ్యం మనం నిర్వహించాం. ఇక వాళ్ళ జీవితం వాళ్ళిష్టం"

"వాళ్ళ నిర్ణయం మంచిదే కావచ్చు కానీ దాన్ని అమలుచేసే విధానమే బాగలేదు. కానీ దాన్ని విడమర్చి చెప్పడం ఎలాగో అర్థం కావడంలేదు"

"నేరుగా చెప్పలేం. కానీ డొంకతిరుగుడుగా చెప్పగలిగితేనో"

ఎస్. ఘటికాచలరావు




## GRT JEWELLERSకి అవార్డులు

ఐదున్నర దశాబ్దాలుగా, లక్షలాదిమంది విని యోగదారులకు విశ్వాసపాత్రంగాగల జి.ఆర్.టి. జ్యూయలర్స్‌కు ప్రతిష్ఠాత్మక అవార్డులు దక్కాయి. జి.ఆర్.టి జ్యూయలర్స్‌కు ఐకానిక్ బ్రాండ్ రైజింగ్ స్టార్ 2018 అవార్డు దక్కింది. వ్యవస్థాపకులు మరియు చైర్మన్ జి.రాజేంద్రన్‌కు ఇన్‌స్పిరేషనల్ లీడర్ 2018అవార్డు లభించింది.

లండన్‌లో జరిగిన కార్యక్రమంలో అవార్డులు అందజేశారు. యు.కె., ఆసియా బిజినెస్ అవార్డ్స్ అండ్ కాంక్లేవ్ 2018లో ఈ ప్రతిష్ఠాత్మక అవార్డులు అందాయి. యు.కె. మరియు ఆసియా దేశాల్లో తమ ఆర్థిక రంగాల్లో పరిణామాత్మకమైన మార్పులకు దోహదపడిన ఐకానిక్ బ్రాండ్స్‌కు ఈ ప్రతిష్ఠాత్మక అవార్డులు బహూకరిస్తారు.

జి.ఆర్.టి. జ్యూయలర్స్ కీర్తికిరీటంలో ఈ అవార్డు ఓ కలికితురాయిఅవుతుందని మేనేజింగ్ డైరెక్టర్ అనంతపద్మనాభన్ పేర్కొన్నారు.

వ్యవస్థాపక చైర్మన్ జి.రాజేంద్రన్ శ్రమకు ఇదో గుర్తింపు అని మరో మేనేజింగ్ డైరెక్టర్ జి.ఆర్.రాధాకృష్ణన్ అన్నారు. ◆

"వద్దు భారతీ. చదువుకున్నవాళ్ళు ఆ మాత్రం అర్థం చేసుకోలేరా? ఐనా ఇది ఒకళ్ళు చెప్పి నేర్చుకునేది కాదు. ఏ వయసులో ముచ్చట ఆ వయసులో తీర్చుకోవాలంటారు కానీ సరసాలకు మాత్రం వయసన్నదే లేదు. ఇది ఎవర్ గ్రీన్ అంశం.

పిల్లలను కనడంతో అంతా అయిపోయినట్టు కాదు. అన్నీ వదులుకుని సర్వసంగపరిత్యాగుల్లా ఉండిపోవాలని ఎక్కడా లేదు. మానసిక ఉల్లాసానికి స్త్రీ పురుష సాన్నిహిత్యం ఎంతో ముఖ్యం.

పిల్లలను కనడంతో ఆ బంధం మరింత బలపడుతుంది. అంతేకాదు. వయసుమళ్ళిన కాలంలో ఒకరికొకరుతోడుండేవిధంగా ఆ బంధంనిలుస్తుంది. ఆ బంధానికి మరేబంధమూ సాటిలేదు సాటిరాదు"

"ఏమోనండీ అయినా రేపోసారి చూచాయగానైనా పిల్లలముందు మనమీవిషయం మాట్లాడ్డం మంచిదనిపిస్తోంది. సంపాదన యావలోపడి దానికోసం సుఖ సంతోషాలను పణంగా పెట్టడం ఎంతవరకూ సమంజసమో మీరే చెప్పండి"

"నాకేమో మనవాడు మరీ అంత తెలివి తక్కువగా వ్యవహరించడనిపిస్తోంది"

"ఔనౌను. ఎంతైనా మీ సుపుత్రుడు కదా, బుద్ధులెక్కడికిపోతాయి.సమయంచిక్కినప్పుడల్లా ఉడుంపట్టు పట్టేస్తాడు కదూ"

"ఓహో నీకు మాత్రం సుపుత్రుడు కాదేంటీ. నీ బుద్ధులు కూడా వచ్చి ఉండొచ్చుగా. ఆ అమ్మాయి దగ్గరికొచ్చినా వీడే వదిలించుకుని దూరంగా జరుగుతున్నాడేమో నీలాగా"

"సంతోషించాం. ఇక పడుకోండి"

"నీ మదిలో నేనే ఉంటే, నా ఒడిలో నీవే ఉంటే, ఒడినిండా వలపుల మల్లి గుబాళించిపోదా" అంటూ పాటందుకున్నాడు విష్ణుమూర్తి భారతిని మరింతగా హత్తుకుంటూ.

పెళ్ళికి వచ్చిన బంధువర్గమంతా తమతమ ఊళ్ళకు వెళ్ళిపోయారు. వియ్యంకులు మాత్రం మిగిలారు. సుందర్ ఎందుకో మూడీగా ఉన్నట్టనిపించింది భారతికి.

"ఏమైందిరా? ఎందుకలా ఉన్నావు?" అనడిగింది ఉండబట్టలేక. "ఏం లేదమ్మా" అనేశాడు.

"ఏదైనా సమస్య ఉంటే అది చెప్తేగానీ ఎవరైనా సహాయానికి ముందుకొస్తారు. లేకుంటే ఎలా తెలుస్తుంది?" అంది భారతి. "సమస్యేమీ లేదమ్మా. మళ్ళీ రేపట్నుంచి ఆఫీసు. అదే ఆలోచిస్తున్నాను"

"ఉద్యోగమన్నాక తప్పుతుందా?"

"మరికొన్నాళ్ళు సెలవు పెట్టాలనుకుంటే తనకు కుదరదంటుంది"

"అలా చెప్పు అదీ నీ సమస్య. నువ్వు సెలవుపెట్టి ఎక్కడికైనా వెళ్దామంటున్నావు. తను కుదరదంటూంది. అంతేకదూ"

"కనిపెట్టేశావమ్మా"

"ఇద్దరూ ఉద్యోగానికెళ్తే ఉండే సమస్యే కదరా. ఇదేమన్నా కొత్తదా? ఐనా పెళ్ళికి ముందే ఇవన్నీ చర్చించుకునే కదా నిర్ణయించుకున్నారు. ఇప్పుడు దీన్ని సమస్యఅంటే ఎలా?" అన్నది భారతి.

ఆ మాటలకు అతనివద్ద సమాధానం లేదు.

"ఒరేయ్. సంతోషమనేది మనసుకు సంబంధించినది. జీవితాన్ని ఆస్వాదించాలన్న తపన ఉండాలేగానీ చేతలక్కరలేదు మాటలు కూడా చాలు సరసాలకు. సరససల్లాపాలంటే అవే మరి.

మీరిద్దరూ ఇంట్లో ఉండే ఆ కొద్దిసేపైనా ఒకర్నొకరు హత్తుకుని ఉండగలిగితే జీవితం ఆనందమయమే. సుఖసంతోషాలకేమీ కొదవుండదు. మీ కెరీర్‌కు కూడా ఢోకా ఉండదు"

"అదికాదమ్మా.ఎలాచెప్పాలో అర్థంకావడంలేదు"

"నువ్వేం చెప్పాలనుకున్నా నాకు చెప్పి ప్రయోజనం లేదు. నీ భార్య దగ్గర చెప్పు. ఫలితం ఉంటుంది. మరో మార్గం లేదు"

రాత్రి భోజనం ముగించి వెళ్ళి బెడ్‌రూమ్‌లో మంచం మీద కూర్చుని పుస్తకపఠనంలో నిమగ్నమయ్యాడు సుందర్.

అరగంట తరువాత సునంద లోపలికొచ్చింది. మెల్లగా అతని పక్కన కూర్చుని కాసేపతనివంక తదేకంగా చూసి చటుక్కున అతని చేతిలోని పుస్తకం లాగేసింది.హఠాత్తుగా ఆమెఅలా చెయ్యడంతో చికాకుగా ఆమె వంక చూసిన సుందర్‌కు ఆమె కళ్ళల్లో ఏదో మెరుపు కనిపించింది. చికాకు గాలికెగిరి



## అప్పుడు వెండి, ఇప్పుడు బంగారం

'మహానటి'లో బ్రహ్మాండంగా మెప్పించిన కీర్తి సురేష్ తమిళనాట మాస్‌మసాలా జతచేస్తున్నది. 'మహానటి' తర్వాత నాణేలుపంచిన కీర్తి 'పందెం కోడి2'టీమ్‌కూ బంగారునాణేలు పంచుతోందట.

ఏమిటీ నాణేలపందారం అనడిగితే, ఇంతకు ముందూ ఇలాగేనాణేలుపంచే అలవాటుందంటున్నది.కాకపోతే అప్పుడు వెండినాణెం ఇచ్చేదట.

'మహానటి' తర్వాత ఆ స్థాయి బంగారానికి పెరిగింది.' నేను పారితోషికం కంటే నటనకే ప్రాధాన్యం ఇచ్చి ఆలోచిస్తుంటా.డబ్బు సంపాదించాలన్న కోరికతోమాత్రం సినిమాల్లోకి రాలేదు. సినిమాపట్ల తపనతో వచ్చాను" అని చెప్పింది.

పోయింది. "ఏమిటీ విశేషం?" అంటూ శయనావస్థలో వున్న సుందర్ లేచి కూర్చున్నాడు.

వెంటనే తన రెండుచేతులూ అతని మెడ చుట్టూ వేసి కళ్ళల్లోకి తదేకంగా చూసింది. "విషయం చెప్పకుండా అలా చూస్తూ కూర్చుంటే నాకు మూడొచ్చేస్తుంది. ఆ తర్వాత పరిణామాలకు నేను బాధ్యుణ్ణి కాను" అన్నాడు ఆమె నడుంచుట్టూ చేతులేసి దగ్గరికి లాక్కుంటూ. అతనుమెల్లగాలాగినా ఆమె మాత్రం విసురుగా అతని మీద పడింది.

"ఇదేంటీ, నేను మెల్లగానే కదా లాగాను. నా శరీరంలో ఏదైనా మాగ్నటిక్ పవర్ వుందా?" అంటూ ఆశ్చర్యపోతూ తనను తాను తేరిపార చూసుకున్నాడు.



అయితే అతని శరీరానికి బదులుగా అతన్ని అల్లుకుని వున్న ఆమె శరీరమే కనిపించిందతనికి. సునంద మరింతగా అతన్నిఅల్లుకుపోతోంది.

"అదుగో మళ్ళీ అదే చేస్తున్నావు. మనం మాట్లాడుకున్న మాటలు, ఊసులు అన్నీ గాలికెగిరి పోతాయి. ఆ తరువాత నీ ఇష్టం. నాకు మూడొచ్చేస్తోందీ" అంటూ ఆమెను గట్టిగా హత్తుకున్నాడు.

"మీకింకా వస్తూ ఉంది. నాకాల్రెడీ వచ్చేసింది" అంటూ చెవిలో గుసగుసగా మాట్లాడుతూ అతని ముఖంలోకి చూసి ముఖాన్ని రెండు చేతుల్లోకీ తీసుకుని పెదాలమీద గాఢంగా చుంబించింది.

ఆమె మనసును అర్థంచేసుకునేందుకు విఫల ప్రయత్నం చేస్తున్నాడు సుందర్.

గత ఇరవై నాలుగ్గంటల్లో ఏం జరిగిందో తెలియ లేదుగానీ ప్రస్తుతం అతని చేతులు మాత్రం అసంకల్పితప్రతీకారచర్యలా చకచకా కదులుతున్నాయి. ఏమాత్రం ప్రతిఘటన లేకపోగా స్వయంగా ఆమే చెలరేగిపోతూండడంతో ఆమె సమ్మతం పరిపూర్ణంగానే ఉన్నదన్న విషయం వాస్తవమనిపిస్తోంది.

మరికాసేపటికి సునంద కళ్ళు తెరిచింది. అతనివైపుచూసి సమ్మోహనంగా నవ్వింది. "సునందా. నేనో విషయం చెప్పాలనుకుంటున్నాను" ఉపోద్ఘాతంగా ప్రారంభించాడు సుందర్. చటుక్కున తలెత్తి అతనివంక చూసింది సునంద.

"లేడీస్ ఫస్ట్" అన్నది వేగంగా.

చకితుడయ్యాడు సుందర్.

కొద్దిక్షణాలు ఇద్దరిమధ్యా మౌనం నెలకొంది.

తర్వాత "నిన్నంతా అమ్మ ఒకటే బుర్ర తినేసింది" అన్నది మెల్లగా.

"ఏ విషయం?"

"వాళ్ళకు ఎలా తెలిసిందో అర్థంకావడంలేదు. మూడ్రోజులుగా అల్లుడుగారు నిన్ను ముట్టుకోలేదటే అని అడిగేసింది అమ్మ" అన్నది కొద్దిగా సిగ్గుపడ్తూ.

"ఇందులో సిగ్గుపడేందుకో ఆశ్చర్యపడేందుకో ఏమీ లేదే" అన్నాడు. "మీకు లేకపోవచ్చుకానీ నాకు మాత్రం ఏదోలా అనిపించింది" అంది సునంద.

"ఏదోలా అంటే ఎలా?"

"చెప్పలేను బాబూ. ఐనా ఇంత వయసొచ్చీ వాళ్ళు ఇలాంటివన్నీ అడుగుతారా? మనం ఎలా ఉంటే వీళ్ళకెందుకట ఆ చింత?"

"భలేదానివే. వాళ్ళకుకాక ఇంకెవరికుంటుంది? మనవళ్ళనో మనవరాళ్ళనో ఎత్తుకునేది వాళ్ళేగా. ఇంతకూ వివరంగా చెప్పకుండా అలా సిగ్గుపడితే నాకెలా అర్థమవుతుంది" అన్నాడు పెదవి బిగబట్టి నవ్వాపుకుంటూ.

గోడమీద రెండు చిలుకలు ఒకదాన్నొకటి హత్తుకుని ఉన్న క్యాలెండర్‌ని చూసింది ఆమె.

మరొకవైపు అప్పుడే పుట్టిన తన బిడ్డను చేతిలో ఉంచుకున్న ఒక చిన్న ఉడుత.

అధికారంలోకి ఎవరు వచ్చినా భారతదేశంలో ప్రజాస్వామ్యక వ్యవస్థను మాత్రం తొలగించలేరు.
*-దేవెగౌడ, మాజీ ప్రధాని*



భత్తీస్‌ఘడ్‌లో కాంగ్రెస్ పార్టీ గెలిస్తే ముఖ్యమంత్రి ఎంపికకోసం స్వయంవరం నిర్వహిస్తాం.
*-టి.ఎస్.సింగ్‌దేవ్, కాంగ్రెస్ నేత*

ఇంకో గోడమీద ఒక బాతు వెనక వరుసగా దాన్ననుసరించి బిలబిలమంటూ నడిచి వెళ్తున్న బాతుపిల్లలు. ఇవన్నీ చూడగానే కాసేపు తన్మయత్వంతో ఏదో లోకంలో విహరించిందామె మనసు.

"ఏమండీ, మన పరిచయమైన కొత్తల్లో ఇద్దరం కెరీర్ గురించి తీవ్రంగా చర్చించుకున్నాం. ఇంకా చెప్పాలంటే కలలుకన్నాం.పెళ్ళి మనకెరీర్‌కు ఏ విధంగానూ అడ్డం కాకూడదని నిర్ణయించుకున్నాం. నిజమేనా?" అతని కళ్ళల్లోకి చూస్తూ ఉంది సునంద అతని ప్రతిక్రియ గమనిస్తూ.

ఆమె ఏం చెప్పదల్చుకుందో అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తూ అవునన్నట్టు తలూపాడు.

"అసలు కెరీర్ అంటే ఏమిటి చెప్పండి?"

"అది కూడా నువ్వే చెప్పు" అన్నాడు సుందర్ తన ప్రేక్షకపాత్రను కొనసాగిస్తూ.

"కొన్నేళ్ళ తరువాత మనం చేరుకోవాలనుకున్న లక్ష్యం, లేదా హోదా వగైరా ఏదైనా" కావచ్చున్నట్టు తలూపాడు.

"కెరీర్ ఏదైనా చివరికి అది డబ్బుతో ముడిపడుతుందనడం కాదనలేని సత్యం. సంతోషమంటే ఒకరికొకరు తోడై ఉండడం.

'హ్యాపీనెస్ ఈజ్ టుగెదర్నెస్' అన్న విషయం ఆ గోడమీదనున్న అక్షర జ్ఞానంలేని జీవులకు కూడా తెలుసు. కానీ ఇన్నేసి చదువులు చదువుకున్న మనుషులకు మాత్రం తెలియకుండా ఉందెందుకు? సంపాదనకు అంతెక్కడ?

సంపాదనతో సుఖాన్ని కొనగలమేమోగానీ సంతోషాన్ని కొనలేము కదా? సంతోషాన్ని కొనలేని సంపాదన ఎందుకు?

ఇంత చిన్నవిషయంకోసం పెళ్ళికి ముందు నుంచీ ఎన్నెన్ని ప్రణాళికలు, ప్రయాసలు? కెరీర్‌లో అభివృద్ధి అంటే డబ్బురూపంలో ప్రమోషన్‌రూపంలో దొరుకుతుంది. అలాగే సంసారంలో అభివృద్ధి పిల్లల రూపంలో దొరుకుతుంది. అసలు సంసారం, కెరీర్ రెండూ జీవనయానంలో రైలుపట్టాలవంటివి.

ఒకటి లేకుంటే మరొకటి లేదు. రెండూ ఉంటేనే జీవితమనే రైలు ప్రయాణం సాఫీగా సాగుతుంది.

అలాంటిది కెరీర్ కోసం సంసారాన్ని త్యజించాలన్నంత మూర్ఖంగా ఎలా ఆలోచించామన్నదే నాకు అంతుబట్టడంలేదు.

కెరీర్ అభివృద్ధికి ఒకరికొకరు సహాయపడాలి.

ఇంకా చెప్పాలంటే సంసారంలో సుఖంపాలు ఎక్కువగా ఉంటే కెరీర్ లక్ష్యాలను మరింత త్వరగా చేరుకోగలమని ఇప్పుడు నాకనిపిస్తోంది.ఆ నిర్ణయమే నా ఈ ప్రవర్తనకు కారణం. నేను చేసింది కరక్టేనా?" అంది ఆర్తిగా అతని కళ్ళల్లోకి చూస్తూ.

"మై పార్ట్‌నర్ కెన్ నెవర్ మేక మిస్టేక్. బాసి ఈజ్ ఆల్వేస్ రైట్" అంటూ నుదుటిమీద చుంబించాడు మళ్ళీ బలంగా, ఊపిరి సలపనంతగాహత్తుకుంటూ.

"బాసిఅంటే?"మూతి సున్నాలాచుట్టి అడిగింది.

"ఆడ బాస్" బుగ్గ చిదిమాడు అల్లరిగా కౌగిలి సడలిస్తూ, దూరం జరిగి.

"యూ" అంటూ అతని మీదికి రాబోయింది.

"వద్దూ. ఆలోచించుకో. నేనిప్పటికీ ఇంకా ఆ మూడ్ నుంచి బయటికి రాలేదు. ఆ తరువాత నీ ఇష్టం. రాత్రంతా నిన్ను నిద్రపోనివ్వను జాగ్రత్త" అన్నాడు చేతులడ్డంపెడుతూ, ఉడికిస్తున్నట్టుగా.

"సో వాట్. సో యూమై" అంటూ అమాంతంగా అతనిమీద వాలిపోయింది సునంద.

"ఏడాదిలోపు మనవడో మనవరాలో గ్యారెంటీ అన్నమాట. కెరీర్ అభివృద్ధి ఇంత వేగంగా ఉంటుందని ఊహించలేదు సుమా!" అంటూ చెవిలో గుసగుసలాడుతూ సునందను బాహువుల్లో బంధించి జంటగా మన్మథ ఎక్స్‌ప్రెస్ ఎక్కేశాడు సుందర్.

వాళ్ళెక్కిన ఆ ట్రైన్ పాయింట్ టు పాయింట్. గమ్యం చేరేవరకూ నాన్‌స్టాప్!

# అంతా రాజకీయమే

## స్వయం మినహాయింపు

ప్రభుత్వాలలో అవినీతి అంశాలు విచారణ జరపటానికి ప్రతి రాష్ట్రంలో లోకాయుక్త, జాతీయ స్థాయిలో లోక్‌పాల్ వ్యవస్థలు వుండాలంటుంది 'చట్టం'. కాని కేంద్రంలో లోక్‌పాల్‌ని నియమించరు, రాష్ట్రాలలో లోకాయుక్తలు కనిపించరు. అయితే ఇది అదనుగా తీసుకుని బెంగాల్ ముఖ్యమంత్రి మమతాబెనర్జీ అందరూ అవి నీతిపరులే, వారికంతా భయం.

అందుకే ఆ వ్యవస్థల్ని నియమించరు. నేను అలా కాదు చూడండి లోకాయుక్తని నియమిస్తున్నా అంటూ నానా హడావుడి చేసింది. చివరికి లోకాయుక్త పరిధి నుండి సి.ఎమ్‌ని తప్పించే విధంగా చట్టాన్ని సవరించింది.

అదేమిటి సి.ఎమ్. మినహాయింపు అంటే అదంతే అంటుంది మమత. అయితే ఆమె హయాంలో జరిగిన శారదా,నారదా చిట్ కుంభకోణాల అంశాలు వెలుగు చూస్తాయన్న భయంతో, ఆ కేసుల గోలనుండి తప్పించుకునేందుకే మమతా బెనర్జీ, ముఖ్యమంత్రి స్థానాన్ని లోకాయుక్త పరిధి నుండి తప్పించిందా! అనేది సందేహం. ◆

## నా దారి నాదే

కేంద్రంలో నరేంద్రమోడీ ప్రభుత్వం జమిలి ఎన్నికల ఆలోచనను చాలాకాలంగా చేస్తోంది. అందుకే మిగిలిన రాష్ట్రాలవారిని ఒప్పించే యత్నం చేస్తున్నది.తమ పార్టీ అధీనంలో వున్న రాష్ట్రాలతో ఇబ్బంది లేదు.

ఇక మిగిలినవాటిలో ఆంధ్ర ఒప్పుకోదు. టి.ఆర్.ఎస్. ఒప్పుకుంటుంది అనుకుంటే కె.సి.ఆర్. తన లెక్కలు తనకే అంటున్నాడు. ఎన్నికలకు ముందు బి.జె.పి. మిత్రుడిగా కనిపిస్తే ముస్లిమ్ ఓటు బ్యాంక్‌కి గండిపడుతుందనేది కె.సి.ఆర్. భయం.

అందుకే ముందస్తుకు వస్తాగాని మీరు చెప్పినట్లు, మీరు చెప్పిన సమయానికి రాలేనన్న సందేశం పంపిస్తున్నాడు కె.సి.ఆర్.

మోడీ ప్రభుత్వం ముందస్తు విషయంలో ఒక నిర్ణయానికి వచ్చేలోగానే తెలంగాణ అసెంబ్లీని రద్దుచేసి, ముందస్తు ఎన్నికలకు వెళ్ళి భారీ మెజారిటీ సంపాదించాలన్నది కె.సి.ఆర్. ఎత్తుగడ. ఈ ముందస్తు పరుగులో మోడీ, కె.సి.ఆర్‌లలో ఎవరు విజేతగా నిలుస్తారో! ◆

## సక్సెస్ ఫార్ములా

గుజరాత్ ఎన్నికల సమయంలో రాహుల్ గాంధీ తాను హిందువుని అని చెప్పుకునేందుకు నానా తంటాలు పడ్డాడు. ప్రతి దేవాలయం దర్శించి, ఆ గుడి ముందు ఫోటో దిగి దాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చాడు.

అంతకు ముందు సాధించలేనన్ని సీట్లు కాంగ్రెస్ సాధించింది. అదే సక్సెస్ ఫార్ములా అని కర్ణాటకలోని మఠాలకు, దేవాలయాలకు, మసీదులకు, చర్చిలకు వెళ్ళాడు.

అక్కడ గెలవలేదు కాని ప్రభుత్వంలో భాగస్వామ్యులయ్యారు. ఇప్పుడు రాజస్థాన్ ఎన్నికల వేళ రాహుల్‌గాంధీ తిరిగి దేవాలయాల దర్శనంతోనే ప్రచారానికి శ్రీకారంచుట్టాడు. మోతీదుంగ్రీలోని వినాయక మందిరం, ఆ పక్కనేవున్న వైష్ణవ దేవాలయం దర్శించి, బొట్టు పెట్టుకుని ఎన్నికల ప్రచారంలోకి దిగాడు.

హిందూత్వ వెలుగును భారతీయ జనతా పార్టీనుండి తనమీదికి మళ్ళించుకునే యత్నం రాహుల్‌గాంధీది. ◆

## అదే అవమానం

ప్రత్యేక తెలంగాణ ఉద్యమ సమయంలో ఆంధ్రులమీద వాడిన అవమానకర పదం 'సెటిలర్స్' అనేది. తమ సొంత దేశంలో, తమ సొంత తెలుగు మాట్లాడే భాషా ప్రాంతంలో తమని సెటిలర్స్ అనే పదంతో నిందించటం ఆంధ్రులను చాలా బాధించింది.

రాష్ట్రం విడిపోయి, తెలంగాణ ఏర్పడిన తర్వాత ఆ రాష్ట్ర అభివృద్ధిలో తమ వంతు పాత్రను నిస్వార్థంగా పోషిస్తున్న ఆంధ్రుల మీద తిరిగి సెటిలర్స్ అనే పదం ప్రయోగిస్తూ రాజకీయాలు నడుపుతున్నాయి పార్టీలు.

తాము సెటిలర్స్‌కి టికెట్లు ఇస్తామని కాంగ్రెస్ పార్టీవారు అన్న మాట ఎంత అవమానకరమో, సెటిలర్స్ అంతా మావైపేనని గత హైదరాబాద్ కార్పోరేషన్ ఎన్నికలు నిరూపించాయి అని కె.సి.ఆర్. అనటంకూడా అంతే అవమానకరం. అందరూ భారతీయులే అనే మాట ఇప్పుడు ఎలాగూ పోయింది.

కనీసం అంతా తెలుగువారే అని కూడా అనుకోలేని నీచ రాజకీయ సంస్కృతిని నడపాలనుకుంటున్నాయి. అందుకే సెటిలర్స్ అనే పదం తెరమీదికి తెస్తున్నారు. ◆

## మళ్ళీ మొదటికే

1980ల సమయానికి ఇక కాంగ్రెస్‌కి మేమే ప్రత్యామ్నాయం అని బి.జె.పి. అనుకుంటున్న వేళ ఎన్టీఆర్ తెలుగుదేశం పార్టీ పెట్టటం, అన్ని సీట్లలో పోటీచెయ్యటంతో కాంగ్రెస్ వ్యతిరేక ఓటు మొత్తం టి.డి.పివైపు వెళ్ళింది. అలా వెళ్ళిన ఓటు తిరిగి వెనక్కి రాలేదు.

ఈలోగా రామమందిర ఉద్యమంతో తిరిగి ఓటుబ్యాంక్‌ని నిర్మించుకుని, పరవాలేదు అని బి.జె.పి. భావిస్తున్న వేళ ప్రత్యేక తెలంగాణ ఉద్యమం వచ్చింది. బి.జె.పి. నేతలు చాలామంది టి.ఆర్.ఎస్.వైపు వెళ్ళిపోయారు.

రాష్ట్రస్థాయి ఎదుగుదలమీద బి.జె.పి. అధినాయకులకు నమ్మకం లేక కె.సి.ఆర్‌తో చెలిమి మొదలుపెట్టింది. అది కె.సి.ఆర్‌కి కలిసివచ్చే అంశం కాబట్టి ప్రధాని మోడీకి తాను బాగా దగ్గరని ఇంప్రెషన్ ఇస్తున్నాడు.

దీనితో తెలంగాణలో బి.జె.పితో ఎందుకు అంటూ కె.సి.ఆర్. వ్యతిరేక ఓటు మరోవైపు చూడాల్సివస్తోంది. ◆

## చెరిపేస్తున్నారు

ప్రభుత్వానికి, అధికార పార్టీకి మధ్య స్పష్టమైన గీత వుంటుంది. అది వుండితీరాలి కూడా. అయితే స్వయంగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పార్టీ,ప్రభుత్వ మధ్య గీతను చెరిపేసిన తర్వాత ఇక మిగిలినవారిని అదుపు చెయ్యటం ఎలా!

మార్చి నెలనుండి జరుగుతున్న అధికార కార్యక్రమాలన్నింటిలో ప్రభుత్వం తరపున తాను చేస్తున్న కార్యక్రమాలు గుర్తుపెట్టుకుని తనని గెలిపించమని అడిగే రీతిలోనే సాగుతున్నాయి. మీకోసం జీతాలు పెంచాను, మీకోసం రుణాలు, పింఛన్లు ఇస్తున్నాను.

చౌకగా భోజనాలు పెడుతున్నాను అని తానేదో సొంత డబ్బుతో ఇస్తున్నట్టుగా మాట్లాడటం చంద్రబాబు చేస్తున్నాడు.

అలా లబ్ధి పొందినవారంతా ఆయనద్వారానే ఆ లబ్ధి అనే విషయం గుర్తుపెట్టుకోవాలని డ్వాక్రా మహిళలను ఒక మహిళా నేత అడిగిన తీరును చూసిన తర్వాత ఏది అధికారిక కార్యక్రమం, ఏది పార్టీ కార్యక్రమం అనే సందేహం కలగక మానదు.

# వరలక్ష్మీ వ్రతం
## 24.8.2018

## లక్ష్మీదేవి అనుగ్రహం

ప్రతి వ్యక్తికీ సంతానం, సంపద, విద్య, అధికారం, గౌరవం... ఇలా అన్నీ ఉన్నప్పటికీ ఏదో ఓ సందర్భంలో ఏదో ఒక లోపం కలిగి మనసంతా నిరాశతో నిండిపోతుంది. ఆ సందర్భంలో ఆ లోటు తొలిగిపోతే బాగుండుననిపిస్తుంది. ఆ లోటుని పూడ్చే అనుగ్రహమే వరం అంటే.

అలాటి వరాన్ని మనం అడగ్గానే మన పూజకి ప్రతిఫలంగా ఆ వరాన్నిచ్చే లక్ష్మి 'వరలక్ష్మి'. అంటే ఈ తల్లి అవసరం మనకి ఎప్పుడూ కలుగుతూనే ఉంటుందన్నమాట. ఏదో ఓ వ్రతం రోజున మాత్రమే కాదు.

అందుకే ఈ వ్రతాన్ని ఆ రోజున మాత్రమే కాకుండా ఎప్పుడైనా కూడా చేసుకోవచ్చు. దోషం కానే కాదు. ❐

## వ్రతం-పండుగ

వరలక్ష్మి, మంగళగౌరీ వ్రతం... వంటివి రాగానే 'పండుగ అయిపోయాక చూద్దాం' అని అంటుంటాం ఎవరితోనైనా మాటల సందర్భంగా.

నిజానికి వ్రతం వేరూ, పండుగ వేరూ. ఈ రెండూ ఒకటి కావు.

ఎప్పుడు మనకి అవసరమనిపిస్తే అప్పటికప్పుడు వెంటనే చేసుకోవలసిందే వ్రతం అంటే.

ఏదో లోటున్న కారణంగా ఆ లోటు పూడ్చుకోవడం కోసం 'వరం' కావాలని అమ్మవారిని అడగడానికి చేసుకునేది వరలక్ష్మి వ్రతం. అలాగే శుభకార్యం జరగాలని చేసుకునేది మంగళగౌరీ వ్రతం. పండుగ అయితే అది ఖచ్చితంగా ఆ నిర్ణయింపబడిన రోజుకు మాత్రమే చేసుకోవాల్సి ఉంటుంది.

నిజానికి వినాయకవ్రతమే అది.

కాలక్రమంలో వినాయకచవితి ఓ పండుగగా అయిపోయింది. వినాయక వ్రతం అనడం సరి. ❐

## తోరం

తొమ్మిది ముడులతో ఉన్న ఈ తోరాన్ని పూజించడం ఈ వ్రతంలో అతిప్రధానం. దాన్ని చేతికి కట్టుకోవడం కూడా ఉంటుంది. ఆ 9 ముడులూ మరేమో కావు.మన శరీరానికుండే నవ రంధ్రాలూ, నవద్వారాలూను.

ఆ తొమ్మిది రంధ్రాలూ సక్రమంగా ఉన్నప్పుడే ఏ వ్యక్తి అయినా తన ఆరోగ్యాన్ని రక్షించుకోగలుగుతాడు.

అంతేకాక శరీరంలో శరీరానికీ, బుద్ధికీ, ప్రశాంతతనీ, పుష్టినీ ఇచ్చేవి నవ(9)ధాతువులే. (చర్మం, రక్తం, మాంసం, ఎముక, మజ్జ (ఎముకలో ఉంటూ రక్తాన్ని సృష్టించే భాగం) శుక్రం మేధస్సు ఈ ఏడూ సరిగ్గా ఉన్నప్పుడు కలిగే మానసిక ఆనందం బుద్ధివికాసం అనే రెండూ కలిపి 9).

ఇలా వ్రతంలో జరిగే ప్రతి తంతుకీ అర్థాన్ని వివరించుకుంటూ వ్రతాన్ని జరుపుకుంటే స్త్రీలంతా సుఖసంతోషాలతో ఉండగలుగుతారు.

స్త్రీ సుఖంగా మనఃప్రశాంతతతో గాని ఉన్నట్లయితే పురుషుడు ఉత్సాహవంతుడై ఉండగలడు. అలా స్త్రీ, పురుషుల ఆనందంతో నిండిన ఇల్లు నందనవనమే. అలా అయ్యేందుకు దోహదపడేవే ఈ వ్రతాలు.

వరలక్ష్మీ అనుగ్రహ ప్రాప్తిరస్తు! ❐




### శ్రీ లక్ష్మీదేవి స్తుతి

నమోఽస్తు హేమాంబుజపీఠికాయై
నమోఽస్తు భూమండలనాయికాయై
నమోఽస్తు దేవాది దయాపరాయై
నమోఽస్తు శార్ఙ్గాయుధ వల్లభాయై॥

కనక కమల సింహాసనాధిష్ఠితయై, భూలోకమునకెల్ల ఏకైక నాయికయై, వేల్పులయెడ కరుణారసమే ముఖ్యముగాగల శార్ఙ్గమను విల్లును ఆయుధముగా గల విష్ణువునకు ఇల్లాలివైన లక్ష్మీదేవీ నీకు నమస్కారము. ❐

{ భగవంతుణ్ణి పొందటానికి విశ్వాసం కావాలి. }

## సెనగలు వాయనంగా

శ్రావణమాసంలో ఏ వ్రతాన్నిచేసినా గంధం, సెనగలు,అరటిపళ్ళూ, కొబ్బరి ముక్కలూ... వాయనంగా సమర్పిస్తారు.దీంట్లో ఆరోగ్య రహస్యం ఉంది.

ఈ శ్రావణం వర్షఋతువులో వస్తుంది కాబట్టి ఈ వర్షం చలితనం ఉండే రోజుల్లో సెనగలని ఆహారంగా తీసుకుంటే ఆరోగ్యపరంగా శైత్యం (జలుబు) తొలగిపోతుంది.

ఆధ్యాత్మికపరంగానైతే సెనగలనేవి గురుగ్రహానికి ప్రీతికరం కాబట్టి సరైన తీరులో ఆలోచించగల విధానంవస్తుంది ఇలా సెనగలని వాయనంగాసమర్పిస్తే. ఇక కొబ్బరిముక్కలు వ్యక్తికి రక్తహీనతని కలగనియ్యదు.గంధం అనేది శరీరానికి, సువాసననీ, తేజస్సునీ ఇస్తుంది. ఇక వాయనాన్నిస్తూ-

ఇందిరా ప్రతిగృహ్ణాతి ఇందిరా వై
దదాతి చ।
ఇందిరా తారి కావాభ్యాం ఇంది
రాయై నమో నమః॥

అంటారు. 'నువ్వు నీ ఇంటికి లక్ష్మీదేవివి... నేను నా ఇంటికి లక్ష్మీదేవిని. మన ఇద్దర్నీ అనుగ్రహించే ఆ వరలక్ష్మీదేవికి నమస్కరిస్తూ ఈ వాయనాన్ని ఆ వరలక్ష్మి ప్రీతికరంగా నీకు సమర్పిస్తున్నా'నని పై శ్లోకానికర్థం.

ఇలాటి శ్లోకాన్ని చదివినా, విన్నా, తనకి తాను లక్ష్మి స్వరూపం అని తెలుసుకున్న స్త్రీ- నిరాశానిస్పృహలకి లోను కా(బో)దు. ❐

## స్వాతి-శ్రవణం

స్వాతీ నక్షత్రం వాయుదేవునికి సంబంధించిన నక్షత్రం. శ్రవణమనేది శ్రీహరి పుట్టిన నక్షత్రం.

శ్రీహరికి బలాన్ని ఇచ్చేవాడు వాయువు. అందుకే వేదం 'వాతాద్విష్ణోర్బలమాహుః' అంది.

వాయువు వల్లే శ్రీహరికి బలం వస్తుంది కాబట్టే ఈ విష్ణురూపమైన రాముడు ఆంజనేయునిద్వారా కార్య సాధనని చేయగలిగాడు.

వేదమంత్రానికి ఉదాహరణగా కన్పించే కథలే పురాణాలు. వీటిని కథలుగా చెప్పేసుకోకూడదు. ❐

# పాతవే కాని...

ఆహారపదార్థాల జాబితాలో ఎప్పటికప్పుడు కొత్తకొత్తవి చేరుతున్నా సంప్రదాయ పిండివంటల ప్రాధాన్యం ఎన్నటికీ తగ్గదు.
సరైన సమతూకంలో చేసే ఇటువంటి పదార్థాలను అనేకమంది ఇష్టపడుతుంటారు. నవతరానికి వాటి తయారీవిధానాలపట్ల అవగాహన లేకపోవచ్చు.

## పాయసం

**కావాల్సిన పదార్థాలు :** రెండు లీటర్ల పాలు, 100 గ్రాములు సేమ్యా, వంద గ్రాములు పంచదార, కొద్దిగా యాలకులపొడి, ఇరవై ఐదు గ్రాములు జీడిపప్పు, పదిహేను గ్రాములు కిస్మిస్, కొంచెం నెయ్యి.

**తయారుచేసే విధానం :** పాలు కాచి పక్కన ఉంచుకోవాలి. ప్యాన్ తీసుకుని అందులో కొద్దిగా నెయ్యివేసి సేమ్యా వేయించుకోవాలి.

పాలలో సేమ్యా కలిపి, సన్నని సెగపై కలియబెడుతూ ఉడికించాలి. జీడిపప్పు, కిస్మిస్ విడిగా నేతిలో వేయించి, సేమ్యా మిశ్రమానికి కలుపుకోవాలి. వేడిగా ఉన్నప్పుడు వడ్డిస్తే రుచిగా వుంటాయి.





Courtesy :YOU & I

## రవ్వలడ్లు

**కావాల్సిన పదార్థాలు :** ఒక కప్పు బొంబాయి రవ్వ, ఒక కప్పు పాలు, యాభై గ్రాములు జీడిపప్పు, అర టీస్పూన్ యాలకులపొడి, పావుకప్పు నెయ్యి, అరకప్పు కొబ్బరితురుము, ఒకటిన్నర కప్పులు పంచదార.

**తయారుచేసే విధానం:** ప్యాన్‌లో నెయ్యి వేడిచేసి జీడిపప్పు, కిస్మిస్ వేయించాలి. పక్కన ఉంచుకోవాలి. అదే ప్యాన్‌లో నెయ్యివేసి రవ్వను మంచి వాసన వచ్చేదాకా వేగనివ్వాలి. యాలకులపొడి కలపాలి.

అందులో కొబ్బరికోరు, జీడిపప్పు, కిస్మిస్, పంచదార వేసి మరో నిమిషం వేయించాలి. మరో పాత్ర తీసుకుని పాలు పోసుకుని, కొంచెం కొంచెంగా రవ్వలో కలుపుతూ లడ్డూలను గట్టిగా, గుండ్రంగా చుట్టుకోవాలి.

## మామిడి పులిహోర

**కావాల్సిన పదార్థాలు :** అరకిలో బియ్యం, రెండు మామిడికాయలు, టీస్పూన్ ఆవాలు, జీలకర్ర,టేబుల్‌స్పూన్ మినప్పప్పు, పచ్చిశనగపప్పు, 40 గ్రాములు వేరుశనగగుళ్ళు, ఆరేడు ఎండుమిరపకాయలు, ఆరేడు పచ్చిమిరపకాయలు, ఒక టీస్పూన్ ఇంగువ, తగినంత ఉప్పు, పసుపు, కరివేపాకు, జీడిపప్పు, కొత్తిమీర, రెండు టేబుల్‌స్పూన్లు నూనె.

**తయారుచేసే విధానం :** అన్నం ఉడికించి పక్కన ఉంచుకుని చల్లారనివ్వాలి. మామిడికాయలు తురుముకోవాలి. ప్యాన్‌లో నూనెవేసి, మధ్యస్తంగా గల సెగపై ఉంచాలి. ఆవాలు, జీలకర్ర వేసి చిటపటలాడాక, పచ్చిశనగపప్పు, మినప్పప్పు, వేరుశనగగుళ్ళు కలపాలి. సన్నని సెగమీద మాత్రమే వేయించాలి. అన్నీ సమంగా, చక్కగా వేగాక పచ్చిమిరప, ఎండుమిరపకాయలు, కరివేపాకు వేసి అరనిమిషం వేయించాలి. మామిడి తురుము, పసుపు, ఉప్పు కలపాలి.

బాగా కలిపి, మామిడి మెత్తబడేవరకు ఉడికించి, ఇంగువ వేసి, అన్నం కలపాలి. అన్నం పదార్థాలన్నింటినీ బాగా పీల్చుకుని, పసుపు వన్నెకు మారేవరకు మృదువుగా కలపాలి. దీనిని కొత్తిమీరతో అలంకరించి వడ్డించాలి.

## బొబ్బట్లు

**కావాల్సిన పదార్థాలు :** ఒక కప్పు శనగపప్పు, ఒక కప్పు బెల్లం, అర టీస్పూన్ యాలకులపొడి. **పిండికోసం :** ఒక కప్పు మైదాపిండి, రెండు టీస్పూన్లు బొంబాయిరవ్వ, రుచికి కొద్దిగా ఉప్పు, పసుపు, నూనె.

**తయారుచేసే విధానం :** మైదా, నీళ్ళు, ఉప్పు, పసుపు, నూనె వేసి పిండి కలుపుకోవాలి. పైన కొద్దిగా నూనె జల్లి, మూతపెట్టి పిండిని రెండుగంటలు అలా ఉంచేయాలి. కుక్కర్‌లో శనగపప్పువేసి మూడు కప్పులు నీరుపోసి, మూడు విజిల్స్ వచ్చేదాకా ఉంచాలి.

విజిల్ తీశాక బెల్లం కలిపి, పూర్తిగా కరిగి, చిక్కపడేదాకా వుంచాలి. మిశ్రమాన్ని చల్లారనివ్వాలి. పప్పు, బెల్లం గ్రైండ్ చేసి, యాలకులపొడి కలపాలి. దానిని చిన్నచిన్న ఉండలు తయారుచేసుకోవాలి.

మైదాపిండి తీసుకుని అరచేతిలో పెట్టి నొక్కుకుని, మధ్యలో పప్పు మిశ్రమం ఉంచి, అంచులు మూసేయాలి. చపాతీ కర్రతో నొక్కాలి. లోపలి పిండి వెలికిరాకుండా జాగ్రత్త తీసుకోవాలి. పెనంపై నెయ్యి వేసి, మధ్యస్తంగా గల సెగపై రెండు వైపులా కాల్చుకోవాలి.





## రవ్వకేసరి

**కావాల్సిన పదార్థాలు :** అరకప్పు బొంబాయిరవ్వ, రెండు టేబుల్ స్పూన్లు నెయ్యి, పది జీడిపప్పులు, ఒక టేబుల్ స్పూన్ కిస్మిస్, కప్పు నీరు, ముప్పావు లేదా కప్పు పంచదార, చిటికెడు కేసరి ఫుడ్ కలర్ లేదా కుంకుమపువ్వు, పావు టీస్పూన్ యాలకుల పొడి.

**తయారుచేసే విధానం :** ప్యాన్‌లో రెండు టేబుల్ స్పూన్లు నెయ్యి వేడిచేసి జీడిపప్పు, కిస్మిస్ వేసి గోల్డెన్ బ్రౌన్ కలర్ వచ్చేదాకా వేయించాలి.

పక్కన ఉంచుకోవాలి. అదే ప్యాన్‌లో నెయ్యివేసి సన్నని సెగపై రవ్వను ఐదునిమిషాలు వేయించాలి. పక్కన ఉంచుకుని చల్లారనివ్వాలి.

అడుగులోతుగాగల మూకుడులో కప్పు నీరు మరిగించాలి.ఫుడ్ కలర్ కాని లేదా కుంకుమపువ్వు నానబెట్టిన నీటిని కలపాలి. మరిగే నీటిలో రవ్వ కొద్ది కొద్దిగా వేస్తూ సన్నని సెగపై వుంచాలి.

ఉండలు కట్టకుండా నిరంతరం కలియబెడుతుండాలి. పంచదార కలిపి, పూర్తిగా కరిగేదాకా తక్కువ సెగపై ఉడికించాలి. నెయ్యి వేసి బాగా కలియ బెట్టి, మూతపెట్టేసి రవ్వ పూర్తిగా ఉడికేదాకా ఐదునిమిషాలు ఉంచాలి. వడ్డించేముందు అందులో కిస్మిస్, జీడిపప్పు, యాలకులపొడి కలపాలి.

## పెరుగు వడ



**కావాల్సిన పదార్థాలు :** ఒక కప్పు మినప్పప్పు,రెండుకప్పులు పెరుగు, రెండు పచ్చిమిరపకాయలు,రెండు టేబుల్‌స్పూన్లు క్యారెట్ తురుము, రెండు టేబుల్ స్పూన్లు కొత్తిమీర, రుచికి ఉప్పు, వేయించడానికి నూనె.

**తాలింపునకు :** రెండు టేబుల్ స్పూన్లు నూనె, పావు టీస్పూన్ ఆవాలు, పావు టీస్పూన్ జీర, ఒక చిన్నఉల్లిపాయ, రెండు ఎండుమిరపకాయలు, కరివేపాకు.

**తయారుచేసే విధానం:** మినప్పప్పును ఎనిమిది గంటలసేపు నానబెట్టుకోవాలి. నీరంతా ఒంపేసి, కొద్దిగా నీరు జల్లుకుంటూ మెత్తగా రుబ్బుకోవాలి.

అందులో ఉప్పువేసి, బాగా కలపాలి. మూకుడులో మధ్యస్తంగాగల సెగపైనూనె వేడిచేయాలి.అరచేతులకు తడిచేసుకుని,నిమ్మకాయంత పిండి తీసుకుని చేతిలో పెట్టి, గుండ్రంగా నొక్కి మధ్యలో గుంటచేసి నూనెలో వేయాలి. చేత్తో రాదను కుంటే ప్లాస్టిక్ కాగితంపైన కాని, అరటిఆకుపైకాని చేసుకోవాలి.

బంగారు రంగు వచ్చేదాకా వేయించాలి. వేగిన వడలు తీసి ఓ బౌల్‌లో నీళ్ళు పోసి దానిలో వేయాలి. మూడు నిమిషాలు ఉంచాలి.విడిగా చిన్న ప్యాన్‌లో రెండు టీస్పూన్లు నూనె వేడి చేసి ఆవాలు, జీలకర్ర వేసి చిటపటలాడాక ఎండుమిరప కాయలు, పచ్చిమిరపకాయలు, ఉల్లి చక్రాలు, కరివేపాకు వేసి రెండు నిమిషాలు వేయించాలి.ముప్పావుకప్పు నీరుపోసి పెరుగు గిలక్కొట్టి,ఉప్పు కలపాలి. తాలింపు వేసి బాగా కలియబెట్టి, నీటినుంచి వడలు తీసి, ఈ మిశ్రమంలో వేసుకోవాలి. క్యారెట్ తురుము, కొత్తిమీర జల్లి చల్లగా వడ్డించాలి.

వి.అనూరాధ



# ఉచ్చు

## కె.కె. భాగ్యశ్రీ

ఓ సారి కళ్ళెత్తి అతడి ముఖంలోకి చూసి మళ్ళీ కళ్ళు వాల్చుకుంది వైశాలి. ఇంకా సత్యకుమార్ పోయి పదిరోజులు కూడా కాలేదు. ఇంట్లో అక్కడక్కడ బంధువులు కనబడుతున్నారు.

ఇంతలో ఒక పెద్దావిడ కాఫీకప్పులున్న ట్రేతో ఆ గదిలోకి వచ్చింది. "కాఫీ తీసుకోండి బాబూ! నా కూతుర్ని ఈ రకంగా చూడలేకపోతున్నాను. ఎవరికీపాడుబుద్ధి పుట్టిందోతెలియదు. బంగారంలాంటి మా అల్లుడిని పొట్టనపెట్టుకున్నారు.

నా కూతురి పసుపుకుంకుమలు తుడిచేశారు. ఆ మాయదారి వెధవలెవరో పట్టుకుని ఉరితీసేయండి" అంది ఆ పెద్దామె శోకాలు తీస్తూ.

"అమ్మా.. నువ్వు వూరుకో... ఆ ట్రే అక్కడపెట్టి నువ్వెళ్ళు..." అంది వైశాలి కాస్త విసుగ్గా.

ఏమనుకుందో ఆమె మరి రెట్టించకుండా ముక్కు చీదుతూ అవతలికి పోయింది.

"ఏమీ అనుకోకండి సార్... పెద్దావిడ కదా! ఈ వయసులో ఈ విఘాతం తట్టుకోలేకపోతోంది. నాన్నగారు పోయిన దుఃఖం నుంచి కోలుకోకముందే ఈ దెబ్బ తగలడంతో విలవిలలాడిపోతోంది. మీరు కాఫీ తీసుకోండి...ప్లీజ్" అభ్యర్థనగా అంది వైశాలి.

### 2 జరిగిన కథ

ఓ హత్యకేసులో తనకి తెలియకుండానే అభియోగం మోపబడి పోలీసుస్టేషన్‌కి రావలసివస్తుంది సుహాసినికి. ఎస్.ఐ. ధనుంజయ్ ఆమెను ఇంటరాగేట్ చేయడం మొదలుపెడతాడు. సత్యకుమార్ అనే ప్రముఖ వ్యాపారవేత్త హత్యచేయబడతాడు.

అతని భార్య వైశాలికి సుహాసినిమీద అనుమానం. వైశాలి ఫిర్యాదుమేరకు సుహాసినీని పోలీస్‌స్టేషన్‌కు రప్పిస్తాడు ఎస్.ఐ. ధనుంజయ్. తనకీ హత్యతో ఎటువంటి సంబంధం లేదనీ, చదువుకునే రోజుల్లో వైశాలి తన క్లాస్‌మేట్ మాత్రమే నని చెబుతుంది సుహాసిని.

సుహాసిని గవర్నమెంట్ కాలేజీలో ఫిజిక్స్ లెక్చరర్. ఆమె భర్త చనిపోతాడు.

ఒక్కతే కూతురు. ఎస్.ఐ. వేసే ప్రశ్నలు ఆమెను ఇబ్బందిపెడతాయి. సుహాసిని కూతురు అభిజ్ఞ, ఆమె స్నేహితురాలు సుష్మ ఇద్దరూ సుహాసిని ఇంట్లో కంబైన్డ్ స్టడీ చేస్తుంటారు.

తొందరగా సత్యకుమార్ హత్యకేసును పరిష్కరించమని ఎస్.ఐ. ధనుంజయ్‌కి ఫోన్‌చేస్తాడు సి.ఐ. లోహితుడు. వైశాలిని కలుస్తాడు ధనుంజయ్. ఇక జరగబోయేది చదవండి.



ధనుంజయ్ మౌనంగా కాఫీ కప్పు అందుకున్నాడు. తలదించుకుని కూర్చున్న వైశాలికేసి తేరిపార చూశాడు. ఆ వయసులోనూ అందంగా కనిపిస్తున్న ఆమెని చూసి 'ఒకప్పుడు కుర్రకారు గుండెల్లో అల జడి సృష్టించి వుంటుందీ అప్సరస' అనుకున్నాడు.

అంతలోనే 'పరాయి స్త్రీ సౌందర్యాన్ని అలా తల పోయడం తప్పు' అన్న భావన మదిలో మెదలగానే మామూలు స్థితికి వచ్చేశాడు.

"కాఫీ బాగుంది మేడమ్ థ్యాంక్స్. మనం పాయింట్ లోకి వచ్చేద్దాం. ఇందాక మీ అమ్మగారి మాటలను బట్టి మీవారు మంచివ్యక్తి అని అర్థమైంది"

“అవును సార్.. ఆయన ఉత్తములు. చీమకి కూడా హాని తలపెట్టని వ్యక్తి. నేనంటే పంచప్రాణాలూనూ" భర్త తలపులు ఆమె గుండె తలుపులు తట్టి పలకరించాయో ఏమో... కన్నీరు మున్నీరైపోయింది వైశాలి.

"ఐసీ... పరాయి ఆడవారి పట్ల ఆయన ప్రవర్తన ఎలా ఉండేది?" అడిగాడు ధనుంజయ్.

ధనుంజయ్ అడిగిన ప్రశ్న ఆమె హృదయాన్ని తాకిందో... ఏమో... చివాలున తలెత్తి చూసి "వాడ్డూ యూ మీన్" అడిగింది కోపంగా.

"ఐ మీన్ దట్ వాట్టైసే... మీరు నామీద కోపం తెచ్చుకుని నిజాలు దాచవద్దు మేడమ్... దానివలన మీకే నష్టం. ఆల్ రెడీ మీరు మీ విలువైన మాంగల్యం కోల్పోయారు. అంతకన్నా అమూల్యమైనది ఇంకేమీ ఉండదు కదా! మీరు సుహాసిని గారిని అనుమానిస్తున్నారూ అంటే... ఆటోమాటిక్‌గా అర్థం అయిపోతోంది సత్యకుమార్‌గారి క్యారెక్టర్ ఏమిటో!

ప్రతివ్యక్తిలోనూ మనకితెలియని కొత్తకోణం ఏదో దాగిఉంటుంది. ఆయన మంచివ్యక్తే కావచ్చు.

కాని, మానవసహజమైన బలహీనత ఆయనలోనూ ఏదో ఉండే ఉంటుంది. ప్లీజ్... వాస్తవాలు తెలియ జేయడంవల్ల మీకే లాభం..." కన్విన్సింగ్‌గా అన్నాడు ధనుంజయ్. వైశాలి కళ్ళెత్తి చూసింది. విశాలమైన ఆమె నయనాలనిండా నీళ్ళు నిండివున్నాయి.

"అయామ్ సారీసర్.కొంచెం ఎమోషనల్ అయ్యాను. మీరు అన్నది నిజమే. ఆయన మంచిమనిషే.. కాని, ఆయనలోనూ బలహీనతలున్నాయి. అది బలహీనతో ఆయన ప్రవృత్తో నాకు తెలియదు.

సహజంగా ఆయన సౌందర్యారాధకులు. అందమైనవాటిని చూసి పులకించి, పొంగిపోతారు. ముఖ్యంగా అందమైన ఆడవారిని చూస్తే ఆయనలోని సౌందర్యోపాసకుడు నిద్రలేస్తాడు"

"ఓన్లీ అందాన్ని ఆరాధించడమేనా! ఆ అందాన్ని సొంతం చేసుకోవాలని ఆరాటపడతారా?" వైశాలి మాటలకి అడ్డు తగిలాడు ఎస్సై ధనుంజయ్.

"ప్లీజ్ నన్ను చెప్పనివ్వండి. సాధారణంగా స్త్రీలు అసూయాపరులంటారు. నేను కూడా దానికి అతీతం కాదు. ఇంటికొచ్చిపోయే బంధువుల్లోగాని, నా స్నేహితులలోకాని, ఆయన కింద పనిచేసిన వర్కర్స్‌లోగాని



## కోరిన పాత్రలు

ఇప్పటిదాకా చేసిన సినిమాల్లో ఉత్తమ పాత్ర ఏదని అడిగితే, “అటువంటిది ఇంకా ఏదీ చేయలేదు” అని ఠక్కున చెప్పింది సమంత.

“ప్రతి సినిమా చేసేటప్పుడూ అది అత్యుత్తమమైన పాత్ర అనే ఫీలవుతాను. అయితే కొన్నాళ్ళ తర్వాత అంతకంటే మంచిపాత్ర చేయాలనిపిస్తుంటుంది. వృత్తిరీత్యా నాలో ఆశ ఎక్కువ.

ఓ నటిగా నా ఈ ప్రస్తుత దశమాత్రం అత్యుత్తమమైనదిగానే భావిస్తున్నాను. కోరిన పాత్రలు లభిస్తున్నాయి. ఇది మంచి పరిణామం అనుకుంటున్నాను” అని వివరించింది.

ఎవరన్నా అందమైనవాళ్ళు కనపడడం భయం... వెంటనే వారిసౌందర్యాన్ని పొగడడం మొదలెట్టేసేవారు. వాళ్ళతో పరిచయం కావాలని ఆరాటపడేవారు. దానితో నాకు కోపం వచ్చేది. అలిగి పుట్టింటికిపోయిన సందర్భాలు కూడా ఉన్నాయి”

“అలాంటప్పుడు ఆయనేం చేసేవారు? బ్రతిమలాడి మిమ్మల్ని పుట్టింటి నుంచి తీసుకొచ్చేవారా? లేక పోతేపోయింది... తాను హాయిగా ఎంజాయ్ చేసేవారా?”

“లేదు లేదు... నేను వెళ్ళిపోయిన వెంటనే ఆయన కూడా నా వెనక మావాళ్ళింటికి పరుగెత్తుకొచ్చేసేవారు. అలా అందాన్ని ఆరాధించడం తన బలహీనత అని... నాకు అన్యాయం చేసే ఉద్దేశ్యం ఏ కోశానాలేదని నా కాళ్ళు గడ్డంపుట్టుకుని ప్రాధేయపడి మరీ నన్నుఇంటికి తీసుకొచ్చేసేవారు”కాస్త గర్వంగా చెప్పింది వైశాలి.

“ఐసీ... అయితే ఆయన దృష్టి అందమైన ఆడవాళ్ళు తారసపడితే వాళ్ళని ఆరాధించడమే తప్ప, వాళ్ళతో సంబంధం పెట్టుకోవడం మీద కాదన్న మాట!” సాలోచనగా తలూపాడు ధనుంజయ్.

“అలా అని ఖచ్చితంగా చెప్పలేను. ఇందాక మీరే అన్నారు కదా! ప్రతిమనిషిలోనూ ఎవరికీ తెలియని వేరే కోణం ఏదో ఉంటుందని.

బహుశా...ఆయనలోకూడా నాకు తెలియని మరో కోణం ఉందేమో!” విరక్తిగా నవ్వింది వైశాలి.

“అయ్యుండచ్చు... సుహాసినీని మీరు మళ్ళీ ఎప్పుడు, ఎక్కడ చూశారు?”

“శ్రావణ శుక్రవారం కోసమని వెండి దీపారాధన కుందులు కొనడానికి నేను, ఆయన సిఎమ్ఆర్‌కి వెళ్ళాం. సాధారణంగా అక్కడ కనిపించింది సుహాసిని. తను నన్నుగుర్తుపట్టలేదు. నేనే తనని పోల్చి పలకరించాను. తనుకూడా ఆదరంగా మాట్లాడింది. ఇద్దరం ఒకరివివరాలుఒకరుఅడిగితెలుసుకున్నాం”

“అదేమిటి... సుహాసినిగారు మీమధ్యన పరిచయమే తప్ప స్నేహం లేదన్నారు? అలాంటప్పుడు ఒకరి వివరాలు ఇంకొకరు ఇచ్చిపుచ్చుకోవడమెలా సాధ్యం?” సుహాసినిని ప్రశ్నించినట్లే అమాయకంగా అడిగాడు ధనుంజయ్, వైశాలి ఏం చెప్తుందో విందామని.

“అలాగని ఏముంది! ఒక్కోసారి చాలారోజుల తరువాత పరిచయస్తులు ఎదురైతే ఆపాటి కుశల ప్రశ్నలు వేసుకోవడం సహజం.

సుహాసిని నా క్లాస్‌మేట్... ఇద్దరం మూడేళ్ళు కలిసి చదువుకున్నాం. ఆమెకు నాతోనే కాదు, ఎవరితోనూ అంత ప్రగాఢ స్నేహం లేదు. కాబట్టి మేము ఒకరి సంగతులు ఇంకొకరం తెలుసుకోకూడదని రూలేం లేదు.. కాబట్టి క్యాజువల్‌గా మామధ్య కొన్ని కబుర్లు దొర్లాయి...” చెప్పింది వైశాలి.

“ఆమెను మీ భర్తకి పరిచయం చేశారా?”

“హా.. చేశాను. సుహాసిని చాలా ఇంటెలిజెంట్. క్లాసులో అన్నింటా ముందుండేది. ఆమెతో స్నేహం చేయాలని మేమందరం ఆరాటపడేవాళ్ళం. బట్ తను ఎవరితోనూ అంతగా కలిసేది కాదు.

అందుకే పెద్ద అటాచ్‌మెంట్ ఏర్పడలేదు తనతో. మేమందరం డిగ్రీతో ఆపేస్తే తనుమాత్రం ఎమ్మెస్సీ చేసి, ఎంఫిల్ కూడా చేసింది. అదికూడా వివాహానంతరం. ఆమె మాలో చాలా మందికి ఒక రోల్‌మోడల్ లాంటిది. అలాంటి పరిచయస్తురాలు ఎదురైనప్పుడు పరిచయం చేయకుండా ఎలా ఉంటాను? మామూలుగానే ఆయనకి ఇంట్రడ్యూస్ చేశాను”చెప్పింది వైశాలి అది సహజమైన సంగతేనన్నట్లుగా.

“మరి ఆయన అప్పుడు ఎలా రియాక్టయ్యారు?” కుతూహలంగా అడిగాడు ధనుంజయ్.

“ఎప్పటిలాగానే... సుహాసిని అందం ఆడవాళ్ళమైన మమ్మల్నే కదిలిస్తుంది. మరి మగాళ్ళు చలించకుండా ఉంటారా? అందునా సౌందర్యాన్ని ఆరాధించే ఆయనలాంటివాళ్ళు డిస్టర్బ్ అయి తీరుతారు.

సుహాసినీని చూడగానే ఆయనకళ్ళు మిలమిల మెరిశాయి. ఆ కొద్దినిముషాల్లోనే చూపులతోనే ఆమె అందాన్ని తాగేశారు. అంత వయసుమీదపడినా అందాలరాశిలా వెలిగిపోతున్న ఆమెను తన తీక్షణమైనచూపులతో కొరక్కుతినేశారు” కాస్త బాధగా చెప్పింది వైశాలి. ఆ బాధలో ఈర్ష్యకూడా తొంగి చూసింది. నిజానికి వైశాలి అందం తక్కువేంకాదు. ఆకర్షణీయమైన రూపురేఖావిలాసాదుల్లో ఆమె సుహాసినికి ఏమాత్రం తీసిపోదు.

‘పొరుగింటి పుల్లకూర’ చందాన ఎంత అందమైన ఇల్లాలు దొరికినా కొందరు మగవాళ్ళ దృష్టి పరాయి ఆడవారివైపు మళ్ళీ తీరుతుంది. అది వారి నైజం.

ముక్కుమూసుకుని అడవుల్లో తపస్సు చేస్తూ ఆకులు అలములు తిని పడుండే మునులను సైతం కదిలించారు ఆ సురకన్యలు. అఫ్టాల్ మానవమాత్రుడైన సత్యకుమార్ ఎంత! నవ్వుకున్నాడు ధనుంజయ్



## మంచి నటి కావాలని

‘ధడక్’ విజయంతో తాను స్టార్‌ను అయినట్లు భావించడంలేదని, మంచి నటిని కావడానికి ప్రయత్నిస్తున్నానని చెప్తోంది జాన్వీకపూర్.

“నా దర్శకుడు శశాంక్ ఖైతాన్ నుంచి ఉత్తమ ప్రశంస అందుకున్నాను. నన్ను చూసి గర్వించానని అన్నారు. అంతకంటే ఎక్కువగా ప్రేక్షకుల స్పందన బావుంది. ఇవన్నీ అతిపెద్ద ప్రశంసలు” అని తెలిపింది జాన్వీకపూర్. ముంబయి శివార్లలోని ప్రఖ్యాత సింగిల్ స్క్రీన్ థియేటర్ గెయిటి గెలాక్సీలో సహనటుడు ఇషాన్ ఖట్టర్, దర్శకుడు శశాంక్‌ఖైతాన్‌లతో కలిసి సినిమా చూసిందట.

తనలో తనే. అంతలోనే సర్దుకుంటూ "ఆ తరువాత ఏమైంది?" అడిగాడు ఆసక్తిగా ముందుకు వంగి.

"ఏముంది, ఇంకా అక్కడే ఉంటే సుహాసిని ఆయన తీరుకి ఇబ్బందిపడుతుందనిపించి... నేనే సంభాషణ తుంచేసి బయటకు నడిచాను" చెప్పింది వైశాలి.

"ఇంటికొచ్చాక మీ మధ్యన ఆమె గురించిన ప్రస్తావన ఏమన్నా వచ్చిందా?"

ఎందుకో ధనుంజయ్ ముఖంలోకి ఓసారిచూసింది వైశాలి. ఆ చూపుల్లో బెరుకు పసిగట్టిన ధనుంజయ్ "ప్లీజ్ మామ్... విషయాలు దాచద్దు. మీ భర్తనంత దారుణంగా హత్యచేసిన వారెవరో తెలియాలంటే మీరు మాకు సహకరించాలి. ప్లీజ్..." అన్నాడు.

వైశాలి చాలా భారంగా నిట్టూర్చి అంది- "నిజానికి భర్త గుణగణాలను వేరేవ్యక్తి ముందు విప్పిచెప్పాలంటే అభిమానంగల ఏ ఆడదానికైనా కష్టమే.

ఎన్ని బలహీనతలు వున్నా నన్ను అమితంగా ప్రేమించి, లాలించినవ్యక్తి అలా దిక్కులేని చావు చావడం నేను ఇంకా దిగమింగుకోలేకపోతున్నా. ఆయన్ను అంత దారుణంగా చంపి ఆ హంతకులెవరో పట్టుబడడంకోసమైనా నేనాయన గురించి చెప్పితీరాలి" ఎర్రబడ్డ నేత్రాలతో, రోషంగా చూస్తున్న వైశాలి అచ్చం పగపట్టిన నాగినిలా కనిపించింది ధనుంజయ్ కళ్ళకి.

"గుడ్... మీలో ఈ స్పిరిటే మాకు కావలసింది... చెప్పండి..." ఆమెను ప్రోత్సహించాడు.

"ఆ రోజు... మేము షాపింగ్ పూర్తి చేసుకుని ఇంటికి వచ్చాక..."

'అవునూ... ఇందాక సిఎమ్మార్‌లో మనకి కనిపించిందే... నీ ఫ్రెండ్... అదే... ఆవిడ పేరేమిటన్నావూ... కాళ్ళు చేతులు కడుక్కుని నైటీలోకి మారి వచ్చిన వైశాలిని చూస్తూ అడిగాడు సత్యకుమార్.

'సుహాసిని... అయినా మీకెందుకా వివరాలు? అప్పుడే తనమీద పడ్డాయా మీ కళ్ళు' నవ్వుతూ అడిగింది వైశాలి. ఆమె స్థానంలో వేరే ఇంకెవరన్నా ఉంటే అతడడిగిన తీరుకి, ఆ ఆరాలకి ఒళ్ళుమండి నానా రాద్ధాంతం చేసి ఉండేవారు.

మొదట్లో వైశాలి కూడా అలాగే ఉండేది. రాన్రానూ అలవాటు పడిపోయింది.అరచి యాగీ చేస్తే సంసారం వీధినపడడం తప్ప వేరే ఏ ప్రయోజనమూ ఉండదని గ్రహించింది. భర్త తనను మహారాణిలా చూసుకుంటున్నప్పుడు, ఇలాంటి చిన్న విషయాలు పట్టించుకోనక్కర లేదు... అన్న రాజీధోరణిలోకి వచ్చేసింది.

ఆమేకాదు... సగటు ఇల్లాళ్ళు చాలామంది అలాగే ఉంటారేమో! పిల్లలు డిస్టర్బ్ అవుతారనో, సంసారంలో ప్రశాంతత లోపిస్తుందేమో అన్న భయంవల్లనో... భర్త చిలక్కొట్టుళ్ళకి అలవాటుపడినా చూసీచూడనట్లుగా సర్దుకుపోతారు.

'ఛఛ... కళ్ళుపడడం కాదోయ్... కళ్ళుచెదిరే ఆమె అందాన్ని చూసి మతిపోయినంతపనైంది. నిజంగా ఆమె భర్త దురదృష్టవంతుడు. ఇంతటి బ్యూటీని విడిచిపెట్టి అర్ధాంతరంగా చచ్చిపోయాడు.

ఆ దేముడు నిర్దయుడే కాదు. సరసం తెలియనివాడుకూడా"విచారం వెలిబుచ్చాడు సత్యకుమార్.



తన వివాహం, భవిష్యత్తుగురించి జాతకాలు చెప్పేవాడిదగ్గరికి వెళ్ళటంలో ఏమన్నా అర్థముందా!
-జగ్గీవాసుదేవ్, ఆధ్యాత్మిక గురు

"అవును పాపం! మీ అంత సరసులు, రసికులు కాదు మా సుహాసిని భర్తా..., ఆ దేముడూ కూడానూ. అయినా మీకిదేం సరదా అండీ... అందమైన అమ్మాయినిచూస్తే వాళ్ళ సొగసులని, సోయగాలని వర్ణించకుండా ఉండలేరు...

పోనీ నేనేమన్నా రూపంలేనిదాన్నా అంటే నాకు ఇంజనీరింగ్ చదువుతున్న కొడుకున్నాడంటే ఎవరూ నమ్మనంత అందంగా, యంగ్‌గా ఉంటాను.



సరైన ఉద్యోగాలు దొరకనందునే మూకుమ్మడి దాడులు జరుగుతున్నాయి.
-వసుంధర రాజె, రాజస్థాన్ సి.ఎమ్.

నన్ను చూసి మా ఫ్రెండ్సందరూ కుళ్ళుకుంటారు కూడానూ... మీలాగే వేరెవరన్నా నన్ను చూసి ఇలా ఆరాధించడం మొదలెడితే మీకెలా ఉంటుంది చెప్పండి!' నవ్వుతూనే నాలుగంటించింది వైశాలి.

మై స్వీట్ వైశూ... అందం కళ్ళకి విందోయ్... అందమైనదాన్ని దేన్ని చూసినా ఆరాధించడం రసికుడి లక్షణం. నిన్నే కనుక ఎవరన్నా అలా ఆరాధిస్తే అంతటి అందాలరాశి నా భార్య అయిందని గర్విస్తానే తప్పించి... ఏ మాత్రం బాధపడను.

'అందమే ఆనందం' అన్నారు కదా ఎవరో మహాకవి' సుతారంగా వైశాలి చెంప మీద తట్టాడు సత్యకుమార్.

'ఈ వేషాలకేంగాని, సుహాసినీని అంత పొగుడుతున్నారుకదా! ఒక్కవిషయం తేల్చిచెప్పండి...నేనందగత్తెనా... సుహాసిని అందగత్తా?

అసలు నాకున్న రంగుకాని, ఫిజిక్ కాని సుహాసినికి ఉన్నాయా?' ఉక్రోషంగా అడిగింది.

'మై డియర్ భార్యామణీ... ఒక ఆడదాని అందానికి, ఇంకో ఆడదాని అందానికి అసలు పోలికే ఉండదు తెలుసా... నువ్వు పచ్చని పసిమిఛాయ...

కాదనను.. సుహాసిని చామనఛాయే అయినా ఆ దేహ కాంతి చూడు... మిలమిల పట్టులా మెరిసే ఆ జుట్టు చూడు... చిన్నగా నవ్వినప్పుడు వంపు తిరిగే ఆ పెదవుల విరుపుచూడు... వల్ల జీడిపిక్కల్లా తళతళలాడే ఆ కళ్ళలోని తేజస్సు చూడు... ఆ భగవంతుడు ఒక్కొక్కరిలో ఒక్కో అందాన్ని పెడతాడు.

అసలు అందం వేరు, ఆకర్షణ వేరు. కొందరికి కవులు వర్ణించే లక్షణాలు లేకున్నా... వర్ణించనలవికాని ఆకర్షణేదో వాళ్ళలో నిండిపోయి ఉంటుంది.

అంతేకాని, తెల్లని శరీరమో, పెద్దజుట్టో, కలువ కళ్ళో తీర్చిదిద్దినట్లుగా ఉన్న విగ్రహమో సౌందర్యానికి ప్రామాణికాలు కావు. నీ అందం వేరు... ఆమె అందం వేరు. రెంటినీ సరిపోల్చడం నా వల్లకాదు..."

ఏదో తాదాత్మ్యంలో మునిగితేలుతూ ఆడవారి అందచందాలు ఎలా బేరీజు వేయాలో చెప్పాడు సత్యకుమార్.

ఎందుకో వైశాలి మదిలో ఒక ఈర్ష్యాతరంగం ఫెటిల్లున ఎగిసిపడింది.

అది ఆమె హృదయాన్ని నిలువెల్లా కుదిపివేసింది. ఈ మధ్యకాలంలో సత్యకుమార్‌పట్ల ఏర్పడని విముఖత ఏదో ఎదలో చోటుచేసుకుంది.

ఇదివరకు అతడు ఏ స్త్రీ అందచందాలని కీర్తించినా వారందరూ ఆమెకన్నా తీసికట్టు అన్నభావన ఒకస్త్రీగా ఆమెకు సంతృప్తినిచ్చేది. కాని, ఇక్కడ భర్త పొగుడుతున్నది దాదాపు తనతో సమానమైన శోభను కలిగి ఉన్న తన స్నేహితురాలిని. అతడు అంటున్నది నూటికి నూరుపాళ్ళూ వాస్తవం. భర్తసంగతి తెలిసి తన స్నేహితురాళ్ళెవరితోనూకూడా సన్నిహితసంబంధాలు పెట్టుకోలేదు.

అవసరం అయితే తనే వెళ్ళి వాళ్ళని కలిసివస్తుంది కాని, వాళ్ళెవరికీ ఈ ఇంట్లో ప్రవేశించే వీలు కల్పించలేదు కాని, తలవని తలంపుగా తారసపడిన సుహాసిని మాత్రం తన భర్త కంటపడింది.

అతడిలో సహజమైన ప్రవృత్తి నిద్రలేచింది. ఎంత సరిపెట్టుకుందామన్నా అది అతడి నైజమని ఊరుకోలేకపోతోందీసారి.

అంతలోనే సుహాసిని స్వభావం తెలిసినదానిగా సంతోషించిందామె. సుహాసిని అంతత్వరగా ఎవరితోనూ కలవదు. ఆమెకి ఆడస్నేహితులే తక్కువ. ఇక మగవాళ్ళతో పరిచయం పెంచుకునే ప్రసక్తేలేదు. సో.. ఈ విషయంలో తాను వర్రీ అవనక్కరలేదు.

సుహాసిని తన మొగుడిని దరిదాపుల్లోకి కూడా చేరనివ్వదు. అలా అనుకున్న తర్వాత వైశాలి మనసు తేలికపడింది. ఆ తరువాత సత్యకుమార్ సుహాసిని గురించి ఏ కామెంట్స్ చేసినా చిరునవ్వుతో వింటూ ఉండిపోయిందితప్ప వద్దని వారించలేదు.

"సుహాసినీగారి స్వభావం మీకు బాగా తెలుసు



## పనుల జాబితా

క్రమశిక్షణ పాటించడంవల్ల జీవితంలో ఖచ్చితంగా పైకి వస్తారంటూ పదేపదే పాడే పాటనే మరోమారు వినిపించింది తమన్నా. నిద్రలేవగానే చేసే దైనందిన కార్యక్రమాల్ని ఏకరువుపెట్టింది.

"ఉదయం నిద్ర లేస్తూనే ఆనాడు చేయాల్సిన పనుల జాబితా రాసుకుంటాను. ప్రాధాన్య క్రమాలు ఇచ్చుకుంటా.

ఏ పనినీ అసంపూర్తిగా చేయనని, సగం మనస్సుతో చేయనని ప్రతిజ్ఞ చేసుకుని, ఆ ప్రకారమే ఖచ్చితంగా నడుచుకుంటాను. నూరుశాతం మనస్సుపెట్టి చేసినప్పుడు ఒకవేళ ఫలితం బాగా లేకపోయినా బాధకలగదు. అదే సగంసగం మనస్సుతో చేస్తే క్షోభ తప్పదు" అని తెలిపింది.

కదా! అలాంటిది ఆమెను మీరెందుకు అనుమానించారు. సహజంగా స్త్రీ సౌందర్యాన్ని అడ్మైర్ చేసే గుణమున్న మీ శ్రీవారు ఆమెను కూడా అదే దృష్టితో చూసి స్పందించారు. అంతమాత్రానికి మీరు ఆమెను అనుమానించారా? అన్‌బిలీవబుల్..." పెదవి విరిచాడు ఎస్సై ధనుంజయ్.

"ఆ చిన్ని కారణానికి నేను ఆమెను అనుమానించలేదు. అసలు కొన్నాళ్ళపాటు నేనా విషయమే మరచిపోయా" చెప్పింది వైశాలి పెదవులు తడిచేసుకుంటూ.

"మరి...!" ధనుంజయ్ నొసలు ముడివడింది.

'డ్రైవర్... కారాపు...' రోడ్డుకి ఎడమవైపు కాస్మోసిటీ బోర్డు కనబడగానే చెప్పింది వైశాలి. ఆ రోజు సిఎమ్మార్‌లో సుహాసిని కనబడినప్పుడు తానుండేది కాస్మోసిటీ గేటెడ్ కమ్యూనిటీలో అని చెప్పడం గుర్తొచ్చింది ఆమెకి. బాగా ధనవంతులు మాత్రమే నివసించే పోష్ ఏరియాలో, అంతకన్నా విలాసవంతంగా నిర్మించబడిన భవనసముదాయం అది. అందులో ఎగువ మధ్యతరగతివారికి కూడా అందుబాటులో ఉండేలా ఇళ్ళు నిర్మించారు.

విల్లాలు, ఇండివిడ్యువల్ హౌస్‌లు, అపార్ట్‌మెంట్స్ అన్నీ ఉన్నాయి ఆ గేటెడ్ కమ్యూనిటీలో.

'ఇందులో ఇల్లుందీ అంటే... ఫరవాలేదు... సుహాసిని బాగానే సంపాదిస్తోంది.ఎటూ ఇటువైపు వచ్చింది. సుహాసినిని ఓసారి పలకరించిపోతే ఎలా ఉంటుంది! ఈపాటికి కాలేజ్‌నుంచి వచ్చేసి ఉంటుంది' అనుకున్న వైశాలి డ్రైవర్ కారాపగానే చటుక్కున దిగిపోయి డ్రైవర్‌ని వెయిట్ చేయమని చెప్పి ఆ భవన సముదాయం వైపు నడిచింది.

గేటు దగ్గరకు చేరిన వైశాలిని సెక్యూరిటీ అటకాయిస్తూ "ఎవరింటికి వెళ్ళాలి మేడమ్..." అడిగాడు మర్యాదగా.ఆ రోజు సుహాసిని తానుఇక్కడ ఉంటున్నానని చెప్పిందేకాని, తన ఫ్లాట్‌నెంబర్‌ఏమిటో చెప్పలేదు. ఫోన్‌నెంబర్ ఇచ్చినా ఆ నెంబర్ వేరే ఫోన్‌లో సేవ్‌చేసుకుంది. బయటకు వెళ్ళే హడావుడిలో అది ఇప్పుడు ఇంటిదగ్గర వదిలేసింది.

'గొప్ప చిక్కే వచ్చిందే... పోనీ ఈసారి వద్దాంలే' అనుకున్న వైశాలి సెక్యూరిటీని అడిగితే వివరాలేమన్నా తెలుస్తాయేమో ప్రయత్నించి చూద్దాం అనుకుని..

'ఇక్కడ సుహాసిని గారని ఒకామె ఉంటున్నారు. ఫ్లాట్ నెంబర్ గుర్తులేదు. గవర్నమెంట్ జూనియర్ కాలేజ్‌లో ఫిజిక్స్ లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. ఆమె ఫ్లాట్ నెంబర్ ఏమిటో చెప్పగలవా?' కొన్ని వివరాలన్నా గుర్తుపెట్టుకున్నందుకు తనని తానే అభినందించుకుంటూ అడిగింది అభ్యర్థనగా.

సెక్యూరిటీ మరో ఆలోచన లేకుండా "ఓ ఆ మేడమా! నాకు బాగా తెలుసు... నాలుగో బ్లాక్‌లో... మూడువందల ఐదు నెంబర్ ఫ్లాట్‌లో ఉంటారు. చాలా మంచి మేడమ్, ఆ మేడమ్ మీకు ఫ్రెండా మేడమ్" అంటూ హుషారుగా చెప్పుకుపోయాడు.

"అవునయ్యా... ఇంతకీ తను ఇంట్లో ఉందో లేదో..." అడిగింది వైశాలి ఉత్సాహంగా.

"ఇప్పుడే వచ్చారు మేడమ్... ఈ రిజిస్టర్‌లో మీ పేరు, ఫోన్ నెంబర్ రాసి లోపలికి వెళ్ళండి" అంటూ ఓ లావుపాటి పుస్తకం ఆమె ముందుకు తోశాడు.

వైశాలి కట్టుకున్న కాఫీ ప్యూర్ సిల్క్ చీర, పెట్టుకున్న వజ్రపునగలు ఆమె సమాజంలో ఆమె స్థాయిని చెప్పకనే చెపుతున్నాయి. వాటిని బట్టి ఆమె చాలా రిచ్ అని గ్రహించిన సెక్యూరిటీ స్వరంలో అతడికి తెలియకుండానే ఏదో రెస్పెక్ట్ చోటు చేసుకుంది.

ముందుకు వంగి టేబుల్ మీద ఉన్న పుస్తకంలో సంతకం చేయబోతూండగా ఆమె ఫోన్ మోగింది. "ఒక్కక్షణం..." అంటూ ఆగి హ్యాండ్ బ్యాగ్‌లో నుంచి సెల్ తీసి ఆ కాల్ ఎవరిదగ్గరనుంచా అని చూస్తూ ఉండగా సెల్ జారి కిందపడింది. "అరెరె..." అంటూ పడిపోబోతున్న దానిని మధ్యలోనే పట్టుకునేందుకు



## ఓ వరం

కలలు కంటూ, వాటిని సాకారం చేసుకునే సరైన ఉద్దేశ్యాలతో సాగితే అవి నిజమవుతాయన్నది అదితీరావ్ హైదరీ అభిప్రాయం.

"ప్రతి సినిమా, ప్రతి అనుభవం ఎదగడానికి, అభ్యాసానికి సహకరిస్తాయని నేను నమ్ముతాను. మణిరత్నం, సంజయ్‌లీలా భన్సాలీల వద్ద పని చేయగల అవకాశాలు నాకు దక్కాయి.

వీటిని నేను వరంలా భావిస్తాను. నా గురించి నేను అరిచి చెప్పుకోలేను. దర్శకులు, పూర్తి టీమ్ నాకు పేరు తెచ్చిపెట్టారు. ప్యాన్ ఇండియన్ పని చేయడానికి నేను ప్రయత్నిస్తున్నాను. మంచి రచయితలు, దర్శకుల వద్ద పనిచేయాలని కోరుకుంటున్నాను. వాళ్ళు స్ఫూర్తి ఇస్తారు" అంటూ సకల సంగతులూ ఏకరువుపెట్టింది.

వైశాలి కిందికి వంగుతూ తనచేయి చాచబోతూఉంటే ఆమెకంటే ముందే అలర్ట్ అయిన సెక్యూరిటీ దాన్ని కిందపడకుండా పట్టుకున్నాడు.

ఫోన్ ఒకసారి రింగై ఆగిపోయి మళ్ళీ మోగడం ప్రారంభించింది. ఆ కాల్ ఎవరిదగ్గరనుంచి వస్తోందో తెలుసుకోవడానికి ముందుగానే కాంటాక్ట్‌తోపాటు ఫోటోకూడా సేవ్‌చేసిపెట్టుకోవడంమూలాన సెల్‌ఫోన్ స్క్రీన్‌మీద సత్యకుమార్ ఫోటోడిస్‌ప్లే అవసాగింది.

ఫోన్‌ని వైశాలికి అందించే క్రమంలో ఆ స్క్రీన్‌మీద కనిపిస్తున్న సత్యకుమార్ బొమ్మని చూసి "ఈ సార్ మీకు ఏమవుతారు మేడమ్..." కుతూహలంగా అడిగాడు సెక్యూరిటీ. ఫోన్ ఆన్సర్‌చేసే హడావుడిలో ఉన్న వైశాలి అతడిని ఆగమన్నట్లుగా చేత్తో సైగచేసి ఫోన్ లిఫ్ట్ చేసింది.

**ఇంకా ఉంది**




పర్సనల్ ఎజెండా

# దిశా పటాని

తన అందచందాలతో, నటనా ప్రతిభతో దిశా పటాని ప్రేక్షకుల హృదయాలు దోచేసింది. 'బాఘి 2' సినిమా హిట్ తర్వాత మరింత జోరు అందుకున్నది. ఇటు ప్రేక్షకుల, అటు విమర్శకుల ప్రశంసలు దక్కించుకోగలిగింది.

స్టయిల్‌లో, వ్యక్తిగత జీవితానికి సంబంధించిన అంశాల్లో ఆమె ఎప్పుడూ వార్తల్లో వుంటుంటుంది. ఆమె వ్యక్తిగత విశేషాల్లోకి వెళ్తే...

▸ **మోడలింగ్ అవకాశం వచ్చేసరికి :** ఇతర అమ్మాయిల మాదిరే గ్రాడ్యుయేషన్ చేస్తున్నాను

▸ **మోడలింగ్‌లో కెరీర్ కోసం :** మధ్యలో బి.టెక్ వదిలేశా. ఇండోర్‌లో పాండ్స్ ఫెమినా మిస్ ఇండియాలో పాల్గొనడానికి వెళ్ళాను

▸ **తొలి విజయం :** తోటి పోటీదారులను, న్యాయనిర్ణేతలను మెప్పించి తొలి రన్నర్-అప్‌గా నిలిచా

▸ **తొలి సినీ అవకాశం :** 2015లో వరుణ్ తేజ్ సరసన 'లోఫర్'లో నటించే ఛాన్స్ దొరికింది.

▸ **తొలి కమర్షియల్ బ్రేక్ :** 2016 నాటి 'ఎమ్.ఎస్.ధోని : ఏన్ అన్‌టోల్డ్ స్టోరీ'

▸ **గొప్ప అవకాశం :** జాకీచాన్ సినిమా 'కుంగ్‌ఫు యోగా'లో నటించగలగడం

▸ **మరువలేని ప్రశంసలు :** తొలి బాలీవుడ్ సినిమాకే దక్కాయి. అనేక అవార్డులు అందుకోగలిగాను

▸ **ఎండార్స్‌మెంట్ల విషయంలోనూ :** జాగ్రత్తగా ఎంచుకుంటాను. అందరికీ ఆమోదయోగ్యమైన, నాణ్యమైన స్కిన్ కేర్ ప్రొడక్ట్స్‌కే పనిచేస్తా

▸ **ప్రేక్షకులతో కనెక్ట్ కావడానికి :** బ్రాండ్ ఎండార్స్‌మెంట్లు సరైన మార్గంగా భావిస్తాను. సెలబ్రిటీ ఫేస్‌ను ప్రేక్షకులు మరువలేరు

▸ **ఏ పాత్ర చేస్తున్నా :** అందుకోసం కావాల్సిన అంశాలను జాగ్రత్తగా ప్రాక్టీస్ చేస్తాను.

దానిలో భాగంగానే ఇప్పుడు సర్కస్ జీవితాన్ని, మార్షల్ ఆర్ట్స్‌ను అవగాహన చేసుకుంటున్నాను

▸ **ప్రస్తుతం నేను :** తమిళ చారిత్రాత్మక డ్రామా 'సంఘమిత్ర' షూటింగ్ చేస్తున్నాను

▸ **తొలిసారిగా :** టైగర్ ష్రాఫ్‌తో కలిసి మ్యూజిక్ వీడియో 'బెఫిక్ర' చేశాను

▸ **టైగర్‌ష్రాఫ్ గురించీ, నా గురించి :** అనేక రూమర్లు వినపడుతున్నాయి.

కాని మా నడుమ మంచి స్నేహమే ఉంది తప్ప మరేదీ కూడా లేదు

▸ **డేటింగ్ రూమర్లు :** అన్నీ అబద్ధాలు

# వారఫలం

అగష్టు 23 నుండి 29, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి

సెల్ : 94921 56064



**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. ఈ వారంలో సంతాన వ్యవహారాలచే కొన్ని ఒత్తిడులు ఎదుర్కోవలసివచ్చినా యత్నీకృత కార్యాలను పూర్తిచేసుకోగలరు. కొన్ని అనుకున్న ప్రయాణాలు వాయిదాపడడం, కొన్ని ఊహించనివి చేయవలసిరావడం వంటివి ఉంటాయి. ఆదాయాలు యథా తథంగా కొనసాగుటచే పూర్వార్జితాలను అవసరాలకు కదపవలసి రావచ్చును. వృత్తి, ఉద్యోగాలు అనుకున్నవి పొందగలరు. లలితా ఆరాధన చేయడం మేలు కరం. ఈ రాశివారికి గురు, శుక్ర, ఆది, సోమవారాలు అనువైనవి.



**వృషభం:** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. ఈ వారంలో అనారోగ్య భావనలు- ఊహించుకున్న వ్యక్తులచే సహకార లోపత్వములు ఉంటాయి.వ్యక్తిగతంగా ఒత్తిడులకు గురి కాగలరు. సంతానపు అవసరాలను తీర్చగలరు. నిరుద్యోగులకు శుభాలేర్పడగలవు. పూర్వం నిలిచిన విదేశీ వ్యవహారాలు పూర్తవ్వగలవు. బంధు మిత్రుల ఉత్సాహాలలో పాల్గొనగలరు.వివాహ ప్రయత్నాలందు నిరాశలు ఏర్పరచు కోకుండా సాగాలి. ఈ రాశివారికి శుక్ర, శని, ఆది, బుధవారాలు అనునైనవి.



**మిథునం:** మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా. గురు, శుక్ర, శనివారాలందు అష్టమ చంద్రస్థితిచే అన్నిటా చిన్నతరహా ఒత్తిడులను ఎదుర్కోవలసి రావచ్చును. విద్య, ఉద్యోగం వంటి విషయాలందు శుభాలేర్పడతాయి. వాహనాలు నడిపేటప్పుడు ఏమరుపాటుకూడదు. సంతాన వివాహ విషయాలందు శుభాలు కలుగుతాయి. సుబ్రహ్మణ్యారాధన తప్పనిసరిచేయుండి. స్థిరాస్తి వ్యవహారాలను కదపకండి.



**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. అనారోగ్య భావనలను ఎదుర్కోవలసి రావచ్చును. వస్తు, వాహనాల వాడక విషయాలలోనూ జాగ్రత్తలు అవసరం. రక్తసంబంధీకులతో మన స్పర్థలు పెరగకుండా జాగ్రత్తలు అవసరం. వృత్తి, ఉద్యోగాలందు మీకు రావలసిన అవకాశాలు ఆలస్యమయ్యే సూచనలున్నాయి. విద్యార్థులు నిత్యం హయగ్రీవాయ నమః. జపించుకుంటూ యత్నించుకోవాలి. నవగ్రహారాధనలు చేసుకోండి. శని, ఆది, సోమవారాలలో అన్నిటా మెలకువలు పాటించుకోండి.



**సింహం:** మఖ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. శుభకార్య నిర్వహణలు శుభకార్యాలలో పాల్గొనుటవంటివి ఉంటాయి.కుటుంబమున ఏకవాక్యతలు ఏర్పడి పెద్దవైన టార్గెట్స్‌ను సాధించగలరు. స్పెక్యులేషన్లు, స్థిరాస్తులకు సంబంధించిన ముఖ్యమైన నిర్ణయాలను చేసుకోగలరు. అధికారిక హోదాలు ఏర్పడగలవు. సంతాన వ్యవహారాలచే ఒత్తిడిని పొందు సూచనలున్నాయి. ఆర్థికపరమైన కొన్ని సర్దుబాట్లు అవసరమవుతాయి. నిత్యం ఆదిత్య ఆరాధనకు ప్రాధాన్యతనీయుండి. ఈ రాశి వారికి గురు, శుక్ర, శని, ఆదివారాలు చాలా అనువైనవి.



**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. కుటుంబంలో ముఖ్య భూమికను పోషించి జీవిత ధ్యేయమును సాధించుకోగలరు.ఇతరులను ఆకర్షించగలరు. గత వాగ్దానాలను నిర్వహించుకోగలరు. ప్రయాణాలందు జాగ్రత్తలకు ప్రాధాన్యతనీయుండి. స్పెక్యులేషన్లు, పెట్టుబడులలో అనుభవజ్ఞుల సలహాలకు ప్రాధాన్యతనీయుండి. ఇతరులచే ఇచ్చిపుచ్చుకోవడాలు సిద్ధించగలవు.మాతాపితరులకు సేవా భాగ్యాలు ఏర్పడే సూచనలున్నాయి. ఈ రాశివారికి శని, ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



**తుల:** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా. ఈ వారంలో ప్రయత్నకార్యాలు అనుకూలంగా సాగుతాయి.వ్యక్తిగతమైన వ్యవహారాలకై సేవకాజనముపై ఆధారపడక సొంతంగా నిర్వహించుకోండి. చేపట్టుకున్న ప్రయాణాలు ఉత్సాహాన్నిస్తాయి. స్థిరాస్తులకు మార్పుచేర్పులకు యత్నాలుంటాయి. అలంకరణలకు ప్రాధాన్యత నీయగలరు. వృత్తి, వ్యవహారాలను బహుముఖంగా విస్తరింపచేయగలరు. ప్రత్యుపకారాలు కోరుకోకుండా సహకరించగలరు. ఈ రాశివారికి గురు, శుక్ర, బుధవారాలు అనువైనవి.



**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ఈ వారంలో పెద్దలనుండి సహకారాలు పొందుటయేకాక, వారికై ఎక్కువ సమయం కేటాయించగలరు.మీ లక్ష్యాలను సాధించగలరు. బంధు వర్గంలో కొందరు మీపై శత్రుభావాలు ప్రదర్శించు సూచనలున్నాయి. కొన్ని అవసరమైన ఖర్చులచే అవసరాలందు సర్దుబాట్లు అవసరమవ్వగలవు. ఇతరుల నుండి మెప్పును, గౌరవమును ఆశించకుండా సాగాలి. షార్ట్ జర్నీస్ చేయవలసి రావచ్చును. ఈ రాశివారికి గురు, శుక్ర, శని వారాలు అనువైనవి.



**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. ఈ వారంలో వృత్తి, ఉద్యోగాలు మీదైన తరహాలో నిర్వహించగలరు. ఖర్చులు ఒకింత ఎక్కువగా ఉంటున్నా ప్రయత్నాలను అనుకూలింప చేసుకోగలరు. ఊహించని వ్యక్తుల నుండి సహాయాలను పొందుతారు. ఉత్సాహాలతో వ్యవహరించుకోవాలి. వాక్పారుష్యాలుండకుండా సాగాలి. నూతన ఉద్యోగ యత్నాలకు అనుకూల సమయం. శ్రమ, బడలికలను తరచూ పొందే సూచనలున్నాయి. ఈ రాశివారికి శని, ఆది, సోమవారాలు చాలా అనువైనవి.



**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. ఈ వారంలో మీ శ్రమ, బడలికలకు తగిన ప్రయోజనాలు పొందలేకపోతారు. ప్రతి పనికీ తెలియని ఒత్తిడులకు గురికాగలరు. అనారోగ్యం విషయంలో మెలకువలవసరం. అవసరాలకు, ఆప్తులనుండి సహకారాలు పొందుతారు. భూసంబంధ వ్యవహారాలను కొంతకాలం వాయిదావేసుకోండి. కుటుంబ వ్యక్తులనుండి చిన్నతరహా ఒత్తిడులు పొందిన కుటుంబమున శుభాలు నిర్వహించగలరు. మీరు సూర్య, సుబ్రహ్మణ్య ఆరాధనలు తప్పనిసరి చేసుకోండి. ఈ రాశివారికి గురు, శుక్ర, శని, బుధవారాలు అనువైనవి.



**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. ఈ వారంలో ప్రయోజనాలు పొందుతున్నా తృప్తిని పొందలేకపోతారు. కుటుంబంలో ఎవరి తీరు వారిదిగా ఉండడం, అనారోగ్యాలు, ఔషధ సేవలు చికాకుపరచగలవు. వాగ్దానాలు నిలబెట్టుకోలేని స్థితులను ఎదుర్కోవలసి రావచ్చును. బంధు మిత్రుల ఉత్సాహాలందు పాలుపంచుకోగలరు. ప్రయాణాలలో ఏమరుపాటు చూపకండి. వృత్తి, ఉద్యోగాలందు కొన్ని మంచి అవకాశాలువంటివి ఏర్పడతాయి. విద్యార్థులకు పోటీపరీక్షలకు యత్నించుకునేవారికి శుభసమయం. వీరికి శని, ఆది, సోమవారాలు అనువైనవి.



**మీనం:** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. ఈ వారమందు అన్నిటా జయకరంగా ఉంటుంది. మీరంటే గౌరవ అభిమానాలు చూపువారి సంఖ్య పెరుగుతుంది. గత ఇబ్బందులను అధిగమించుటకు అనువైన సమయం. ఆర్థికంగా సామాన్యతలున్నా మనోధైర్యాలు చూపి అవసరాలను సమర్థించుకోగలరు. రావలసిన వాటికై చేసే యత్నాలందు మొండితనం చూపక లౌక్యాలతో సాగండి. భాతృవర్గంచే ప్రయోజనాలు పొందుతారు. ఈ రాశివారు మరిన్ని అనుకూలతలకై మీరు శతరుద్రీయము పారాయణ చేసుకొనుట మేలు. ఈ రాశివారికి గురు, శుక్ర, శని, బుధ వారాలు ముఖ్యమైన పనులు చేయుటకు చాలా అనువైనవి.



ఎవరు ఎంత ప్రలోభపెట్టినా
మన సంకల్పాన్ని వదలకూడదు.

# అనిల్

Speak the language of life at work. The language of life is 'I can'

## భయం వద్దు

పిల్లలకు వయస్సు పెరుగుతున్నప్పటికీ వారిలో ఏర్పడిన కొన్ని భయాలు తొలగిపోవు. చిన్నవిషయాలే అయినప్పటికీ వాటి తాలూకు భయాలుమాత్రం పెద్దవిగా వుంటుంటాయి.

కొందరు పిల్లలకు పిల్లినో, బల్లినో, కుక్కనో చూస్తే భయంగా వుంటుంది. కొందరికి చీకటంటే భయం.

రాత్రుల్లో లైట్లు లేకపోతే, మెలుకువ వచ్చిందంటే భయంతో ఒణికిపోతారు. ఇటువంటి భయాలు వున్నా వాటిని పోగొట్టే ప్రయత్నాలు చేయాలి కాని మరింత హేళనచేస్తూ మాట్లాడకూడదు. వారి భయాన్ని తొలగించే మార్గాలకోసం అన్వేషించి, అమలు చేయాలి. మొగ్గలోనే తుంచేయకపోతే అవి మరింత పెద్దవైపోతాయి. •

## గళం విప్పితేనే జ్ఞాపకశక్తి

కొందరు పిల్లలు మనస్సులోనే నెమ్మదిగా చదువుకుంటే, ఇంకొందరికి గట్టిగా గడగడా చదివితే తప్ప బుర్రలోకి ఎక్కదు. అయితే, ఇలా పెద్దగా చదువుకోవడంవల్లే ప్రయోజనాలు ఎక్కువనేది నిపుణుల అభిప్రాయం.

పెద్దగా చదవడంవల్ల ఎక్కువకాలం జ్ఞాపకం వుంటుందని, వినడం, మాట్లాడడం అనే రెండు పనులూ దీనిలో కలగలిపివుండడమే ఇందుకు కారణమని పరిశోధకులు గుర్తించారు.

ఓ పదాన్ని లేదా వాక్యాన్ని చూడడంతోపాటు, దాన్ని బయటకు గట్టిగా పలకడంతోపాటు వల్లెవేయడం దీర్ఘకాలం జ్ఞాపకం ఉండిపోతుందన్నది వారి పరిశోధనల సారాంశం. *

## బొమ్మల పజిల్

మన జాతీయ గుర్తులను రౌండ్ చేయండి. *





## మంచువాన

కొన్ని దేశాల్లో మంచు వర్షం మాదిరి కురుస్తుంటుంది. నీటితుంపరలు గడ్డకట్టినప్పుడు మంచు ఏర్పడుతుంది.

నీటి ఆవిరి ఘనీభవించినప్పుడు స్వచ్ఛంగా ఉండే చిన్నచిన్న స్ఫటికాలు ఏర్పడతాయి. ఇవి వాతావరణంలోకి విసిరివేయబడతాయి.

ఈ క్రమంలోను నీటితుంపరలు కిందికి, పైకి వెళ్తున్నప్పుడు అనేక స్ఫటికాలు ఏకీకృతమవుతాయి.

మంచుస్ఫటికాలు ఎక్కువగా గుమిగూడినప్పుడు నేలమీదకు చేరడాన్ని 'మంచు కురవడం' అంటారు. •

## సమస్య పరిష్కార నైపుణ్యాలు

పెరిగాక, జీవనగమనంలో ఎన్నో బాధ్యతలు, చిక్కుముడులు వుంటుంటాయి. వీటిని సమర్థవంతంగా పరిష్కరించుకోగల బీజం చిన్నతనంలోనే పడాలి. సమస్యల్ని పరిష్కరించుకోగల నైపుణ్యాలు ఈ దశలోనే నేర్చుకోవడాన్ని ఆరంభించాలి.ఇందుకు వినే సామర్థ్యం, సహనం, ఓర్పు కావాలి.

సావధానంగా ఏ విధంగా సమస్యను పరిష్కరించుకోగలరో ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటూ ఉండాలి. పిల్లలు ఇటువంటి సొల్యూషన్ల విషయంలో సందిగ్ధంగా వున్నప్పుడు పూర్తి బాధ్యతను పెద్దలే తీసుకుని వాటిని పరిష్కరించకూడదు.

తగిన సహాయం అందిస్తూ,వారినే పరిష్కరించుకొమ్మని చెప్పాలి.

ఎలా చేస్తే సొల్యూషన్ లభిస్తుందని భావిస్తున్నారో వారినే అడిగి,ఆ దిశగా వారిని ప్రోత్సహించాలి. *



## కనురెప్పలు

మనం కనురెప్పల్ని ఆరుసెకన్లకు ఒకసారి అసంకల్పితంగా ఆర్పుతుంటాం. అంటే ఏడాదికి సుమారు ముప్ఫై లక్షలసార్లు ఆర్పుతామన్నమాట.

ఇలా రెప్పలు ఆర్పే సమయంలో కనురెప్పల నడుమ అతిచిన్నవైన 'సెబాషియస్' గ్రంథులు ప్రత్యేక ద్రవాన్ని స్రవిస్తాయి. స్వల్పంగా వెలికి వచ్చే ద్రవం వెంట్రుకలూ, రెప్పల కొనలు పొడిబారిపోకుండా పరిరక్షిస్తుంది.

అంతే కాదు-ఒక్కో కంటిలో ఒక్కో కన్నీటి గ్రంధి వుండి ఆ గ్రంధులలో కన్నీరు తయారవుతుంది. కనురెప్పలు ఆర్పినప్పుడల్లా ఈ గ్రంధుల నుంచి కొద్దిగా కన్నీరు వెలికివచ్చి కనుగుడ్లని కడిగి శుభ్రపరుస్తుంటుంది. *

## పిల్లలకు మలబద్ధకమా?

పెద్దవాళ్ళకు మాదిరే పిల్లలుకూడా మలబద్ధకానికి గురవుతుంటారు. ఈ సమస్య ఉన్నప్పుడు వాళ్ళకు ఇచ్చే ఆహారం విషయంలో శ్రద్ధ చూపుతుండాలి. కాయగూరలు, ఆకుకూరలు, బాగా పండిన అరటి, కమలా, బత్తాయి పండ్లు ఎక్కువగా తినేలా చూడాలి.

చిప్స్ వంటి చిరుతిండ్లువల్ల సమస్య ఇంకొంత పెరుగుతుంది.ప్రతిరోజూ 2, 3 ఎండు ఖర్జూరాలు రాత్రిపూట నీళ్ళలో నానబెట్టి, ఉదయాన్నే గింజలు తీసేసి మెత్తగాచేసి, దాన్ని తాగించాలి.

వీటివల్ల ఐరన్, క్యాల్షియం కూడా పిల్లలకు లభిస్తాయి. ఎండు ఖర్జూరాలు ఎన్ని రోజులు ఇచ్చినా మేలే జరుగుతుంది.అన్నింటికంటే ముఖ్యంగా, పిల్లలకు శారీరక చురుకుదనం అవసరం. వారిని బాగా ఆడుకోనివ్వాలి.



# బెదిరిపోయిన దయ్యం

ఒక కట్టెలు కొట్టేవాడుండేవాడు. వాడి భార్య పిశాచిలాంటిది. మొగుణ్ణి కుక్కకన్నా హీనంగా చూసేది. వాడి సంపాదన అంతంత మాత్రంగా ఉంటే, అదంతా తాను కాజేసేది. వాడికి సరిగా తిండి అయినా పెట్టేది కాదు.

"ఈ కూరలో ఉప్పు జాస్తి అయినట్టుందే?" అని వాడు ఏ పూట అయినా అంటే రెండో పూట అసలు ఉప్పే వేసేది కాదు. ఇంత గయ్యాళితో వేగినంత కాలం వేగి ఆ నిర్భాగ్యుడు ఆత్మహత్య



తప్ప తనకొక మార్గం లేదనుకున్నాడు. కాని ఉరి పోసుకోవటానికి తాడన్నా లేదు.

కొందామంటే డబ్బులు లేవు. అందుచేత వాడు తను సంపాదించేదానిలో నుంచి ఏగానీ, డబ్బా మిగిల్చి, దాన్ని ఒకచోట దాస్తూ వచ్చాడు.

అయితే కొద్దిరోజులకే వాడి పెళ్ళాం దొంగను పట్టుకున్నది.

"ఈ డబ్బులన్నీ నీకెక్కడివి? వీటిని ఎందుకు దాస్తున్నావు? స్నేహితులతో కలిసి తాగుదామనా?" అని అడిగింది పెళ్ళాం.

"అదేమీ లేదే! తాడు కొనుక్కుని ఉరిపోసుకుందామని!" అన్నాడు మొగుడు.

ఈ మాట వింటూనే ఆ గంపగయ్యాళి తన మొగుడి మీద అమ్మశక్తిలాగా పడి, రక్కి, పీకి, చావ చితకగొట్టేసింది.

ఇక లాభం లేదనుకుని కట్టెలు కొట్టేవాడు మర్నాడు తెల్లవారుఝామునే లేచి, అడవిగుండా కొండలకేసి బయలుదేరాడు.

అయితే మొగుడు బయలుదేరటం పెళ్ళాం చూసింది. చూసి, "వీడి ఎత్తు ఏమిటో చూడాలి!" అనుకుని, మొగుడి వెనకగా తానూ బయలుదేరింది. పెళ్ళాం తనను వెంబడించటం గుర్తించి కట్టెల వాడు, "భగవంతుడా, నాకీ పీడనుంచి విముక్తి లేదా?" అనుకున్నాడు. వాడు ఒకచోట ఆగి, గొడ్డలి తీసి, కట్టెలు కొట్టనారంభించాడు ఆ పనిమీదే తాను బయలుదేరి వచ్చినట్టుగా.

వాడిపెళ్ళాం వాడికి కనబడే దూరంలోనే దేని కోసమో వెతుకుతున్నదానిలాగా ఆ పొదలోకీ, ఈ పొదలోకీ చూడసాగింది. ఆమె ఒక పాడు పడిన నూతికేసి నడుస్తూండడం అకస్మాత్తుగా మొగుడి కంటపడింది. ఆ నూతిమీద ఏవేవో తుప్పలూ, దుబ్బులూ పెరిగి ఉండటాన, కొత్త వాళ్ళకు నూయి కనిపించదు.

తన పెళ్ళాం పొరపాటున ఆ నూతిలో పడితే కట్టెలు కొట్టేవాడు పెద్దగా చింతించవలసిన అవసరం ఏమీ లేదు. అయినా వాడు వస్తుతః మంచివాడు కావటంచేత "అక్కడ పాడు నుయ్యి ఉన్నది, జాగ్రత్తే!" అని కేక పెట్టాడు.

'నన్ను భయపెట్టి ఇంటికి పంపేసి, ఆ తరవాత ఏదో చేద్దామనుకుంటున్నాడు! నేనా మోసపొయ్యేదాన్ని?' అనుకుంటూ కట్టెలు కొట్టేవాడి పెళ్ళాం మరి రెండడుగులు వేసి నూతిలో పడిపోయింది.

'నీ కర్మ! అనుభవించు!' అనుకుని కట్టెలు కొట్టేవాడు తన గొడ్డలి తీసుకుని, ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి వాడు సుఖంగా నిద్రపోయాడు. కాని మర్నాడు లేవగానే వాడి మనసు పీకనారంభించింది.

ఎంత దుర్మార్గురాలు అయినా అది తన పెళ్ళాం, దాన్ని ఆ పాడుబావిలో నుంచి పైకి తీయటం తన ధర్మం అనుకుని వాడు అడవికి అడ్డంపడి పాడుబావికేసి వెళ్ళాడు. వాడు బావి దగ్గర మోకరించి, లోపలికి చూస్తే ఏమీ కనిపించ లేదు. అలికిడి కూడా ఏమీలేదు.

వాడు తన తలగుడ్డ తీసి బావిలోకి వదులుతూ, "ఏమే, ఈ బట్ట గట్టిగా పట్టుకో, నిన్ను పైకి లాగుతాను" అన్నాడు.

దానికీ జవాబులేదు, కాని రెండు క్షణాలయ్యాక తలగుడ్డ బరువెక్కింది. తన పెళ్ళాం ఇంత బరువా అని ఆశ్చర్యపోతూ కట్టెలవాడు తన తలగుడ్డను పైకి లాక్కోనారంభించాడు.

కాని తీరా చూస్తే పైకి వచ్చినది కట్టెలవాడి పెళ్ళాం కాదు, ఏదో భూతం! దాన్ని చూసి కట్టెల వాడు మూర్ఛపోయినంత పనిచేశాడు.

భూతం వాణ్ణి చూసి, "భయపడకు! ఇవాళ నువ్వు ఎంత పుణ్యంచేసుకున్నావో నీకు తెలీదు. నన్ను ఘోరమైన విపత్తునుంచి కాపాడావు. నీ రుణం ఎలాగైనా తీర్చుకుంటాను" అన్నది.

"రుణం తీర్చటమా! నేను నీకేం ఉపకారం చేశాను?" అన్నాడుకట్టెలవాడు కంగారుపడిపోతూ.

"ఇంకేం చెయ్యాలి? నేనీ బావిలో ఎన్నో ఏళ్ళుగా సుఖంగా, ప్రశాంతంగా జీవిస్తున్నాను. నిన్న ఒక భయంకరమైన ఆడది నాకు దాపురించింది.

ఆ క్షణం నుంచీ నాకు శాంతి లేదు. దేవుడల్లే నువ్వు వచ్చి నన్ను కాపాడావు. నీకు మంచి ఉపకారం చేస్తాను. నిజం! చూడూ, ఈ దేశపు రాజుగారికి అప్సరసలాటి కూతురున్నది.

ఆమెకు నేను పూనుతాను. రాజుగారు అడ్డమైన వైద్యులనూ, జ్యోతిష్కులనూ పిలిపిస్తాడు.

వాళ్ళు భేషజాలైతే చేస్తారుగాని అందువల్ల ఫలితం ఉండదు. రాజుగారికి మతిపోయి ఉన్న సమయంలో నువ్వు వచ్చి ఆమెకు పట్టిన దయ్యాన్ని వదలగొట్టు. అప్పుడు రాజుగారు నీకు గొప్ప బహుమానాలిస్తాడు" అన్నది భూతం.

"దయ్యాన్ని ఎలా వదలగొట్టను?" అని కట్టెల వాడు అడిగాడు.

"నువు రాగానే నేను పోతాను. నువ్వేదో మంత్రాలు





చదివినట్టు నోరు ఆడించు" అన్నది భూతం.

కట్టెలు కొట్టేవాడు తన ఇంటికి బయలుదేరాడు. భూతం రాజుగారి ఇంటికేసి వెళ్ళిపోయింది. కట్టెల వాడి భార్య గురించి ఎవరికీ పట్టలేదు.

క్షణాలమీద భూతం రాజభవనానికి చేరుకుని రాజకుమార్తెను ఆవహించింది. రాజకుమార్తె తన తలను రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకుని, పెద్దగా అరిచి, విరుచుకుపడిపోయింది. దాసీలు ఆమెను శయ్యమీదికి చేర్చారు.

ఈ సంగతి రాజుకు తెలియగానే ఆయన ఆస్థాన వైద్యులను పిలిపించి, వారిచేత చికిత్స చేయించాడు. వారిచ్చిన ఔషధాలేవీ పనిచెయ్యలేదు. రాజు వైద్యులను వెళ్ళగొట్టి మాంత్రికులను పిలిపించాడు.

మాంత్రికులు కూడా రాజకుమార్తెకు స్వస్థత కలిగించలేకపోయారు.

రాజు దైవజ్ఞులను కూడా పిలిపించాడు. వాళ్ళు పంచాంగాలు తిరగవేసి,రాశులూ,అంశలూ గుణించి, పూజలూ శాంతులూ జరిపించారు. కాని రాజకుమార్తెకు అందువల్ల ఏమీ మేలు జరగలేదు.

ఏ విధంగానూ తన కుమార్తె స్థితి బాగుకాకపోయే సరికి, రాజు, తన కుమార్తెకు సరి అయిన చికిత్స చేసినవాడికి ఆమెనిచ్చి పెళ్ళిచేసి, తన అనంతరం రాజును చేస్తానని చాటింపు వేయించాడు.

ఈ లోపల కట్టెలు కొట్టేవాడు తన ఇంట హాయిగా ఉంటున్నాడు. వాడి దారిద్ర్యం ఎప్పుడూ ఉన్నదే, కాని భార్య నుంచి విముక్తి పొందిన ఆనందంలో వాడు మునిగితేలసాగాడు. భూతం గురించీ, అది రాజకుమార్తెను పట్టటం గురించీ, దాన్ని తాను వదిలించి రాజుగారి నుంచి బహుమానం పొందటం గురించీ వాడు పూర్తిగా మరిచిపోయాడు.

ఇంతలో వాడికి రాజుగారి చాటింపు వినవచ్చింది. అది వింటూనే వాడికి భూతం చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి. వెంటనే వాడు చాటింపు వేసేవాడి వద్దకు పరిగెత్తుకుంటూ వెళ్ళి-

"రాజకుమార్తెకు నేను చికిత్స చేయగలను. ఆమెకు ప్రాణాపాయం కలగకముందే నన్ను రాజభవనానికి తీసుకుపొండి!" అన్నాడు.

కట్టెలవాణ్ణి రాజభవనం చేర్చారు. ఈ పేదవాడు తన కుమార్తెకు చికిత్స చెయ్యటం అసంభవం అని రాజుకు అనిపించినా, ఆయనమనసులో కొంచెం ఆశ మొలకెత్తింది. 'ఏ పుట్టలో ఏ పాముంటుందో!' అనుకున్నాడాయన.

కట్టెలవాడు రాజకుమార్తె ఉన్న గదిలోకి వెళ్ళాడు. నీరు తెప్పించి చేతులు కడుక్కుని, మంత్రాలు చదువుతున్నట్టు పెదవులు కదిలిస్తూ వాడు రాజకుమార్తె నుదుటినీ, చెంపలనూ నిమిరాడు.

మరుక్షణమే రాజకుమార్తె లేచికూర్చుని చుట్టూ ఉన్నవారిని చూసి చిరునవ్వునవ్వింది. ఆమె శరీరంలో ఎలాటి వ్యాధీ ఉన్నట్టు కనబడలేదు. ఇది చూసి రాజభవనంలో ఉన్న వారందరూ అమితంగా సంతోషించారు. రాజుగారు అన్నమాట నిలబెట్టుకున్నాడు.

ఆయన కట్టెలు కొట్టేవాడికి మంచి బట్టలూ, ఆభరణాలూ పెట్టి అలంకరించి, అతని గౌరవార్థమై గొప్ప విందుచేసి, తరువాత అతనికి తన కుమార్తెని ఇచ్చి వైభవంగా పెళ్ళిచేశాడు.

తన మొదటిభార్యతో కాపురంచేసిన కట్టెలవాడికి రాజకుమార్తెతో కాపురం చెయ్యటం స్వర్గంలో ఉన్నట్టుగా ఉన్నది.

రాజకుమార్తెను వదిలిపెట్టిపోయిన భూతం పొరుగుదేశపు రాజు కూతుర్ని పట్టింది. దానికి రాణివాసాలు చాలా సుఖంగా ఉన్నాయి.

పొరుగురాజు కూడా తన కుమార్తెకు రకరకాల చికిత్సలు చేయించి విఫలుడయ్యాడు.

ఇంతలో ఆయనకు వార్త తెలిసింది, తన పొరుగున ఉన్న రాజు కూతురికి కూడా ఇలాగే జబ్బుచేస్తే ఎవరో వచ్చి రక్షించాడట; ఆ రాజు తన కుమార్తెను అతనికే ఇచ్చి పెళ్ళి చేశాడట.

వెంటనే ఆయన కట్టెలవాడి మామగారి దగ్గరకు ఒక దూతను పంపాడు.

"దయచేసి మీ అల్లుణ్ణి పంపండి, అతను నా కుమార్తెకు చికిత్స చేసినట్టయితే, నా కుమార్తెను కూడా అతనికి రెండవభార్యగా ఇచ్చి పెళ్ళిచేస్తాను" అని రాజుగారి మాటగా దూత తెలిపాడు.

మామగారి అనుమతితో కట్టెలవాడు పొరుగు రాజకుమార్తె వద్దకు వచ్చి, పూర్వంలాగే చేతులు కడుక్కుని, రాజకుమార్తె నుదురూ, చెంపలూ నిమిరాడు, మంత్రం చదువుతున్నట్టు పెదవులు కదపసాగాడు. కాని భూతం వదిలిపోక కట్టెలవాడితో రహస్యంగా, "నువ్వు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం అదివరకే చేశాను. నేనీ పిల్లను వదిలిపోను. పిచ్చివేషాలు వేశావంటే నీ పెళ్ళాన్ని మళ్ళీపట్టి నీ రోగం కుదుర్చుతాను!" అని బెదిరించింది.

కట్టెలవాడు భూతంతో, "నాకీ పిల్లతో పనిలేదు.



కావలిస్తే నా భార్యను కూడా తీసుకో. నేను వచ్చినది నా మొదటిభార్య నుంచి తప్పించుకోవటానికి. ఆ రాక్షసి ఎలాగో బావినుంచితప్పించుకుని నన్ను వెతుక్కుంటూ రాజభవనానికి వచ్చింది. ఇక్కడికి కూడా నా వెంటపడి వస్తున్నది!" అన్నాడు.

భూతం కట్టెలవాడి మాటలు పూర్తికాకుండానే రాజకుమార్తెను వదిలి పారిపోయింది. అది ఎటు పోయినదీ, దాని సంగతి ఏమైనదీ విన్నవారు లేరు. కట్టెలవాడు మాత్రం రెండో రాజకుమార్తెను కూడా పెళ్ళాడి,ఇద్దరు భార్యలతోనూ సుఖంగా ఉన్నాడు.

**పి.సత్యనారాయణ**



# ఆగ్రహం - కవితావేశం




పుట్టగంటి గోపీకృష్ణ

రవి, గవర్రాజు చిన్నప్పటి నుండి స్నేహితులు. ఇప్పుడు ఉద్యోగం కూడా ఒకే బ్యాంకులో ఒకే బ్రాంచిలో రావటం వాళ్ళ అదృష్టం.

"అది నా దురదృష్టం..." అంటాడు ఆ బ్రాంచి మేనేజర్. ప్రస్తుతం ఉదయం పదిగంటలవుతోంది.

బ్యాంకు ఎప్పటిలానే రద్దీగా ఉంది. జనాలు నిలబడ్డ క్యూలయితే బ్యాంకు బయటకు విస్తరించి నలువైపులా పాకిపోతున్నాయి.

స్నేహితులిద్దరూ యథాప్రకారం అరగంట లేటుగా బ్యాంకుకు వచ్చేటప్పటికి కనపడ్డ సీను అది.

"ఏంట్రా! రాత్రి మళ్ళీ నోట్ల రద్దేమయినా జరిగిందంటావా?" గుసగుసగా రవినడిగాడు గవర్రాజు.

"ఖచ్చితంగా కాదు"

"అంత ఖచ్చితంగా ఎలా చెప్తావు?"

"ఇంతకుముందు నోట్ల రద్దు జరిగినపుడు చూడలా? క్యూలో నిలబడే జనాలు ఎలా ఉండేవారు? తన్మయత్వంతో విషాదగీతాలు పాడుకుంటూ ఉండేవాళ్ళు. తాము పడుతున్న బాధకంటే ఎదుటివాడు ఇంకా ఎక్కువ బాధపడుతున్నాడన్న ఆనందం వాళ్ళ కళ్ళలో కనిపించేది.

క్యూలో నిలబడ్డప్పుడు కాలక్షేపంకోసం ఎప్పుడో మరచిపోయిన లలితకళలు వెలికితీశారు. దానితో దేశంలో కళలు ఉచ్ఛస్థితికి చేరాయి. కానీ ప్రస్తుతం వీళ్ళని చూడు. తమ చేత్తో తమ కన్ను పొడుచుకున్నట్లు, తాము తీసుకున్న గోతిలో తామే పడినట్లు ఎలా దీనంగా చూస్తున్నారో.

ఇంతటి దారుణ పరిస్థితికి కారణం మళ్ళీ నోట్ల రద్దు అయివుండదు. వేరే కారణం ఏదో ఉండివుంటుంది" వివరించాడు రవి.

"అయితే ఇంతటి దారుణ పరిస్థితికి కారణం ఏమయివుంటుందంటావ్?" అంటున్న గవర్రాజు మాటలు పూర్తికాకముందే మేనేజర్ క్యాబిన్ దగ్గరకు వచ్చారు. అసలే హడావుడిగా ఉన్న ఆయన్ని, 'గుడ్ మాణింగ్ సార్..." అంటూ గాభరాపెట్టారు.

ఆయన అప్పటికే బ్యాంకులో పెరిగిపోతున్న జనాన్ని కంట్రోల్ చేయటానికి హడావుడిపడుతూ, చుట్టూ చేరినవారికి సమాధానాలు ఇవ్వటమనే అష్టావధానం చేస్తూ చెమటలు కక్కుతున్నాడు. వీళ్ళని చూడగానే ఆనందంతో "ఆ!... వచ్చారటోయ్. వెరీ గుడ్. మీకోసమే చూస్తున్నాను.మీరే చేయగల్గిన పని ఒకటుంది" అన్నాడు వీళ్ళని పక్కకి తీసుకువెళ్తూ.

"ఏంటి సార్ మేమే చేయగల 'ఆ...' పని?" అడిగాడు గవర్రాజు.

"మీరే తింగరాళ్ళనుకుంటే, మిమ్మల్ని మించిన ఒక తింగరాడు ఉదయం నుండి నన్ను నంజుకు తింటున్నాడురా. వాడిని డీల్ చేయటంలో మీరే సూటబుల్... అందుకే వాడిని బయట నిలబెట్టి మీకోసం చూస్తున్నాను" బయట నిలబడివున్న ఒక కస్టమర్‌వైపు చూస్తూ అన్నాడు మేనేజర్.

అటువైపు చూసిన రవి, గవర్రాజులకు ప్యాంటూ, షర్టూ వేసుకున్న గౌతమబుద్ధుడిలా ఉన్న ఒక పెద్దాయన కనిపించాడు. ఆ పెద్దాయన అప్పుడే 'మే ఐ హెల్ప్ యు' కౌంటర్‌వైపు నడుస్తున్నాడు.

"ఏంటి సార్! అతను అంత కామ్‌గా ఉన్నాడుగా" అన్నాడు రవి. "అది తుపానుముందు ప్రశాంతతరా నాయనా! మీరు ఏం చేస్తారో తెలియదు. ఆ ఒక్కడిని బ్యాంకు నుండి బయటకు పంపండి చాలు..."

"ఇంతకీ జనాల ఈ వీరవిజృంభణ ఎందుకు సార్?" అడిగాడు గవర్రాజు. "అదేంటి మీకు తెలీదా? ఇవాళ్టినుండి ఆధార్ ఎన్‌రోల్‌మెంట్ కూడా మన బ్రాంచిలోనే చేయాలి. వీళ్ళంతా ఆ జనమే..."

"మరి మనం మన బ్యాంకు పని ఎప్పుడు చేసుకోవాలి?" అడిగాడు గవర్రాజు.

"సాయంత్రందాకా వీళ్ళ పని చూసి ఆ తరువాత మన పని మనం చూసుకోమని మనకున్న ఆర్డర్... అది అలా ఉంచు... ముందు మీరేం చెయ్యాలంటే" అంటూ అటూ ఇటూ చూసి, అక్కడ ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని... "ఉరేయ్ మీ కాళ్ళు పట్టుకుంటాను, ఆ పరాంకుశం సంగతి చూడండిరా..." అన్నాడు బ్రతిమలాడుతూ.

"మళ్ళీ ఆ పరాంకుశం ఎవరు?"

"వాడి పేరు అదేలేరా..." దూరంగా ఉన్న కస్టమర్‌ని భయంగా చూస్తూ అన్నాడు మేనేజర్.

"ఇక ఆ సంగతి మాకు వదిలేయండి సార్..." అంటూ అభయం ఇచ్చారు రవి, గవర్రాజులు. అప్పటికే బయట మరో స్టాఫ్ బాబ్జీతో తీవ్రంగా వాదిస్తూ కనిపించాడు పరాంకుశం. ఇంతలో హఠాత్తుగా ఆ గౌతమబుద్ధుడిలో నుండి ఉగ్రనరసింహుడు బైట కొచ్చాడు. వీళ్ళు చూస్తుండగానే బాబ్జీ కాలర్ పట్టుకుని బండబూతులు తిడుతున్నాడు పరాంకుశం.

రవి వెళ్ళి పరాంకుశం కబంధ హస్తాలనుండి బాబ్జీని విడిపించాడు. బాబ్జీ బ్యాంకు ఉద్యోగికాకుండా మరొకరైవున్నట్లయితే అప్పటిదాకా తనకు జరిగిన అవమానానికి తల తీసుకువెళ్ళి రైలుకింద పెట్టేవాడు. కానీ బాబ్జీమాత్రం అక్కడ అసలేం జరగనట్లు టై సర్దుకుని, జుట్టు ఎగదోసుకుని, తరువాత కస్టమర్‌ని ఎదుర్కోవటానికి సన్నద్ధమయ్యాడు.

ఒకపక్క అతని ధైర్యాన్ని మనసులో మెచ్చుకుంటూ, రవి తన ఎదురుగా ఉన్న కస్టమర్‌చేత ఒక



## భలే క్రేజ్

**హు**షారుకు మారు పేరులా తెరపై కనపడిన రష్మికమండాన్నా నిజజీవితంలోనూ అంతే ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉంటుందట.

టీనేజీలో ఉన్నప్పటినుంచే ఆమెకు సినిమాలంటే మహా క్రేజ్. కన్నడలో 'కిర్రిక్ పార్టీ' సినిమా తర్వాత రష్మికకు కెరీర్ పరుగు మొదలైంది.

'ఛలో'తో తెలుగులో ఫామ్‌లోకి వచ్చేసింది. 'గీత గోవిందం' హంగామాలో ఉంది.

'కిర్రిక్ పార్టీ' సహనటుడితో ఎంగేజ్ అయి పెళ్ళికి రెడీ అయింది. 'డియర్ కామ్రేడ్', 'దేవదాస్' సినిమాలూ చేస్తున్న ఈ గీతా మేడమ్‌కు అభిమానుల ఫాలోయింగ్ అనంతం.

గ్లాసు మంచినీళ్ళు తాగించి, "అసలు మీ సమస్య ఏంటో ఇప్పుడు చెప్పండి" అన్నాడు అనునయంగా.

అంతే... ఒక్కసారిగా భోరున ఏడుస్తూ బరస్ట్ అయ్యాడు పరాంకుశం.

"నేను తప్పు మాట్లాడాను.ఎందుకలా ఏడుస్తున్నారు?" అయోమయంగా అడిగాడు రవి.

"నువ్వేం తప్పు మాట్లాడలేదు నాయనా. మూడు రోజుల్నుండీ ఎవడిని పలుకరించినా ఇదే మాటడుగుతున్నారు. మళ్ళీ ఇప్పుడు నాకథ మొదలెట్టాలనేటప్పటికి నామీద నాకే అసహ్యం వేసి ఏడుస్తున్నాను"

"ఇదే ఆఖరుసారి అనుకుని చెప్పండి... మా రవి తీర్చలేని సమస్య ఉండదు..." పక్కనుండి అందుకున్నాడు గవర్రాజు.

"రెండేళ్ళక్రితం ఒక దుర్ముహూర్తాన ఇంటికి దగ్గరగా ఉందన్న ఒకే ఒక్క కారణంతో ఈ బ్రాంచిలో ఎకౌంట్ ఓపెన్ చేశాను. రాబోయే దుర్దినాల గురించిన అవగాహన లేక, మీ మేనేజర్ చెప్పిన మాటలు నమ్మకూడదన్న నాలెడ్జ్ లేనివాడనై, నా పెన్షన్ ఎకౌంట్‌సహా అన్నీ ఇక్కడికే ట్రాన్స్‌ఫర్ చేశాను.

మీరు కట్టమన్న డబ్బులన్నీ కట్టి, ఒక ప్లాస్టిక్ కార్డ్ ముక్క సంపాదించి, ప్రపంచాన్నే జయించినంత ఆనందించాను. ఇక నా డబ్బు నా చేతుల్లో ఉన్నట్లేనని మనస్ఫూర్తిగా విశ్వసించాను.

అయితే హఠాత్తుగా గురుడు ఉచ్ఛస్థితిలోకి వచ్చి, శని ఐదో ఇంట అడుగుపెట్టటంతో ఆ కార్డు వాడాలన్న కోరిక కలిగింది. మూడురోజుల క్రితం ఆర్టీసీ క్రాస్ రోడ్డులో ఉన్న ఏ.టి.ఎమ్.లో నా డబ్బులు డ్రా చెయ్యటానికి ప్రయత్నించాను" మధ్యమధ్య ముక్కు చీదుతూ చెప్పటం మొదలుపెట్టాడు పరాంకుశం.

"అక్కడ మా ఏ.టి.ఎమ్. ఏదీ ఉన్న గుర్తులేదే?" అనుమానంగా అడిగాడు గవర్రాజు.

"అది మీ ఏ.టి.ఎమ్. కాదు. ఇంకో బ్యాంకు ఏ.టి.ఎమ్..." అన్నాడు పరాంకుశం.

"ఏ.టి.ఎమ్. ఎవరిదైతే ఏంలే. ఉండేది ఇండియన్ కరెన్సీనేగా. మీరు చెప్పండి ఏం జరిగిందో..." అంటూ ప్రోత్సహించాడు రవి.

"ఆ ఏ.టి.ఎమ్.లో నా కార్డు పెట్టాను. పిన్ నొక్కాను. ట్రేలో నుండి పడే డబ్బులకోసం దోసిలి పట్టాను. డబ్బులైతే రాలేదుకానీ, రకరకాల శబ్దాలు వచ్చాయి. ఇనుపరేకులు ఒకదానికొకటి రాసుకుంటున్నట్లు, లోపల కాపురం ఉంటున్న బుడతకీచులు రెండు బృందాలుగా విడిపోయి ఒకరిమీద ఇంకొకరు వార్ డిక్లేర్ చేసుకున్నట్లు..."

"మీరు కథలు రాస్తారా?" అనుమానంగా అడిగాడు రవి.

"అవును. నీకెలా తెలుసు" ఆనందంగా అన్నాడు ఆ కస్టమర్.

"మీకు వర్ణనమీద ఉన్న ఆసక్తి సమస్య సాల్వ్ అవటంమీద ఉన్నట్లు లేకపోతేనూ..."

"అలా ఫీల్ అయ్యావా... అయితే సూటిగా చెప్తాను విను. ఆ ఏ.టి.ఎమ్. నుండి శబ్దాలుతప్ప ఏం రాలేదు. కాసేపటికి ఒక చిత్తుకాగితంమాత్రం తుపుక్కున దాంట్లో నుండి ఊడిపడింది..."

"దాంట్లో ఏముంది?"

"నాకు పదివేలు ముట్టాయని దానికదే ఇచ్చుకున్న సర్టిఫికెట్ అది..."

"ఐ.సీ..."

మరోసారి మరోసారి ప్రయత్నిస్తే, చెప్పుకోలేని విధంగా ... ... అని బండబూతులు వెలువరించింది. ఎంత ప్రయత్నించినా దానినుండి బూతులుతప్ప రూకలు రాబట్టలేకపోయాను. అక్కడే ఉన్న సెక్యూరిటీ గార్డుని తరుణోపాయం అడిగాను.

వాడు ఎగతాళిగా నావైపు చూస్తూ గోడమీద ఉన్న ఒక ఫోన్ నెంబర్ చూపించాడు.



## క్యూట్ & హాట్

**హి**మాచల్‌ప్రదేశ్ నుంచి వచ్చిన హీరోయిన్ రుహానీశర్మ 'చి॥ల॥సౌ॥' సినిమాలో బోల్డన్ని మార్కులు కొట్టేసింది. అచ్చతెలుగు అమ్మాయిలా, పక్కింటి పిల్లమాదిరి అలరించి క్యూట్ గాళ్ అనిపించుకున్నది. మధ్యతరగతి అమ్మాయి పాత్రకు చక్కగా సూటయింది.

మరి అదే కొనసాగిస్తే ఆ ట్యాగ్ అలాగే ఉండిపోతే కష్టం అనుకుందో, ఏమోకాని హాటెస్ట్ అందాలతో లేటెస్ట్‌గా ఓ ఫోటో రిలీజ్ చేసింది. ఆమె అందాలు చూసినవారంతా క్యూటే కాదు, హాట్ కూడా అంటున్నారు.

అది బ్రాంచి మేనేజర్‌ది అని తెలుసుకుని దానికి ఫోన్ చేశాను. ఇప్పుడు క్యాబిన్‌లో కూర్చుని వశిష్ఠుడిలా ఫోజు పెడుతున్నాడే వాడే అప్పుడు విశ్వామిత్రుడిలా సెగలు కక్కాడు.

ఫోను చెయ్యటానికి సమయం సందర్భం లేదా అని మరో రెండు బూతులు తిట్టినతర్వాత అతను నా సమస్య ఏంటో అడిగాడు. చెప్పబోయాను.

ఏ.టి.ఎమ్. అన్నమాట విని మిగిలిన విషయం పూర్తిగా వినకుండానే నా మాటలకి అడ్డుకట్ట వేసే ఒక టోల్‌ఫ్రీ నెంబర్ చెప్పి దానికి ఫోన్ చేయమని. శాపవిమోచనం ఇచ్చినంత ఫీల్‌తో ఫోన్‌పెట్టేశాడు.

అప్పుడర్థమైంది ఆ గార్డు ఎందుకంత ఎగతాళిగా నవ్వాడో. అతని చేతిలో ఉన్న ఏ.టి.ఎమ్ స్లిప్పు తీసుకుని బాబ్జీదగ్గరకు వెళ్ళి విషయం కనుక్కొచ్చాడు

# చిలిపి



**ఆడవాళ్ళను పోస్ట్‌మెన్లుగా ఎందుకు నియమించడంలేదు?**
వారు డెలివరీ చేయడానికి తొమ్మిదినెలలు కావాలి కాబట్టి.

**మగవారు తాము మగవాళ్ళుగా పుట్టినందుకు బాధపడేదెప్పుడు?**
ప్రతిరోజూ ప్రొద్దున్నే గడ్డం చేసుకోవాల్సివచ్చినప్పుడు!

**ఆఫీసులో అటెండర్లు ఎందుకు?**
అధికారుల ఇంట్లో పనులు చేసేందుకు.

**తెల్లగా ఉన్న ప్రతి గోడపైన ధైర్యంగా రాయగలిగినదెవరు?**
మలేరియా ఆఫీసరు.

**కరపత్రాలు ఎందుకు?**
కిళ్ళీలు చుట్టుకోవడానికి.

**భర్త, భార్యమీద కోపాన్ని ప్రదర్శించేదెప్పుడు?**
ఆమె ఎదురుగా లేనప్పుడు.

**అందరూ చించే పుస్తకం?**
చెక్కు పుస్తకం.

**లంచం ఇచ్చేవాడిది తప్పా? తీసుకునేవాడిది తప్పా?**
ఎలా ఇవ్వాలో చేతకానివాడిది తప్పు.

**ఉత్త అమాయకుడెవడు?**
విమానంలో ఎయిర్‌హోస్టెస్‌ని తినడానికి తేగలు అడిగేవాడు.

రవి. తరువాత తనకు తెలిసిన విషయాలు చెప్పటం మొదలుపెట్టాడు.

“చూడండి. మీ డబ్బులు ఇరుక్కుపోయింది మా ఏ.టి.ఎమ్.లో కాదు. మీ సమస్యని మా బ్యాంకువాళ్ళు డబ్బులు ఇరుక్కుపోయిన బ్యాంకుకు పంపారు.సరిహద్దు వివాదం తేల్చటానికి సమావేశమైన ఇండియా. చైనా సైనికాధికారుల్లా... ఇరు బ్యాంకుల అధికారులు ఒక మంచిరోజు చూసుకుని సమావేశమవుతారు.

ఆ చర్చల్లో మీ సమస్య సామరస్య పూర్వకంగా ఒక కొలిక్కి వస్తుందని ఆశిస్తూ అప్పటివరకు మీరు మాతో సహకరించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను” అన్నాడు రవి.

ఆ మాట వినగానే పరాంకుశం మొహంలో భావాలు అత్యంత వేగంగా మళ్ళీ మారిపోసాగాయి.

“ఉరేయ్ జాగ్రత్త...” అని అన్నాడు గవర్రాజు. తనుమాత్రం తగు దూరం వెనక్కిజరుగుతూ. ఇక ఏ నిమిషమైనా రవి కాలర్ కూడా పరాంకుశం చేతుల్లో ఇరుక్కుపోక తప్పదని గట్టిగా డిసైడయిపోయాడు అతను.

పిచ్చికుక్కకి మనిషి పిక్కలు చూస్తే ఆవేశం వచ్చినట్లు రవిమీదకు దూకబోతున్నాడా పరాంకుశం. ఏ నిమిషంలోనైనా దాడి జరగబోతుందనగా...రవికి ఓ అద్భుతమైన ఆలోచన వచ్చింది.

“మీ సమస్యకంటే మీ సమస్య వివరించిన విధానం అద్భుతం సార్. మీరు వాడిన వర్ణనలు మీ సమస్యకే హైలైటు. ఇక మీరు పోషించిన సస్పెన్సు అనన్య సామాన్యం. మీరే చూశారుగా మా గవర్రాజుగాడైతే సస్పెన్స్ తట్టుకోలేకపోయాడు. మొత్తానికి గొప్ప రచయిత అనిపించుకున్నారు...” అన్న రవి మాటలు విని నాగస్వరం విన్న నాగుపాములా మెత్తబడిపోయాడతను.



“సరే! ఒక పని చెయ్యండి” అన్నాడు పరాంకుశాన్ని బలవంతంగా లోను సెక్షన్‌లోకి తీసుకువెళ్తూ. “మీ డబ్బు ఇప్పటికిప్పుడు వెనక్కి ఇప్పించాలంటే కష్టం కానీ, మీకు ఎంత డబ్బుకావాలో చెప్పండి. లోన్ ఎరేంజ్ చేయిస్తాను”

“అప్పు నాకెందుకయ్యా?” రవి ప్రయత్నాన్ని రెసిస్ట్ చేయబోతూ అన్నాడు పరాంకుశం.

మీ సమస్య సాల్వ్ అవటానికి కొన్ని రోజులు పడుతుంది. ఈలోపు మీ అవసరాలకోసం లోను ఇప్పిస్తాను. వడ్డీకూడా ఎక్కువేమీ ఉండదు”

“వడ్డీకూడానా? నేనెందుకు కట్టాలి...?” మళ్ళీ ఇహంలోకి వస్తూ అన్నాడు పరాంకుశం.

“ఏదో ఒక మంచి కవిత చదవండి...” అన్నాడు రవి.

“అబ్బే! వడ్డీ అంటే ఎంత సార్. మీ ఒక కథకి వచ్చినంత పారితోషికం...” అన్నాడు గవర్రాజు.

పరాంకుశం అసలు గవర్రాజు మాటలు వినిపించుకోలేదు. కవితాపఠనంలో పడ్డాడు.

తనుకూడా ఆ కవిత వింటున్నట్లు తల ఆడిస్తూ, “వడ్డీగురించి ఆలోచించకండి. ఇదుగో ఇక్కడ కూర్చోండి. మీ పని ఇప్పుడే చేసేస్తారు” అని అక్కడ ఉన్న ఆఫీసర్‌వైపు తిరిగి,

“ఈ సారుకి అర్జంటుగా ఒక పదివేలు అప్పు కావాలంట చూడండి...” అన్నాడు రవి.

“సెక్యూరిటీ ఏమిస్తాడు?” అని అడిగాడు ఆ లోను ఆఫీసర్.

కవిత పూర్తవటంతో మళ్ళీ ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు పరాంకుశం. సరిగ్గా అప్పుడే సెక్యూరిటీ అన్న మాట వినిపించింది.

“నా డబ్బు నేను తీసుకోవటానికి సెక్యూరిటీ ఏమిటి? వడ్డీ కట్టటమేమిటి? నో...” అంటున్న పరాంకుశం గోడు వినిపించుకోకుండా అతన్ని ఎగాదిగా చూశాడు రవి.

అతని మెడలోని గొలుసు ఆఫీసర్ చేతుల్లో పెడుతూ “ఇది సరిపోతుందా?” అన్నాడు.

“ఆహా...! కావాలంటే ఇంకో పదివేలు కూడా ఇస్తాము...” దాని బరువుని చేత్తోనే ఎసెస్ చేస్తూ అన్నాడా ఆఫీసర్.

“నా గొలుసు, నా గొలుసు...” అంటున్నాడు పరాంకుశం.

“ఊరుకోండి సార్! గొలుసు ఎక్కడ ఉంటే ఏమిటి? మీరు మరో కవిత అందుకోండి...” అంటూ అతన్ని మాయచేశాడు రవి.

కవితావేశంలో ఉన్న పరాంకుశం జేబులో పదివేలు పెట్టి, అతన్ని బ్యాంకు బయటకు నడిపించి, “మీరు అడిగినట్లు మీకు డబ్బులుకూడా ఇచ్చాను. ఇక వెళ్ళి వస్తాను...” అంటూ గవర్రాజుసహా వేగంగా అక్కడ నుండి మాయమైపోయారు రవి, గవర్రాజులు.

కాసేపటి క్రితం ఆవేశంతో బ్యాంకులోకి అడుగుపెట్టిన పరాంకుశం ఇప్పుడు అయోమయంతో, చేతిలో పదివేలతో బయటకి నడిచాడు. తేడా అల్లా అతని మెడలో గొలుసు ఇప్పుడు బ్యాంకు తాకట్టులో ఉంది. అంతే...

**పొగ తాగేవారు తన జీవితాన్ని 40 శాతంమాత్రమే ఆనందించగలుగుతారని తెలిసినతర్వాత ఆ అలవాటును వదిలేశాను. -మిలింద్ సోమన్, మోడల్**

# ఫర్ U

Share both the work and the wealth

## మెదడుకు పదును

పచ్చగా, బంగారంలా మెరిసిపోయే పసుపు శరీరానికి మెరుపును ఇవ్వడమేకాదు,మెదడుకు పదునూ ఇస్తుంది. పసుపులో యాంటీ ఇన్ఫ్లమేటరీ, యాంటీ బ్యాక్టీరియల్ గుణాలున్నట్లు అనేక అధ్యయనాల్లో గుర్తించారు.

ఆహారంలో పసుపును తరచూ వాడుతున్నట్లైతే జ్ఞాపకశక్తి ముప్పైశాతందాకా మెరుగుపడుతుందని తాజా పరిశోధనల్లో గుర్తించారు.

పసుపు వినియోగంవల్ల అల్జీమర్స్‌వంటి జ్ఞాపకశక్తి క్షీణత జబ్బుల బారినపడే అవకాశాలు బాగా తగ్గుతాయి.

ఏడాదిన్నరపాటు రోజుకు కొద్దిగా పసుపును ఒకటి, రెండు సార్లు ఆహారంలో భాగంగా క్రమం తప్పకుండా తీసుకుంటుంటే ఫలితాలు బాగా కనపడతాయి. ◆

## తియ్యతియ్యగా

ఎక్కువ క్యాలరీలతో ఉండే సపోటాపండులో అనేక ఆరోగ్య ప్రయోజనాలుంటాయి.

శరీరానికి చాలినంత శక్తిని అందించడంలో తిరుగులేనివి. యాంటీ ఆక్సిడెంట్లు, విటమిన్ 'సి' పుష్కలంగా వుండి రోగనిరోధక శక్తిని బాగా పెంచుతాయి.

ప్రొటీన్లు, ఐరన్ కూడా అధికంగా వుంటాయి. క్రీడాకారులకు, వ్యాయామాలు చేసేవారికి సపోటా కావాల్సినంత శక్తినిస్తుంది. ◆



Courtesy : VANITHA

## నడుంనొప్పా?

నలభై సంవత్సరాల వయస్సు దాటిన చాలామంది మహిళలు నడుంనొప్పితో బాధపడుతుంటారు. నడుంనొప్పి నివారణలో అల్లం బాగా సాయపడుతుందంటేచాలామంది నమ్మకపోవచ్చు కాని, ఇది నిజం.

అల్లం అనేక రుగ్మతల నివారణలో ఉపకరిస్తుందని ఆయుర్వేదం పేర్కొంటున్నది.ఇదో యాంటీ ఇన్ఫ్లమేటరీ ఏజెంట్‌గా పనిచేస్తుంది.

పాలిఫెనాల్స్, ఫ్లేవనాయిడ్లు యాంటీ ఆక్సిడెంట్స్, విటమిన్ 'సి' అల్లంలో పుష్కలంగా వుంటాయి.

ప్రతిరోజూ 2-3 గ్రాముల అల్లం తీసుకుంటే నడుంనొప్పి సమస్య నుంచి ఉపశమనం పొందవచ్చని పరిశోధనల్లో గుర్తించారు.

అల్లాన్ని సన్నగా ముక్కలు చేసుకుని పాలు, టీ, వేడినీళ్ళలో వేసుకుని మరిగించి రోజూ తాగుతూ ఉండాలి. మంచి ఫలితాలు ఉంటాయి. ◆

## 150 నిమిషాలు

ప్రతిరోజూ వ్యాయామం చేయాలన్న సంగతి పదేపదే వినేదే. అలా ఎంతసేపు చేయాలి? ఎన్ని గంటలు చేయాలి? ఈ విషయమై అమెరికన్ శాస్త్రవేత్తలు విస్తృతమైన పరిశోధనలు నిర్వహించారు.

18-64 సంవత్సరాల నడుమగల వారు వారానికి కనీసం నూట యాభై నిమిషాలపాటు ఓ మాదిరి తీవ్రత వుండే గుండె సంబంధిత వ్యాయామాలు చేస్తే మంచి ఫలితాలుంటాయని గుర్తించారు. అంటే రోజుకు ఇరవై ఐదునిమిషాలు చేసినా సరిపోతుందన్నమాట.

వేగంగా నడవడం, సైక్లింగ్, మరొకరితో కలిసి టెన్నిస్ ఆడడం ఓ మోస్తరు వ్యాయామాల జాబితాలో వుంటే, జాగింగ్, రన్నింగ్, స్విమ్మింగ్, బాస్కెట్‌బాల్ ఆడడంవంటివి శ్రమతో కూడిన వ్యాయామాల జాబితాలోకి వస్తాయి. ◆

## పలకరింపు ప్రభావం

ఎవరైనా కనిపించగానే బావున్నారా? అనో, హాయ్!, హలో! అనో పలుకరిస్తుంటాం. ఇవి చిన్నచిన్న మాటలే ఐనప్పటికీ ఈ పలుకులకు గొప్ప ప్రయోజనం వుంటుంది.

ఎదుటివారికి ఆనందం ఇవ్వడమే కాదు, బంధాలు బలపడడానికి ఉపయోగపడతాయి.

తెలిసినవారు ఎదురుపడినా కొందరు చూసీచూడనట్లు వెళ్ళిపోతుంటారు. కొందరు పొడిపొడిగా తప్పదన్నట్లు పలకరిస్తారు.

ఇదంతా తప్పుధోరణి అని, తెలిసినవాళ్ళు తారసపడినప్పుడు, అలాగే రోజూ కనిపించేవాళ్ళు ఎదురుపడినప్పుడు ఎంచక్కా పలకరించాలని, కనీసం చిరునవ్వుతోనైనా పలకరించాలని మానసిక నిపుణులు చెప్తున్నారు.

దీనివల్ల ఇరువురికీ మరింత మానసికపరమైన ఆనందం, సంతృప్తి కలుగుతాయి. మానసిక ఆరోగ్యానికి ఇటువంటి సామాజిక అనుబంధాల అవసరం ఎంతైనా ఉందనేది నిపుణుల అభిప్రాయం.

# సెక్స్ AND సైకాలజీ



డా॥జి. సమరం

## You need to do more than just drop your shorts

ఆర్.ఆర్. నంద్యాల

**నా వయస్సు 18 సంవత్సరాలు. నాకు మూత్రం వచ్చే రంధ్రం పురుషాంగం మధ్యలో ఉంది. దానివల్ల మూత్రం పోసుకున్నప్పుడు ప్యాంటుమీద మూత్రం పడిపోతోంది. నేను పెళ్ళికి పనికివస్తానా, పనికిరానా? సమాధానం చెప్పగలరు.**

మీకున్న పరిస్థితిని 'హైపోస్పిడియాస్' అంటారు. ఆపరేషన్‌ద్వారా దాన్ని సరిదిద్దవచ్చు.

మూత్రం పురుషాంగం చివరినుంచి వచ్చేటట్లు చేయవచ్చు. ఆపరేషన్ అయినతర్వాత మీరు నిరభ్యంతరంగా పెళ్ళి చేసుకోవచ్చు. అందరిలాగానే సెక్స్‌ని ఎంజాయ్ చేయవచ్చు.

ఎస్.ఎమ్. విజయవాడ

**ఆడబిడ్డ, మగబిడ్డ పుట్టడం అనేది భర్తవల్లే ఉంటుందని విన్నాను. భార్యకు ఈ విషయంలో ఎటువంటి ప్రమేయంలేదని కూడా విన్నాను.**

**మరికొంతమంది సెలబ్రిటీస్ పెళ్ళిచేసుకున్నప్పుడు మొదటి భార్యకు అంతా మగపిల్లలే పుడతారు. రెండవ భార్యకు అందరూ ఆడపిల్లలే పుడతారు. ఆది ఎలా సాధ్యమైంది?**

ఆడబిడ్డ పుట్టడం, మగబిడ్డ పుట్టడం అనేది పురుషునిలోని వీర్యకణాలబట్టే ఉంటుంది.

పురుషునిలోని వీర్య కణాల్లో సగం 'ఎక్స్' క్రోమోజోమ్ ఉండే వీర్యకణాలు ఉంటాయి. మరో సగం 'వై' క్రోమోజోమ్ ఉండే వీర్యకణాలు ఉంటాయి.

అండంతో కలవడానికి అనేక మిలియన్ల వీర్యకణాలు ప్రయత్నిస్తాయి. అందులో ఎక్స్ క్రోమోజోమ్ ఉన్న వీర్యకణాలూ ఉంటాయి, వైక్రోమోజోమ్ ఉన్న వీర్యకణాలు ఉంటాయి.

ఫైనల్‌గా 'ఎక్స్' క్రోమోజోమ్ ఉన్న వీర్యకణం అండంలోకి ప్రవేశించి అండంలోని 'ఎక్స్' క్రోమోజోమ్‌తో కలయిక చెందితే ఆడబిడ్డగా రూపొందడం ఉంటుంది. ఒకవేళ 'వై' క్రోమోజోమ్ ఉన్న వీర్యకణం ప్రవేశించి అండంతో జతకలిపితే మగబిడ్డగా రూపొందడం ఉంటుంది. స్త్రీలో ఎప్పుడూ ఎక్స్‌క్రోమోజోమే ఉంటుంది.పురుషునిలోనే వేరువేరుగా ఉంటాయి.

అండంతో 'ఎక్స్' క్రోమోజోమ్ ఉన్న వీర్యకణం కలవడంగాని, 'వై' క్రోమోజోమ్ ఉన్న వీర్యకణం కలవడంగాని యాదృచ్ఛికంగా జరగడమే తప్ప మరొకటి కాదు. ఒక్కోసారి మొదటి సంతానంలోనూ, రెండవ సంతానంలోనూ యాదృచ్ఛికంగా 'వై' క్రోమోజోమ్ ఉన్న వీర్యకణం కలవవచ్చు. అప్పుడు మగ

Courtesy : MAXIMINDIA

సంతానం కలుగుతుంది. ఎక్స్ క్రోమోజోమ్ ఉన్న వీర్యకణం తదుపరి గర్భధారణ సమయాల్లో కలిసినట్లయితే వరుసగా ఆడపిల్లలే పుట్టవచ్చు.

అందుకనే చాలా సందర్భాల్లో ఒకసారి ఆడపిల్ల, మరొకసారి మగపిల్లవాడు పుట్టడం ఉంటుంది.అంతే తప్ప దీనికి ప్రత్యేకమైన కారణాలు ఏమీలేవు.

ఇందులో స్త్రీఆరోగ్యం బలంగా లేదా బలహీనంగా ఉండటం లేదా అండం బలంగా ఉండటమో, బలహీనంగా ఉండటమో, అదేవిధంగా పురుషుని వీర్యకణాలు ఒక రకమైనవి బలంగా ఉండటమో, మరొక రకమైనవి బలహీనంగా ఉండటమో కాదు.వాటి డామినేషన్‌వల్ల మగపిల్లవాడు,ఆడపిల్ల పుట్టడమనేది లేదు.

ఎ.ఎన్. ఖమ్మం

*మా ఆవిడ కాన్పు అయ్యి మూడు వారాలైంది. ఎప్పటినుంచి సెక్స్‌లో పాల్గొనవచ్చు? మా ఆవిడకి 2-3 సంవత్సరాలవరకు గర్భం రాకుండా లూప్ వేయించాలని అనుకుంటున్నాను. లూప్ ఎప్పుడు వేయవచ్చు?*

కాన్పు అయిన 6 వారాలనుండి సెక్స్‌లో పాల్గొనవచ్చు. లూప్‌కూడా అప్పుడే వేయించడం మంచిది. లూప్ వేయించిన తర్వాత మూడునుంచి అయిదు సంవత్సరాలవరకు గర్భం వచ్చే అవకాశంఉండదు.

ఎమ్.ఎ.ఆర్. హైదరాబాద్

*నా వయస్సు **40** సంవత్సరాలు. నాకు ఇదివరకు ఉన్న కోరికలు ఇప్పుడు లేవు. ఇంతకుముందు ఒక్కసారి సంభోగిస్తే మరల అంగం సహకరించేది. కాని ఇప్పుడు అలా లేదు. మా ఆవిడ మరోసారి కావాలంటోంది. కాని నేను చేయలేకపోతున్నాను.*

*అది ఆమెకు చెప్పలేకపోతున్నాను. దాంతో ఇప్పుడు కాదు తర్వాత చూద్దామని ఏదో ఒక సాకు చెప్పి తప్పించుకుంటున్నాను. దీనికి ఏమయినా మందులు ఉంటే చెప్పగలరు.*

పురుషులకు కొంత వయస్సు వచ్చినతర్వాత సహజంగానే సెక్సువల్ స్టామినా తగ్గుతుంది. దాని వలన యవ్వనంలో ఉన్నట్లుగా ప్రౌఢ వయస్సులో పాల్గొనలేకపోతారు.

చాలామందికి 40-50 సంవత్సరాలు వచ్చేసరికి టెస్టోస్టిరోన్ హార్మోన్ తగ్గుతుంది. కొందరిలో థైరాయిడ్ హార్మోన్ కూడా తగ్గుతుంది. ఈ పరిస్థితివల్ల సెక్స్‌లో పాల్గొనే సామర్థ్యం తగ్గుతుంది.

ఇది ఇలా ఉండగా ప్రోలాక్టిన్ హార్మోన్ ఉండవలసినదానికంటే ఎక్కువగా ఉంటుంది. దానివల్ల కూడా సెక్స్ సామర్థ్యం తగ్గుతుంది.

ఇంకొందరిలో రక్తంలో కొవ్వుశాతం ఎక్కువ అవుతుంది. దానివల్ల రక్తనాళాలు సన్నబడి పురుషాంగానికి తగినంత రక్తప్రసరణ లేక అంగం స్తంభించదు. మరికొందరిలో షుగర్, బి.పి. చోటుచేసుకుంటాయి. అవికూడా సెక్స్‌ని దెబ్బతీస్తాయి.

మరికొందరిలో పురుషాంగంలో పి.డి.ఇ. 5 ఎంజైమ్ ప్రభావం ఎక్కువై అంగస్తంభన లేకుండా అవుతుంది. ఇలా ప్రౌఢవయస్సు వచ్చేసరికి అంగ స్తంభన వైఫల్యాలు ఏర్పడతాయి.

దీనికితోడు రకరకాల మానసిక సమస్యలు, ఆందోళనలు, మానసిక ఒత్తిడి అంగం స్తంభించకపోవడానికి కారణాలవుతాయి. సెక్స్‌మీద ఇంట్రెస్ట్ చాలావరకు తగ్గిపోతుంది. కొందరికి కోరిక ఉన్నప్పటికీ పైన పేర్కొన్న కారణాల్లో ఏదో ఒకటి సెక్స్‌కి పనికిరాకుండా చేస్తాయి.

మీ విషయంలో కారణం ఏమయినదీ పరీక్షలు చేయించుకోండి. లోపాన్నిబట్టి చికిత్స చేస్తే తిరిగి సెక్స్ సామర్థ్యం కోలుకునే అవకాశం ఉంది.

అవసరాన్నిబట్టి సెలిడినాఫిల్, టాడాల్ఫిల్ కూడా వాడవచ్చు. అవి కూడా సెక్స్ సామర్థ్యాన్ని పెంచుతాయి. మీ విషయంలో ఒకసారి డాక్టర్‌ని సంప్రదించండి. తప్పకుండా మీరు కోరుకునే రీతిలో సెక్స్‌ని ఎంజాయ్ చేయగలుగుతారు.

## ఆమె భయాలు ఆమెవి

యుక్తవయసు రాగానే ఆలోచనలు, చూపులు, చేతలు అన్నీ మారిపోతాయి. గతంలో అబ్బాయిలను పట్టించుకోని అమ్మాయిలు వారిమీద ప్రత్యేకంగా దృష్టి పెడతారు. అబ్బాయిలతో కబుర్లకు ఇష్టపడతారు. అబ్బాయిలతో కలిసి సమయం గడపటం వారికి మజాగా ఉంటుంది.

వీటితోపాటుగా లైంగిక అనుభవాలను శరీరం కోరుకుంటుంది. ఒంటరి సమయంలో కలల్లో లైంగికంగా ఆనంద అనుభవం, తృప్తి పొందుతారు.

అంతవరకు బాగానే ఉంది. కాని వాస్తవ లైంగిక అనుభవం దగ్గరికి వచ్చేసరికి అమ్మాయిలో భయం మొదలవుతుంది. ఎందుకో తెలియదుగాని తొలి రాత్రి అనుభవం గురించి ఎంతగా కలలు కంటారో అంతకు పదిరెట్లు ఎక్కువ భయపడతారు. ఆ భయాలకు కారణాలు పలురకాలు.

ఆ భయం కొందరికి తొలి రాత్రి అనుభవంతో పోతుంది. కాని చాలామందిలో ఆ భయాలు వయసు పెరిగినా నిలిచివుంటాయి.

ఆ భయాలలో ముఖ్యమైనది తన రూపంగురించి. తన శరీరం ఆకర్షణీయంగా ఉండదేమోనన్న భయం వారిని వేధిస్తుంది. తన స్తనాల సైజుమీద సందేహం. అవి మరీ తక్కువ సైజులో ఉన్నాయని కొందరు, మరీ పెద్దవిగా ఉన్నాయని మరికొందరు భయపడుతుంటారు. అతనికి నచ్చవేమోనన్న సందేహం వారిని వెంటాడుతుంది.

పూర్తిగా డ్రెస్ తొలగిస్తే తన నగ్న శరీరం అతగాడిని ఆకట్టుకోదన్న భయంతో తొలినాళ్ళలో డ్రెస్ తియ్యరు. లైట్ వెయ్యనియ్యరు. ఇది పలు సంవత్సరాల సంసారంతర్వాత కూడా వదలని భయం.

ఆమెను సరిగా సంతృప్తిపరచగలనా! అనే సందేహం మగాళ్ళను వేధించినట్టే, ఆయనకు కోరుకున్నవిధంగా పడకగదిలో ఉంటున్నానా! లేదా! అనే భయం ఆమెను వదలదు. ఈ భయం పోవాలంటే నోరువిప్పి తన భయం వివరించి, అవతలవారి అభిప్రాయం తెల్సుకోవాలి. అలా అడగటమంటే తననితాను తక్కువ చేసుకోవటమనుకుంటారు లేదా ఆయన ఏమన్నా అనుకుంటాడేమోనని భయం.

ఈ భయం వదిలించుకోనివారు జీవితాంతం భయం భయంగా సెక్స్‌ని సంపూర్ణంగా ఆనందించలేరు. సెక్స్ అంటే చీకటిలో మరెవరికీ తెలియనివిధంగా అనుభవించేదన్నది ఆడవారి నమ్మకం.

అది కొంతవరకే నిజం. ఎవరికీ తెలియకుండా జరగాల్సినది. కాని తామిద్దరూ ఉన్నప్పుడు కాంతి మీదపడుతున్నా హాయిగా లైంగిక ఆనందం పొందవచ్చన్నది వారికి అర్థంకాదు.

మగవారు తాము చేస్తున్నది చూసుకోవాలనుకుంటారు. అందుకే పడకగదిలో లైట్ వేస్తారు. కాని ఆమెకు భయం లైట్ లేకుంటేగాని అందుకు సిద్ధమవదు. అంగప్రవేశ భయం, ఆ సమయం బాధతో కూడుకున్నదనే భయం అంత సులభంగా వదలదు. నిజానికి అంగప్రవేశం అత్యంత సాఫీగా జరిగే విధంగా ప్రకృతి ఏర్పరిచింది.

ఆ సమయానికి యోనినుండి ద్రవాలు ఉత్పత్తి అయి, ఇబ్బంది లేకుండా పురుషాంగాన్ని స్వీకరిస్తుంది. లైంగిక అనుభవానికి మానసికంగా సిద్ధమై, శారీరకంగా స్పందిస్తున్నప్పుడు సెక్స్ అంత సుఖమైన అనుభవం మరొకటి ఉండదు.

ఏముంది ఇందులో అనే భావం మరికొందరు మహిళలది. వారు చదివిన ప్రేమకథలు, చూసినటువంటి సినిమా సన్నివేశాలకు తగినట్టుగా జీవితం సాగదు. మధ్యలో వచ్చేటువంటి ఇబ్బందులు, చిన్న చిన్న ఇతర అంశాల పరిష్కారానికి పడకగదిని వేదిక చేసుకునేవారికి సెక్స్ అంటే భయంకరమైన అనుభవంగానే ఉంటుంది.

వయసు ఏదైనా గర్భ భయం వదలదు వారిని. సెక్స్‌లో పాల్గొన్న ప్రతిసారీ గర్భం వచ్చే అవకాశం ఉండదు. అయినా ఆ భయంతో సెక్స్‌లో సరిగా పాల్గొనలేరు. ఆనందం పొందరు. ఇటీవలి కాలంలో లైంగికపరమైన రోగాల భయం వారిని వేధిస్తున్నది. ఇన్నిరకాల భయాలవల్ల తాము సుఖపడలేక భాగస్వామికి సుఖం ఇవ్వలేకపోతున్నారు. ◆

డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

# మాఫియాలో మానిని

సీరియల్

"వీడు గజేంద్రతోడా. మాఫియా లీడర్. ఇది వీడి రివాల్వర్" అంటూ గజేంద్రతోడా రివాల్వర్‌ని అందించాడు.

"కానీ ఇంతమందిని మీరొక్కరూ..." నమ్మలేక అడిగాడు ఒక ఎస్సై.

"ఒక్కడ్నే కొట్టాను. మేడమ్ సుదీపగారిని ఎత్తుకువెళ్ళాలని వచ్చారు. కిడ్నాప్ అండ్ హత్యాప్రయత్నం నేరాలకింద గజేంద్రతోడాని, వెంటవచ్చిన ఈ కుక్కల్ని అరెస్ట్ చేసి తీసుకువెళ్ళండి. ఆత్మరక్షణకి సుదీపగారిని కాపాడడానికి కొట్టక తప్పలేదు. వెంటనే ట్రీట్‌మెంట్ ఇప్పించకపోతే వీళ్ళలో కొందరు పోయే ప్రమాదం ఉంది. అలాగే గజేంద్రతోడా బైటికి రాకుండా చూడండి. ఈసారి కన్పిస్తే వీడ్ని చంపేస్తాను" వేలెత్తి గజేంద్రతోడాని చూపిస్తూ హెచ్చరించాడు.

ఆ మాటలకి సి.ఐ. నవ్వాడు. "డోంట్‌వర్రీ సార్... సాదూభాయ్ పోయాక మాఫియా కార్యకలాపాలు తగ్గాయి.కాని ఇంతలోనే ఈ గజేంద్రతోడా రంగంలోకొచ్చాడు. పరిస్థితి మళ్ళీ మొదటికొచ్చింది.

వీడిమీద మూడు హత్యానేరాలు, పది క్రిమినల్ కేసులు ఉన్నాయి. చట్టానికి దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్నాడు. వీళ్ళని పట్టిచ్చి మా డిపార్ట్‌మెంట్‌కి మీరు చాలా మేలు చేశారు. ఇక బయటకు రాడు" అంటూ హామీ ఇచ్చాడు.

ఫార్మాలిటీస్ అన్నీ ముగించుకుని అందర్నీ అరెస్ట్ చేసి వాహనాల్లోకి ఎక్కించారు. పోలీసు వాహనాలు వెళ్ళగానే అప్పుడు మెట్లు దిగి వచ్చింది సుదీప.

"సో... ఇక శాశ్వతంగా మీకు గజేంద్రతోడా పీడా పోయినట్టే. హ్యాపీగా ఉండండి మేడమ్. కాదంటే నా



మూలంగా హాల్‌లో ఫర్నిచర్ అంతా ధ్వంసమైంది. చాలా నష్టం జరిగింది. కొత్త ఫర్నిచర్‌కి ఆర్డర్ చేస్తాను. ఓకేనా. ఇక సెలవిప్పిస్తే నేను బయలుదేరతాను" అన్నాడు.

E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్మోహనరావు

సుదీప కొద్దిక్షణాలు కార్తికేయనే చూస్తూ నిలబడింది. కళ్ళలో దూకటానికి సిద్ధంగా ఉంది కన్నీరు. అతడినుంచి చూపులు తిప్పకుండానే "మందాకినీ. అరగంటలో హాల్లో చెత్తంతా బయట వుండాలి. అలాగే గంటలోపల కొత్త ఫర్నిచర్ ఇక్కడుండాలి. ఫోన్ చెయ్యి" అంది.

"అలాగే మేడమ్. ఇక్కడి పనులు మేం చూసుకుంటాం. మీరెళ్ళండి" బదులిచ్చింది మందాకిని.

"నాతో రండి" అంటూ కార్తికేయ చేయిపట్టుకుని మెట్లమీదికి దారితీసింది సుదీప. "మేడమ్. నా మాట

వినండి. ఇప్పటికే లేటయింది. నేను వెళ్ళాలి" అంటూ చేయి విడిపించుకోవాలని చూశాడు.

సుదీప చేయి వదల్లేదు. కళ్ళు తుడుచుకుంటూ పైకి లాక్కుపోయింది. అతడ్ని బెడ్‌రూమ్‌లోకి ఒక్క తోపు తోసి తలుపుమూసింది.అంతే ఇక దుఃఖం ఆపుకోలేక డోర్‌దగ్గరే కూలబడి ఏడ్చేసింది.

నివ్వెరపోయి అలాగే నిలబడిపోయాడు కార్తికేయ. "ఏమయింది మేడమ్. మీరెందుకు ఏడుస్తున్నారో అర్థంగావటంలేదు. ఇంకేదైనా కొత్త ప్రాబ్లమా?" అని అడిగాడు. చివ్వున తలెత్తి చూసింది. "నువ్వే నా ప్రాబ్లమ్.ఇంకేం చెప్పుకోను" అంది రుద్ధకంఠంతో.

"నేనా... ఏమంటున్నారు మేడమ్"

"నువ్వు మేడమ్ అంటూ గౌరవం ఇచ్చి నన్ను కించపరచకు కార్తీ. తట్టుకోలేకపోతున్నాను. ఏమీ తెలీనట్టు జరగనట్టు చూస్తున్నావ్. మాట్లాడుతున్నావ్. కాని ఎవరూ చెప్పకుండా ఇక్కడున్న అందరిపేర్లు నీకు తెల్సు.మా ఇంట్లో ప్రతి అంగుళం తెల్సు. కాని ఇప్పుడే చూస్తున్నట్టు ప్రవర్తిస్తున్నావ్. ఎందుకు?

అప్పట్లో నీ పేరు తెలీదు, ఊరు తెలీదు. కాని సాదూభాయ్ శరీరంలోకి పరకాయప్రవేశం చేసి నా వద్దకొచ్చింది నువ్వు. పక్షందినాలు నాతో సంసారం చేసింది నువ్వు. ఇక్కడ గాంధీ ఆస్పత్రిలో సాదూ భాయ్‌గా చచ్చి బతికింది నువ్వు.

అమెరికాలో సాదూభాయ్ కట్టెను వదిలేసి చచ్చిన చింపాంజీలో ప్రవేశించి విధ్వంసం సృష్టించింది నువ్వు. ఇండియా ఎప్పుడొస్తావాని ఎదురుచూస్తూవుంటే కుంభకోణంలో ఒక సంఘటన.

ఎనిమిదిగంటలక్రితం చచ్చిపోయిన ఎద్దు బతికి స్వామీజీని చంపి తనుకూడా చచ్చింది. స్వామీజీని ఎందుకు చంపావోగాని ఆ సంఘటనబట్టి నువ్వు ఇండియా చేరుకున్నావని సంతోషపడ్డాను.

నాకోసం వస్తావని ఎదురుచూస్తున్నాను. వచ్చావ్. కాని ఏం లాభం? నా ఒంటిమీద ఎక్కడెక్కడ ఎన్ని పుట్టుమచ్చలున్నాయో తెలిసికూడా నన్ను పరాయి దాన్లా చూస్తున్నావ్. వచ్చి ఏవో నాలుగు కంటితుడుపు మాటలు చెప్పి ముఖం చాటేసి వెళ్ళిపోవడానికే వచ్చా వనిపిస్తోంది. నా బాధ ఎవరికి చెప్పుకోను" అంటూ ఒక్కసారిగా ఏడ్చేసింది సుదీప.

కరుగుతున్న మనసును చిక్కబట్టుకొంటూ "మీరు పొరబాటుపడుతున్నారు. మీరనుకొంటున్న మనిషి నేను కాదు. అయినా ఇదంతా నాతో ఎందుకు చెప్తుతున్నారో అర్థంగావటంలేదు" అన్నాడు.



## 41 జరిగిన కథ

కార్తికేయ సుదీప ఇంటికొస్తాడు. అతను సైంటిస్టని, సాదూభాయ్ శరీరంలోకి ప్రవేశించిందని అతనేనని గ్రహిస్తుంది మందాకిని.

మాఫియా లీడర్ గజేంద్రతోడా సుదీపని కిడ్నాప్ చేద్దామని సుదీప ఇంటికి వస్తాడు.

అక్కడ సైంటిస్ట్ కార్తికేయ ఉండేసరికి అతడికి ఏమీ అర్థంకాదు. బెడ్‌రూమ్‌లో దాక్కొన్న సుదీపను ఆమె సహాయకురాలు మందాకిని పిలుచుకునివస్తోంది. మనకిక భయం లేదు, కార్తికేయ మనకి సహాయం చేస్తాడని సుదీపతో చెప్తుంది మందాకిని.

ఈ లోపల కార్తికేయ తీరుచూసి అతడిపై మండిపడతాడు గజేంద్రతోడా. అంతే, కార్తికేయ గజేంద్రతోడా మనుషుల్ని, తోడాని చిత్తుచిత్తుగా కొడతాడు. ఈ సంఘటనలన్నీ చూస్తున్న సుదీప, మందాకిని ఊపిరిపీల్చుకుంటారు. ఇక జరిగేది చదవండి.

"కాదు. అర్థంకాదు" అంది రుద్ధకంఠంతో.

"నామీద ఫీలింగ్స్ ఉంటే గదా అర్థంగావటానికి. నేన్నీకు అక్కర్లేదు. నా బాధ అక్కర్లేదు. ఆకలి తీరగానే అరిటాకును విసిరిపారేసినట్టు నన్ను అవతల పారేయాలని చూస్తున్నావ్.

ఎక్కడో గుజరాత్‌లో పుట్టి పెరిగిన అమ్మాయిని. పరువుకు ప్రాణమిచ్చే కుటుంబం మాది. నా దురదృష్టం. నా అందమే నాకు శాపమైంది. సాదూభాయ్ కంటబడ్డాను. బలవంతంగా నన్నెత్తుకొచ్చాడు.

లేచిపోయాననే అపవాదు మా కుటుంబంమీద పడింది. దాంతో పుట్టింటికి శాశ్వతంగా దూరమయ్యా. గుండె రాయిచేసుకుని ఇష్టం లేకపోయినా సాదూ భాయ్‌తో ఉండిపోయాను. కష్టాలను భరించాను.

సాదూభాయ్‌కి పిల్లల్నికంటే అలాంటి దుర్మార్గుల్నే లోకానికివ్వాల్సొస్తుందన్న భయంతో పిల్లలు కలక్కుండా జాగ్రత్తపడ్డా. నిజమైన ప్రేమెంత మధురంగా ఉంటుందో నువ్వు వాడి శరీరంలోకి వచ్చాకే తెల్సింది. ఇప్పుడు ఒంటరిదాన్ని.

నేనే పరిస్థితిలో ఉన్నానో తెలిసికూడా వదిలి ఎలా వెళ్ళాలనిపిస్తోంది? గజేంద్రతోడాగాకుంటే రేపు మరొకడు. ఒంటరి ఆడదానిగా మిగిలిపోతే నా బతుకు కుక్కలుచింపిన విస్తరికాదా?" రుద్ధకంఠంతో సుదీప అడుగుతూంటే కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు కార్తికేయ.

అసలు తను పరకాయప్రవేశం చేసిన విషయమెలా గ్రహించిందో అర్థంగావట్లేదు. అలాగని బైటపడలేకపోతున్నాడు. ఎలా బైటపడగలడు? కళ్ళముందు సంజనా మెదులుతోంది. ఇంకో అమ్మాయితో సంబంధం ఉందని తెలిస్తే ఆమె ఏమైపోతుందోనని భయంగా ఉంది.



## మరింత ఎత్తుకు...

'ముల్క్' సినిమా నటిగా తనను మరికొంత ఎత్తుకు తీసుకువెళ్ళిందని కించిత్ గర్వంగా చెప్తోంది తాప్సీ. "నటీనటులుగా మాకు కొంత సామాజిక బాధ్యత వుంటుంది. ప్రేక్షకులు, మాధ్యమాల సహకారం వుంటేనే బాధ్యతను మేము సంపూర్ణంగా నిర్వర్తించగలం.

వెలుపలినుంచి వచ్చిన నటిగా పరిశ్రమలో నేను నాదైన ముద్రవేయాలని కోరుకుంటున్నాను. ఒక్కో సినిమాకు ఎదగాలని ఆశపడుతున్నాను. నా బాధ్యతను పూర్తిగా నెరవేర్చాలంటే నాకు అందరి సహకారమూ కావాలి" అని చెప్పింది.



## వేర్ ఈజ్ ది వెంకటలక్ష్మి

పదమూడేళ్ళుగా కమర్షియల్ బ్రేక్ కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తున్న రాయ్ లక్ష్మి ఏవో ఒక పాత్రలతో సర్దుకుంటూ, ఏడాదికి మూడు సినిమాలకు తగ్గకుండా కెరీర్ బండి ఈడుస్తున్నది. ప్రత్యేక పాటల్లో వీలయినన్ని అందాలు విరజిమ్ముతున్నది.

హిందీ 'జూలీ 2' పైపెట్టుకున్న ఆశలూ అడియాసలయ్యాయి. అదృష్టాన్ని మరోసారి ప్రయత్నించుకునే పనిలో భాగంగా ఈసారి తెలుగులో కామెడీ సినిమా చేస్తున్నది. 'వేర్ ఈజ్ ది వెంకటలక్ష్మి' షూటింగ్ 'షురూ' చేసింది. కొత్తరూపం ఎలా కుదురుతుందో వెయిట్ అండ్ సీ.

"మీ మాటలు వింటుంటే బాధగానే ఉంది. కాని మీరనుకుంటున్న వ్యక్తి నేను కాదు. నిజంగా మీరు పొరబడినట్టున్నారు" అన్నాడు బాధగా.

ఆ మాటలతో చివ్వున తలెత్తి చూసింది సుదీప. లేచి కళ్ళు తుడుచుకుంది. సూటిగా కళ్ళలోకి చూస్తూ కార్తికేయ చేయి అందుకుని తన తలమీద ఉంచుకుంది "నువ్వు కాదుగదా. ఓకే. నువ్వుకాదని నామీద ప్రమాణం చేసి చెప్పు. ఇక నిన్ను బాధపెట్టను. నా చావు నేను ఛస్తాను" అంది.

చలించిపోయాడు కార్తికేయ. ప్రమాణం ఎలా చేయగలడు? చట్టున చేయి వెనక్కి తీసుకున్నాడు. అంతవరకు ఎలాగో నిగ్రహించుకున్నాడు. ఇక తనవల్ల కాలేదు. ఆమె దుఃఖం చూస్తూ చలించిపోయాడు. అంతే ఆమెను మీదకు లాక్కుని గుండెలకు హత్తుకున్నాడు. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

సుదీప బల్లిలా అతడ్ని హత్తుకుపోయి ఏడ్చేసింది. బిగికౌగిట కాసేపు మాటలు కరువయ్యాయి ఇద్దరికీ. ఆమె కళ్ళుతుడిచి నుదురు ముద్దాడాడు.

"సారీ... నిన్ను బాధపెట్టాను క్షమించు. నా పరిస్థితి నీకు తెలీదు. నీకెలా న్యాయం చేయాలో అర్థం గావటం లేదు. అందుకే నేను ఎవరో తెలీకుండానే పలకరించి వెళ్ళిపోవాలనుకున్నాను. కాని దొరికిపోయాను..." అన్నాడు నొచ్చుకుంటూ.

చిన్నగా తలెత్తి ముఖంలోకి చూసింది సుదీప. "నువ్వే పరిస్థితిలో ఉన్నా నన్నొదలకు. తట్టుకోలేను. చచ్చిపోతాను. నీతోనే నా జీవితం" అంటూ తనపగడాల అధరాలతో కార్తికేయ అధరాలను ముద్దాడింది. అంతే నాలుగు పెదవులు ఒకటైపోయాయి.

ఆలింగనంలోని అమరసుఖాన్ని అనుభవిస్తూ కాసేపు అలాగే ఉండిపోయారు. ఆనందంతో సుదీప ఛాతీ పెరిగింది. ఉప్పొంగిన ఆమె ఎదభారాలు అతడి ఛాతీని అదిమేస్తున్నాయి. పెన్నిధి దొరికినట్టు మురిసిపోతూ అతడి కౌగిలి వదల్లేదామె.

తనెలాగూ ఆమెకు దొరికిపోయాడు. ఇక మిగిలింది జరిగింది చెప్పి ఓ పరిష్కారం ఆలోచించడమే. సుదీపను తీసుకువెళ్ళి బెడ్‌మీద కూర్చోపెట్టి పక్కన కూర్చున్నాడు. "సుదీ, నేనెవరో ఏం జరిగిందో నీకు చెప్పాలి. వింటేనా పరిస్థితి నీకే అర్థమవుతుంది" అంటూ జరిగిందంతా ఆమెకు వివరించి చెప్పాడు.

"నా మరదలు సంజనా అంటే నాకు ప్రాణం. తనూ అంతే. ఆమెను కాపాడుకునే క్రమంలోనే నేను సాదూభాయ్‌ని ఓ సాధనంగా వాడుకున్నాను. ఇక్కడికొచ్చాకే నిన్ను చూశాను.

నీ అందం ఓ అద్భుతం... అయినా పాస్‌పోర్టు నువ్వు దాచకుండా ఉంటే నిన్ను తాకేవాడ్నే కాదు. అందుకోసమే నీకు దగ్గరయ్యాను. పాస్‌పోర్టుతో కొలంబియావరకు వెళ్ళాను. జరిగిందంతా నీకు తెలుసు. ఇప్పుడు చెప్పు. నేన్నీకు ఏ విధంగా న్యాయం చేయగలను?" అనడిగాడు.

కాసేపు మౌనంగా ఉండిపోయింది సుదీప. అతడి అడ్వెంచర్స్ విని ఆశ్చర్యోద్వేగానికి లోనయింది. అంతలో కార్తికేయ సెల్ మోగింది. అవతల లైన్లో ఉంది రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. "చెప్పండి మావయ్యా. ఎక్కడున్నారు?" అడిగాడు కార్తికేయ.

"ఇంతక్రితమే గెస్ట్‌హౌస్‌కి వచ్చారా... భోజనం టైమవుతోంది. నీకోసం వెయిట్ చేస్తున్నాను. ఎక్కడున్నావ్? వచ్చేస్తున్నావా?" అడుగుతున్నారాయన.

"లేదు మావయ్యా. కాస్త లేటవుతుంది. ఫ్రెండ్ వద్ద ఉన్నాను. నాకోసం చూడొద్దు. మీరు భోంచేసి విశ్రాంతి తీసుకోండి" చెప్పాడు.

"సరి. త్వరగా వచ్చెయ్"

అవతల లైన్ కట్ చేశారు రాజావారు. సుదీపతో ఏదో చెప్పబోయాడు. రెండోసారి ఫోన్ మోగింది. చూస్తే సంజనా లైన్లో ఉంది. పర్లాకిమిడి ప్యాలెస్ నుంచి ఫోన్ చేస్తోంది. సుదీప ఏదో అడగబోతుంటే వారించాడు. "సంజనా లైన్లో ఉంది. కాసేపు మౌనంగా ఉండు. ప్లీజ్" అన్నాడు కార్తికేయ.

చిన్నగా నవ్వింది సుదీప. ఫోన్ ఆన్ చేశాడు.

"ఆఁ చెప్పు సంజూ. ఎలా ఉన్నావ్?" అడిగాడు.

"నేను బాగానే ఉన్నాగాని బావా నువ్వేంటి ఇంకా గెస్ట్‌హౌస్‌కి రాలేదట. పదినిముషాల క్రితం ఫోన్‌చేస్తే డాడీ చెప్పారు. ఎక్కడ వున్నావ్..?" అవతల అడుగుతోంది సంజనా.

"ఇక్కడే ఫ్రెండ్ దగ్గరున్నాను. ఇప్పుడే మావయ్య ఫోన్ చేస్తే చెప్పాను. వెళ్ళటం కాస్త ఆలస్యమవుతోంది" చెప్పాడు.

"ఫ్రెండ్ అంటున్నావ్. లేడీసా... జంటా..."

"ఏయ్ సంజూ..."

"జోక్ చేశాలే బావా. నీ గురించి నాకు తెలీదా ఏంటి. ఒక్కదానికీ ఇక్కడ బోర్ కొడుతోంది. మాటి మాటికీ గుర్తొస్తున్నావ్. నేనూ ఢిల్లీ వస్తానంటే తీసు కెళ్ళలేదు. ఐ మిస్ యూ బావా"

"ఐ టూ మిస్ యూ స్వీటీ. బట్ తప్పదుగదా. డోన్ట్ వర్రీ త్వరలో వచ్చేస్తాగాని ఫోంచేశావా లేదా"

"ఫైళ్ళు ముందేసుక్కూర్చున్నాను. కాసేపాగి చేస్తాను. పార్టీలవీ ఉంటే ఎక్కువ తాగకు. లిమిట్‌లో ఉండు. సరేనా. జాగ్రత్త బై"

"బై" అంటూ లైన్ కట్ చేసి ఫోన్ పక్కన పడేసి సుదీపవంక చూశాడు. "చూశావ్‌గా. కాస్త లేటయ్యే సరికి ఫోన్లు. సంజనా ఫోను" చెప్పాడు.

"అర్థమయింది..." అంటూ మీదకు వంగి చెంప ముద్దాడింది సుదీప.

"నా పరిస్థితి అర్థమైందిగా? చెప్పు. నీకోసం ఏం చేయగలను? వయసులో నాకన్నా రెండుమూడేళ్ళు నీకు ఎక్కువే ఉంటాయి. నిన్ను పెళ్ళి చేసుకోలేను. తెలిస్తే సంజూ తట్టుకోలేదు. కాని..."

"వద్దు. ఇంకేం చెప్పకు" అంటూ అతడి మాట లకి అడ్డుపడింది సుదీప.

"ప్రేమకు వయసు అడ్డంకి కాదు. నీకు తెలుసు. మా గుజరాత్‌లో పుట్టి పెరిగిన దైవం శ్రీకృష్ణునికి ఎనిమిదిమంది భార్యలున్నారు. అయినా రాధకోసం తరచూ బృందావనానికొచ్చివెళ్ళేవాడు.

అంతేకాని రాధని ఎన్నడూ ద్వారక తీసుకెళ్ళలేదు. ఎందుకంటే నిజానికి రాధ మొదటి భార్య కావాలి. కాని వయసులో పెద్దది. వరసకు మేనత్త. లోకంవప్పదు కాబట్టే ఎంత ప్రేమవున్నా రాధను పక్కనుంచేశాడు. అయినా రాధాకృష్ణుల ప్రేమ లోకవిదితం కాదా?

నీ నుంచి నేను డబ్బో ఆస్తులో ఆశించటంలేదు కార్తీ. అవి నా దగ్గరే బోలెడున్నాయి. ఇప్పుడు నేను బిచ్చగత్తెగా నీ ముందున్నా. ప్రేమభిక్ష అర్థిస్తున్నాను. నా కోరిక ఒక్కటే. నన్ను వదిలేయకు.

నాకోసం వచ్చిపో. సంజనాపట్ల చూపే ప్రేమలో పదోవంతు ప్రేమ నామీద చూపినా చాలు. ఇది మన ఇల్లు. నేను నీదాన్ని. నీకు నేను పిల్లల్ని కనాలి. వాళ్ళకి తండ్రిగా నీ సంతకం కావాలి. నా ప్రాణం ఓ రోజు నీ చేతుల్లోనే పోవాలి. మనకి పెళ్ళితో పనిలేదు. ఇవి అను గ్రహిస్తే నా జన్మ ధన్యమైనట్టే" అంది.

అరటిపండు ఒలిచినట్టు ఆమె మన సులో ఏం వుందో అర్థమైంది కార్తికేయకు. కాదనలేదు. కాని ఏదో రోజు సంజనాకు ఈ విషయం తెలిస్తే ఏమవుతుంది? అది తలచుకుంటేనే భయంగా ఉంది.

అతడి మౌనాన్ని భగ్నం చేయకుండా అతడి షర్టు తీసి హ్యాంగర్‌కేసింది సుదీప. బెడ్‌రూమ్ డోర్ బోల్ట్‌వేసేసింది. వచ్చి అతని కౌగిట వాలిపోయింది. అంతే... అప్పుడు మూసుకున్న తలుపులు తిరిగి రాత్రి ఎని మిదిగంటలగ్గాని తెరుచుకోలేదు.




వారం గిర్రున తిరిగింది. తన విదేశీ పర్యటన ముగించుకుని ప్రధాని ఢిల్లీ చేరుకున్నారు. గతంలో జర్నల్స్‌లో వచ్చిన కార్తికేయ ఎఫెక్ట్ వ్యాసాలు చదివి ప్రధానమంత్రి కూడా చాలా ఆసక్తిగా ఉన్నారు.

అందుకే పర్లాకిమిడి నుంచి రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ కార్తికేయతో వచ్చినట్టు తెలీగానే వెంటనే అపాయింట్‌మెంట్ ఇచ్చారు. తొలి సమా వేశంలో కార్తికేయ ఎఫెక్ట్ గురించి, ప్రయోగ ఫలితాల గురించి, వాడితే ఒనగూడే ప్రకృతి లాభాలగురించి సవివరంగా ప్రధానికి వివరించాడు.

అలాగే ఇది ప్రపంచ దేశాలన్నిటికీ సప్లై చేయాలి గాబట్టి భారీ ఎత్తున అవసరమైన మూడు ఫ్యాక్టరీల గురించి స్థలం గురించి గోడౌన్లు ఆఫీసుల గురించి తన ప్లాన్స్ మొత్తం చెప్పాడు. మొదటిసారి ప్రధాని గంట సమయమిచ్చారు. అది చాలక ఇంకో గంట పొడిగించబడింది. మొత్తం నాలుగు రోజులు ఐదు విడతలుగా చర్చలు జరిగాయి.



నిపుణుల బృందం కూడా సమావేశాల్లో పాల్గొంది. ఫైన ల్‌గా ప్రధాని చేసిన మార్పులు తమకు ఫేవర్‌గానే ఉండ టంతో కార్తికేయతోపాటు రాజావారు కూడా అంగీకరిం చారు. ఆ మార్పుల్లో ప్రధాన మైనవి. ఈ ప్రాజెక్ట్‌లో రాజా వారుగాని, కార్తికేయగాని పైసా పెట్టుబడి పెట్టాల్సిన అవసరంలేదు. అంతా ప్రభుత్వం చూసుకుంటుంది. ఫ్యాక్టరీలు, ఉత్పత్తి, మార్కెటింగ్‌తోసహా అంతా.

రాజావారు ఇవ్వజూపుతున్న పర్లాకిమిడి అటవీ ప్రాంతం వన్యప్రాణుల ఆవాసంగావటంతో అక్కడ ఫ్యాక్టరీల నిర్మాణంవల్ల అడవిమృగాల జీవనం దెబ్బ తింటుంది. దానికిబదులు మహానదీ పరీవాహక ప్రాంతాల్లో మైదాన బీడుభూముల్లో స్థలాలు సేక రించి అక్కడ నిర్మాణం పనులు ఆరంభించాలి.

సుమారు వెయ్యి ఎకరాల్లో భారీగా మూడు ఫ్యాక్ట రీలు, గోడౌన్లు, మూడువందలమంది కార్మికుల కోసం కాలనీ, ఆఫీసు ఎస్టాబ్లిష్‌మెంట్ అంతా ప్రభు త్వమే చూసుకుంటుంది.

దీన్ని ప్రభుత్వ కార్పొరేట్ సంస్థగా నిర్మించి పబ్లిక్ ఇష్యూల ద్వారా ప్రజల నుంచి కొంత డబ్బు సేకరించి మిగిలింది ప్రభుత్వం సమకూర్చి సకాలంలో ఫ్యాక్ట రీలు ఉత్పత్తి ఆరంభించేలా చూస్తుంది.

ముడిసరుకు సరఫరా నిల్వ అంతా కార్పొ రేట్ సంస్థ చూసుకుంటుంది. ఇది భారీ ప్రాజెక్టుగాబట్టి ఎంతో కొంత లాభాలు పొందకపోతే నిర్వహణ కష్టమవుతుంది. కాబట్టి వ్యాపారపరం గానే దీన్ని అభివృద్ధి చేయాలి.

ప్రభుత్వమే దీనికి క్వింటాల్‌కి ఎంతో వెలకట్టి విదేశాలకు సప్లై చేస్తుంది. కార్తికేయ ఎఫెక్ట్ తయారీకి సంబంధించి పేటెంట్ హక్కులు కార్తికేయకే చెందు తాయి. లాభాలలో పదోవంతు కార్తికేయకు చెల్లి స్తారు. ఇక ఫ్యాక్టరీలను ఉత్పత్తి నాణ్యతను కార్తి కేయ సూపర్‌వైజ్ చేయాల్సివుంటుంది.

దీనికి కార్మికులతోపాటు కార్తికేయకు జీతభత్యాలు అందుతాయి. ఇది ప్రభుత్వ కార్పొరేట్ సంస్థ. దీన్ని సమర్థవంతంగా నిర్వహించే బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్‌లో రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌గారికి

భారత తొలి ప్రధానిగా మహమ్మదాలీ జిన్నా పేరును మహాత్మాగాంధీ ప్రతిపాదించారు... కాని నెహ్రూ వ్యతిరేకించాడు. -దలైలామా, బౌద్ధ గురువు



## భలే... భలే...

వేర్వేరు సినిమాల్లో విభిన్నమైన పాత్రల్లో నటించడంవల్ల నటిగా తనను తాను ఎంతగానో మెరుగు పరుచుకోవడానికి వీలవుతున్నదని ఆనందంగా చెపుతున్నది శ్రద్ధాకపూర్.

స్త్రీ, బట్టిగుల్ మీటర్ చలు, ఇటుపక్క సాహో, మరోవైపు సైనానెహ్వాల్ బయోపిక్‌లతో బిజీబిజీ.

"ఒకే సమయంలో వేర్వేరు సినిమాల్లో పనిచేయడంవల్ల కష్టంగానే ఉండొచ్చుకాని, అలా చేయడంవల్ల నటనలో మెళుకువలకు అవకాశం ఉంటున్నదని, ఓ పాత్రనుంచి మరో పాత్రకు జంప్ చేయడం ఎంతో బావుందని అంటోంది.

సముచిత స్థానం కల్పించబడుతుంది. ముందుగా స్థల సేకరణకు ఇంజనీర్ల బృందం ఒకటి త్వరలో ఒరిస్సా పంపించబడుతుంది.

కార్తికేయ, ఆ బృందాన్ని లీడ్ చేయాలి. ఇలా ఈ ప్రాజెక్ట్‌కు సంబంధించి ప్రతి అంశాన్నీ స్పృశిస్తూ కూలంకషంగా చర్చలు సాగాయి. అంగీకారం కుదిరాక డాక్యుమెంట్లు కూడా సిద్ధమయ్యాయి. మొత్తం వ్యవహారం తమకు ఫేవర్‌గానే జరగటం రాజావారికీ, కార్తికేయకు సంతోషం కలిగించింది.

దీనివల్ల తమకు ఫండ్స్ గురించి వెంపర్లాడే అవస్థ తప్పింది. టెన్షన్స్‌నుంచి బయటపడే వెసులుబాటు లభించింది. ప్రధాని కూడా ఈ ప్రాజెక్ట్‌పట్ల పూర్తి విశ్వాసంతో ఇంట్రెస్ట్ చూపడంవల్లనే ఇది సాధ్యపడింది. ఫైనల్ సమావేశంలో డాక్యుమెంట్లమీద సంతకాలు చేశాడు కార్తికేయ.

అంతటితో తాము ఢిల్లీ వచ్చిన పని ముగిసింది. ప్రధానికి, ఇతర బృందానికి కృతజ్ఞతలు చెప్పి మావ అల్లుళ్ళిద్దరూ తమ గెస్ట్‌హౌస్‌కి చేరుకున్నారు. అప్పటికే ఆలస్యంగావటంతో ఇంకా రాలేదేమిటని అటునుంచి సంజనా ఫోన్లు చేస్తూనే ఉంది.

మరునాడు పర్లాకిమిడి తిరుగుప్రయాణం అనగా ఆ రాత్రి నిద్రకు దూరమయ్యాడు కార్తికేయ. సుదీప విషయం అతడ్ని కలచివేస్తోంది. ఆమెనూ వదులుకోలేని పరిస్థితికి వచ్చేశాడు.

వదిలేస్తే తను చచ్చిపోతుంది. అదే జరిగితే ఆమె ఉసురు తమకు క్షేమమా... సంజనాతో హ్యాపీగా ఉండగలడా? అలాగని సుదీపతో సంబంధం రహస్యంగా ఎంతకాలం? ఏదో రోజు తెలీకపోదు. సంజూ విషయం అలా ఉంచితే మావయ్య సంగతేమిటి?

ఆయన తనకు చాలా చేశారు. దైవంతో సమానం. ఆయన ముందుకూడా ఈ విషయం దాస్తే ఓ రోజు దోషిలా నిలబడాలి. తను మనశ్శాంతిగా ఉండాలంటే దీనికి ఒక్కటే మార్గం. మావయ్యకు చెప్పి పరిష్కారం అడగటమే. ఇలా ఆ రాత్రి ఒక నిశ్చయానికొచ్చాకే ప్రశాంతంగా నిద్రపోగలిగాడు కార్తికేయ.

మరునాడు ఉదయం. "కార్తీ. మనం వచ్చినపని జయప్రదంగా ముగిసింది. ఇక మనం వెళ్ళిపోవచ్చు. ట్రావెల్ ఏజన్సీకి ఫోన్‌చేసి రెండు ఫ్లైట్ టికెట్లు చెప్తాను. దొరికితే మధ్యాహ్నం లేదా రేపు వెళ్ళిపోదాం. ఏమంటావ్?" అని అడిగారు రాజావారు.

"అలాగే మావయ్యా. కాని ఈలోపల మీకు ఓ విషయం చెప్పాలి" అన్నాడు కార్తికేయ.

"ఏ విషయం...?" అని అడిగారు రాజావారు, కార్తికేయని.

"నాకు ఓ సమస్య ఉంది. అది తప్పో రైటో నాకే తెలీదు. జడ్జి స్థానంలో ఉండి సమస్య విని మీరు తీర్పు చెప్పాలి" అన్నాడు.

కార్తికేయ ముఖాన్ని ఆశ్చర్యంగా చూశారు రాజావారు. అతడిని ఏదో సమస్య వేధిస్తోందని అర్థమైంది. చిన్నగా నవ్వుతూ వచ్చి ఎదురుగా కూచున్నారు.

"ఏదన్నా పొరబాటు చేశావా? తప్పు జరిగిందా? అడిగారు రాజావారు.

"అలాంటిదే అనుకోండి. దీనికి ప్రభుత్వంతో చేసుకున్న ఒప్పందాలతో సంబంధం లేదు. ఇది ఫక్తు పర్సనల్" అన్నాడు కార్తికేయ.

"ఓకే. నాకు జడ్జిస్థానం ఇస్తున్నావంటే సమస్య పెద్దదే అయివుండాలి. డోంట్‌వర్రీ చెప్పు. ఏంటది?" అని అడిగారు రాజావారు.

కార్తికేయ ఇక ఏదీ దాచలేదు. సుదీప విషయంగా జరిగిందంతా రాజావారి ముందుంచాడు. సాంతం శ్రద్ధగా విని గాఢంగా నిట్టూర్చారు రాజావారు.

"ఏం చేయను మావయ్యా. తనను వదిలేస్తే చచ్చిపోతానంటోంది సుదీప. చేరదీస్తే సంజూకి అన్యాయం చేసినవాడ్నవుతానన్న బాధ ఉంది.

ఈ విషయం దాచిపెడితే ఓ రోజు దోషిగా మీ ముందు నిలవాలన్న భయం ఉంది. అందుకే జరిగింది మీ ముందుంచాను. మీ తీర్పుకి కట్టుబడతాను.



## దశ తిరిగింది

పాత్రకు అవసరమయిన శిక్షణలు తీసుకోవడంలో నేటి తారలు ముందుంటున్నారు. అంతే కాదు- డూప్‌లతో పనిలేకుండా రిస్కీ సన్నివేశాలు సైతం స్వయంగా చేసేస్తున్నారు.

ఆ జాబితాలోకి శృంగార తార సన్నీలియోన్ కూడా చేరింది. గుర్రపుస్వారీ, కత్తిసాముల్లో శిక్షణ పొంది మరీ సినిమాలో నటిస్తున్నది.

తెలుగు, తమిళం, హిందీ, కన్నడ, మలయాళ భాషల్లో తీస్తున్న 'వీరమాచదేవి' సినిమాలో టైటిల్ పాత్రలో నటిస్తున్న సన్నీ అవసరమైన సకల కళల్లోనూ శిక్షణ పొందుతున్నది. అంతేనా- ఈమధ్య ఓ మలయాళీ సినిమాకూ సంతకాలు చేసిందట. ఎంతైనా ఈమె దశ తిరిగిందిలే!

నేనేం చేయాలో చెప్పండి" అనడిగాడు కార్తికేయ.

"కార్తీ. సమస్యను దాచకుండా నా ముందుంచావ్ చూడు. అందుకు ముందుగా నిన్నభినందించాలి. సంజనాను బ్రతికించుకునే క్రమంలో సుదీపకు మగదిక్కు లేకుండాపోయింది. కాదనను కాని ఆమె పట్ల నీలోనూ ఆకర్షణ ఏర్పడింది.

నీ మనసులో ఆమెపట్ల సాఫ్ట్‌కార్నర్ ఏర్పడింది. అందుకే అవసరం తీరిపోయింది గదా తనేమయితే ఎందుకులేని వదిలేయకుండా చూడ్డానికెళ్ళావ్.

సమయానికి గజేంద్రతోడానుంచి ఆమెను కాపాడావ్. విచిత్రం ఏమంటే నిన్ను గుర్తించే విషయంలోనే ఆమె తెలివితేటల్ని అభినందించాలి.

ఓకే. నేను తీర్పు చెప్పాలంటే ఓసారి సుదీపను చూసి మాట్లాడాలి" అన్నారు రాజావారు.

"తను నా నుంచి ఏమీ ఆశించటంలేదు మావయ్యా. నా మనిషిగా ఉండిపోతే చాలు అంటోంది. కాని..."

"నీ బాధ నాకు అర్థమయిందిలేరా. రాజ వంశాల్లో బహు భార్యాత్వమనే ఆచారం ఉన్నదే. ఈ ఆచారాన్ని నా తండ్రి రామచంద్ర గజపతి మహదేవ్ తప్పించాడు.

ఈ విషయంలో ఆయన్ని మెచ్చుకోవాలి. నేను అంతే. ఒకే భార్య. కాని మా తాతగారికి ముగ్గురు భార్యలు. మా ముత్తాతకు ఐదుగురు భార్యలు. తను ఓడించిన రాజుల భార్యలను తిరిగి పెళ్ళి చేసుకుని అంతఃపురంలో ఉంచుకునేవారు. ఆ రోజులు పోయాయనుకో.

చరిత్ర పునరావృతం అవుతుందన్నట్టు ఇప్పుడు సమస్య నీకు చుట్టుకుంది.

ఇక నాకు వదిలెయ్. ఈ సమయంలో నువ్వు చింతలువంతలు పడకూడదు.

హ్యాపీగా ఉంటేనే నీ డ్రీమ్ ప్రాజెక్ట్ కార్తికేయ ఎఫెక్ట్ కార్యాచరణకు వస్తుంది... నీ పేరు, చరిత్ర ప్రసిద్ధమవుతుంది. విచారం విడిచిపెట్టి నాకా అమ్మాయిని చూపించు" అన్నారు రాజావారు.

వెంటనే సుదీపకు ఫోన్ చేసి చెప్పాడు కార్తికేయ. సరిగ్గా పదకొండుగంటలకి కారు సుదీప నిలయం పోర్టికోలోకి వచ్చి ఆగింది. రాజావారితో లోనకు అడుగుపెట్టాడు కార్తికేయ. వాళ్ళకోసం ఎదురు చూస్తూ హాల్లోనే ఉంది సుదీప.

గుజరాతీ సాంప్రదాయ దుస్తుల్లో చందనపు బొమ్మలా మెరిసిపోతున్న సుదీప అందచందాలకు ఆశ్చర్యపోయారు రాజావారు. కార్తికేయ ఆమెను ఎందుకు వదులుకోలేకపోతున్నాడో అర్థమైంది.

రాజావారికి ఎదురువస్తూ వినయంగా నమస్కరించింది సుదీప. ఒద్దికగా వంగి ఆయనకు పాదాభివందనం చేసింది. ఆ సమయంలో సుదీపకు తెలీకుండానే ఆమె కళ్ళనుంచి రాలిన కన్నీటి చుక్కలు రాజావారి పాదాలనభిషేకించాయి.

తను ఏం చెప్తాడోనన్న ఆందోళన ఆమెను భయపెడుతోందని గ్రహించి వాత్సల్యంగా భుజాలుపట్టి లేపారాయన. ఆమె వినయవిధేయతలు అందచందాలు రాజావారిని ముగ్ధుడ్ని చేశాయి.

"మిమ్మల్ని చూస్తుంటే నా తండ్రి గుర్తొస్తున్నారు. మిమ్మల్ని డాడీ అని పిలవచ్చా?" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ సుదీప.

చలించిపోయారు రాజావారు. "ష్యూర్. నాకు తండ్రి స్థానం కల్పించినందుకు చాలా ఆనందంగా ఉందమ్మా. ఈ రోజునుంచి నాకు ఒకరు కాదు ఇద్దరు కూతుళ్ళు. ఏ తండ్రీ తన కూతుళ్ళలో ఏ ఒక్కరికీ అన్యాయం జరగటం సహించడు. సరే వచ్చాగదా. చింతిల్లకు. కార్తీ మనం కాస్త ఏకాంతంగా మాట్లాడుకుంటే బాగుంటుంది" అన్నారు.

సుదీప మందాకినితోపాటు తమ నౌకర్లను రాజావారికి పరిచయం చేసింది. అతిథిమర్యాదల అనంతరం బెడ్‌రూమ్‌లో తలుపు మూసి ఏకాంతంగా కూర్చున్నారు. "మీ సమస్యకు నేను పరిష్కారము చెపుతాను. కట్టుబడి ఉంటారు గదా...?" ఇద్దర్నీ చూస్తూ అడిగారు రాజావారు.



**ఇంటా బయటా విమర్శలు వస్తూనే వుంటాయి. వాటికోసం ఆందోళన అనవసరం... అనుకున్నది చెయ్యటమే.**

*-సచిన్ టెండూల్కర్, మాజీ క్రికెటర్*

"తప్పకుండా మావయ్యా. చెప్పండి..." అన్నాడు కార్తికేయ రాజావారితో.

"నా నిర్ణయం తప్పో రైటో... లోకం మెచ్చుతుందో లేదో కూడా నాకు తెలీదు. నువ్వు సుదీపను ఉంచుకుంటానంటే ఒప్పను. మీరుకూడా పెళ్ళిచేసుకోవాలి. దానికి ముందు ముఖ్యమైన విషయం ఏంటంటే ఈ అమ్మాయి ఇక్కడే ఉంటే సాదూభాయ్ మనిషిగా పడిన ముద్రనుంచి బయటపడలేదు.

అతడి జ్ఞాపకాలు కూడా చెరిగిపోవాలి. దానికి ఒక్కటే మార్గం. త్వరలోనే సంజనాతో నీ వివాహం జరిపించేస్తాను. తర్వాత లండన్ వెళ్తాను. వెళ్ళేప్పుడు సుదీపను వెంటతీసుకువెళ్తాను. అక్కడ మన వ్యాపారాలు ఉన్నాయి. సుదీపను నా స్థానంలో కూర్చోపెట్టి వ్యాపారాలు అప్పగించివస్తాను. చదువుకుందిగాబట్టి సమర్థవంతంగా నిర్వహిస్తుంది.

సంజనా లండన్‌లోనే పెరిగిన పిల్లగాబట్టి దానికంతా తెలుసు. ఓ రోజు అది లండన్ వచ్చేసరికి సుదీప అక్కడే ఉంటుంది. అలాగే సంజనాకు ఇప్పట్లో ఈ విషయం తెలియాల్సిన పనిలేదు. సమయం వచ్చినప్పుడు నేనే నచ్చచెప్తాను.

కార్తీ ఢిల్లీవంకతో లండన్ వచ్చిపోతూంటాడు. నేను రెండోసారి వచ్చినప్పుడు వెంకటేశ్వర ఆలయంలో మీ ఇద్దరికీ పెళ్ళి జరిపిస్తాను. అంతటితో మీ బంధం బలపడుతుంది.

ఈ లోపల ఈ ఇంటిని ఎక్స్‌పోర్ట్ అండ్ ఇంపోర్ట్ బిజినెస్‌ని బాధ్యతగా చూసుకోడానికి సుదీప నమ్మకమైనవాళ్ళకి అప్పగించాలి. ఇదే నా తీర్పు. ఇది మీకు సమ్మతమే అనుకుంటాను. ఏమంటారు?" అంటూ తన అభిప్రాయాన్ని వివరించారు రాజావారు.

సుదీప రాజావారి అనుగ్రహం మహాభాగ్యంగా భావించి ఆనందబాష్పాలతో మరోసారి రాజావారి కాళ్ళమీద తన తలవుంచి నమస్కరించింది. కార్తికేయ కూడా సంతోషించాడు. రాజావారికోసం విందు భోజనాలు ఏర్పాటుచేయించింది సుదీప.

కమ్మటి గుజరాతీ వంటకాలతో విందు భోజనాలు చేసి విశ్రాంతి తీసుకున్నాక మావ అల్లుళ్ళు ఇద్దరూ గెస్ట్‌హౌస్‌కి తిరిగివచ్చారు.

మరునాడు ఫ్లైట్‌లో పర్లాకిమిడికి వెనుతిరిగారు. ఆ మరుసటి నెల్లోనే సంజనా కార్తికేయల వివాహం పర్లాకిమిడి ప్యాలెస్‌లోనే రంగరంగ వైభవంగా జరిగింది. తర్వాత చెప్పినట్టే సుదీపను వెంటబెట్టుకుని లండన్ తీసుకెళ్ళారు రాజావారు.

తనకు నమ్మకస్తురాలయిన మందాకినికి తన ఇంటి బాధ్యత, ఎక్స్‌పోర్ట్ అండ్ ఇంపోర్ట్ కంపెనీ బాధ్యతలు అప్పగించి వెళ్ళింది సుదీప. నష్టపరిహారం కేసు కోర్టులో ఇంకా నడుస్తోంది. ఆ వ్యవహారం లాయర్లు చూసుకుంటున్నారు. అవసరం పడినప్పుడు సుదీప లండన్నుంచి రావలసివుంటుంది.

ఇదిలా ఉండగా మరోపక్క కార్తికేయ ఎఫెక్ట్ ప్రభుత్వ కార్పొరేట్ సంస్థగా వెలసింది. మహానదీ తీరమైదాన ప్రాంతంలో సేకరించిన భూముల్లో ఫ్యాక్టరీ నిర్మాణం శరవేగంతో సాగుతోంది.

ఆ ప్రాంతాన్ని మిలిటరీ తన ప్రొటెక్షన్‌లోకి తీసుకుంది. ఎందుకంటే దీన్ని వ్యతిరేకించే శత్రువులుంటారని ప్రభుత్వం కూడా గుర్తించింది. కాలం చకచకా పరుగెడుతోంది. కార్తికేయ ఇద్దరు భార్యలతో రెండు పడవలమీద కాళ్ళు పెట్టినట్టయింది.

అయినా ఒడిదుడుకులు లేకుండా సాఫీగానే సాగిపోతోంది. త్వరలోనే ఫ్యాక్టరీలు కార్తికేయ ఎఫెక్ట్ కెమికల్ ఉత్పత్తిని ఆరంభించబోతున్నాయి

ఇబ్బడిముబ్బడిగా అన్ని దేశాల నుంచి ఆర్డర్‌లు అందుతున్నాయి. దీనివల్ల భవిష్యత్తులో భూమిపైన మూడువేల సంవత్సరాల వెనకటి వాతావరణం నెలకొని సమస్త మానవాళి జీవితం కాలుష్యరహితంగా నిత్యనూతనంగా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లుతుందని ఆశిద్దాం.

-: అయిపోయింది :-

## అంకితం



ట్రయాంగిల్ యునైటెడ్ తెలుగు అసోసియేషన్ (నార్త్ కరోలినా-యుఎస్ఎ) ఛైర్మెన్ మురళి లగిసెట్టిగారికి, ప్రెసిడెంట్ వాసంతి వెన్నపూసగారికి, కార్యవర్గసభ్యులకు మరియు మెంబర్స్‌కి నా ఈ నవల 'మనిషిలో మనిషి' హృదయపూర్వకంగా అంకితమిస్తున్నాను.

- సూర్యదేవర రామ్‌మోహనరావు

# డాక్టర్ నో ఫీజ్

గొర్తి శ్రీనివాసరావు




బ్యూటీపార్లర్‌లో రెండు గంటల నుంచి ఉంది పద్మనయన. నెలకోసారి క్రమం తప్పకుండా వస్తుందక్కడకు.

వచ్చినప్పుడు ఫేషియల్స్, పెడిక్యూర్‌లు, ఐబ్రోస్ దిద్దించుకోవడంవంటి వాటితోపాటు హెయిర్‌కలర్ కూడా వేయించుకుంటుంది.

వయసు నలభై ఐదు దాటినా తన వయసు ఇరవై అయిదు అన్నట్లు బిహేవ్ చేస్తుంది అందరి ముందూ. ఆమెకు మెడిసిన్ ఫైనల్ ఇయర్‌లో ఉన్న అమ్మాయి ఉందంటే నమ్మరు ఎవరూ.

ఎప్పుడైనా పార్టీలకు కూతురు కూడా వస్తే, మీ చెల్లెలా అని అడుగుతారు ఆమెని. అలా వాళ్ళు అడిగితే మురిసిపోతుంది ఆమె. అందానికి అంత ప్రాముఖ్యత ఇస్తుంది పద్మనయన.

అన్నింటికంటే ముఖ్యంగా ఆమెకు తన స్కిన్‌టోన్ అంటే మహాఇష్టం. తన మేని ఛాయ మేలిమి బంగారు రంగులో ఉంటుందని ఆమెకు గర్వం.

ఆ రంగు అలానే కాపాడుకోవాలని ఆమె సన్ స్క్రీన్ లోషన్లు, క్రీములు వాడుతుంది.ఆమె జీతంలో సగానికిపైగా ఆమె అందాన్ని కాపాడుకోవడానికే ఖర్చు అవుతుందంటే అతిశయోక్తి కాదు.

ఆ రెండు గంటలపాటు ఆమె కోసం వేచి ఉండాల్సిన బాధ్యత ఆమె భర్త సూర్యనారాయణది.

ఆమెని బ్యూటీ పార్లర్ దగ్గర దింపేసి దగ్గరలో ఉన్న పార్కుకి వెళ్ళి అక్కడ ఉన్న వాకింగ్ ట్రాక్‌లో ఒక గంట పాటు నడుస్తాడు.

తర్వాత అక్కడ ఆడుకోవడానికి వచ్చిన వాళ్ళతో మాట్లాడుతూ, వాళ్ళు చెప్పే కబుర్లు వింటూ ఉంటాడు. అప్పుడప్పుడూ మాత్రమే కనిపిస్తున్న అతనితో స్నేహంగా ఉంటారు వాళ్ళు.

బహుశా అతను మాట్లాడేటప్పుడు తన గురించి చెప్పుకోవడానికంటే వాళ్ళ గురించి వినడానికి ఎక్కువ ఆసక్తి చూపించడంవల్లనేమో.

అలా అని వాళ్ళ వ్యక్తిగత విషయాలు తెలుసుకోవడానికి ప్రయత్నించడు. వాళ్ళకు నచ్చిన విషయాలు మాట్లాడుతూ వాళ్ళు చెప్పేది వింటూ ఉంటాడు. వృత్తిరీత్యా డాక్టర్ అయిన సూర్యనారాయణ తన ఆరోగ్యం పట్ల శ్రద్ధ తీసుకుంటాడు.

వీలున్నంతలో తన పరిచయస్తులకు కూడా మేలైన సలహాలు ఇస్తూ ఉంటాడు.

అది కూడా ఆ పార్కులో అతని పాపులారిటీ పెరగడానికి ఒక కారణం.

కన్సల్టేషన్ ఫీజు తీసుకోని డాక్టర్‌గా అతనికి 'డాక్టర్ నో ఫీజ్' అనే ముద్దుపేరు కూడా పెట్టుకున్నారు ఆ పార్కులోని అతని ఫ్యాన్స్.

వాళ్ళందరితో సూర్యనారాయణ తనకు ఆ పేరు సూట్‌కాదని, క్లినిక్‌లో తను తప్పనిసరిగా ఫీజ్ తీసుకుంటానని చెప్తుంటాడు.

అయితే నిజానికి చాలామంది ప్రకృతిలో ఆ పేరుకి అర్హమయినవాళ్ళు ఉన్నారని, మంచిగాలి, నీరు, ప్రకృతి అందించేఅన్ని ఆహారాలు,అంతకుమించి



సర్వజీవులకు ప్రాణ ప్రదాత అయిన ఆ ప్రత్యక్ష నారాయణుడైన సూర్యభగవానుడిని 'డాక్టర్ నో ఫీజ్'గా పిలుచుకోవచ్చు అని. ఆయన వల్ల సకల ప్రాణులు పుట్టుకకు మాత్రమే కాదు ఆరోగ్యంగా ఉండడానికి కూడా కారణం అని చెప్తుంటాడు.

ఆ రోజు కూడా ఎప్పటిలాగే వాకింగ్ చేసుకుని అందరినీ పలకరించి కబుర్లు చెప్పుకుని టైమ్ చూసుకున్నాడు డాక్టర్ సూర్యనారాయణ. వాచ్‌లో సమయం చూసుకుని అందరి దగ్గర సెలవు తీసుకుని పార్క్ బయట పార్క్ చేసి ఉన్న తనకారు తీసుకుని పద్మనయనను పికప్ చేసుకోవడానికి బ్యూటీ క్లినిక్‌కి బయల్దేరాడు.

అతను అక్కడకు చేరుకోవడానికి అరగంటముందే పద్మనయన పనులన్నీ పూర్తి అయ్యాయి. అప్పుడే కడిగిన ఆణిముత్యంలా ఉంది ఆమె.

భర్త డ్రైవ్ చేస్తూ ఉంటాడని తెలుసు కనుక అతనికి ఫోన్ చేయలేదు ఆమె. ట్రాఫిక్‌లో ఒక్కోసారి లేట్ అవుతూ ఉంటుందని తెలుసు ఆమెకు.

బ్యూటీపార్లర్‌లోనే కూర్చుని అక్కడి మ్యాగజైన్స్ చూడసాగింది ఆమె. కొంచెంసేపటికి ఆమె ఫోన్ మృదువుగా రింగ్ అయింది.

అందులో భర్త ఫోటో కన్పించి,వెంటనే ఆన్సర్ చేసింది. "పద్మా, వచ్చేశాను. నీ పని అయిందా" అడిగాడు సూర్యనారాయణ.

"చాలాసేపటి నుంచి మీ కోసం వెయిటింగ్. మీరు తీరుబడిగా ఇప్పటికి తేలారు. వస్తున్నా ఉండండి" అని కాల్ కట్‌చేసి ఫోన్ బ్యాగ్‌లో వేసుకుంది.

బ్యూటీపార్లర్‌లోని బ్యూటీషియన్‌కి బై చెప్పి బయటకు నడిచింది. ఆమె బయటకు వచ్చేసరికి సాయంకాలపు నీరెండ బంగారు రంగులో ఏటవాలుగా పడుతోంది.

అది చూడగానే తన బ్యాగ్ తెరిచి అందులోని ఫోల్డబుల్ గొడుగుని తీసి ఓపెన్ చేసి ఆ నీరెండ తనపై పడకుండా అడ్డంపెట్టుకుంది.

భర్త డ్రైవింగ్ సీట్‌లో కూర్చుని తనవంకే పరీక్షగా చూస్తూ ఉంటే గమనించింది. ముసిముసినవ్వులు నవ్వుకుంటూ కార్ డోర్ తెరిచి లోపల కూర్చుని తన గొడుగు ముడిచింది. ఈలోగా సూర్యనారాయణ కారు దిగి ఆమెవైపుకి వెళ్ళి డోర్ వేశాడు.

అటు తిరిగి మళ్ళీ డ్రైవింగ్ సీట్‌లో కూర్చుంటున్న సూర్యనారాయణను చూసి, "టీషర్ట్ మార్చుకున్నారా" అంది.

"ఊ" అన్నాడు. చెమటవాసన వస్తుందని కార్‌లో ఎక్కగానే ముందు చెమటతో తడిసిపోయిన తన టీషర్ట్ తీసి బ్యాగ్‌లో ఉన్న మరో టీ షర్ట్ వేసుకున్నాడు అతను, ఎప్పటిలాగానే!

"ఏమిటి అలా చూస్తున్నారు?" అంది.

"ఎప్పుడు?" అన్నాడు.

"అదే నేను పార్లర్‌లో నుంచి వస్తున్నప్పుడు" అంది ముసిముసినవ్వులు రువ్వుతూ.

"ఏం లేదు" అన్నాడు.

"సరే, నేను ఎలా ఉన్నాను" అంది.

"బాగున్నావు" అన్నాడు సూర్యనారాయణ ఆమెవైపు ఒకసారి చూసి.

"ఏమిటి అలా తేల్చేస్తున్నారు.

చూసేటప్పుడు మాత్రం ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తారు" అంది ఆమె.

"ఓహ్, గుర్తుకొచ్చింది పద్మా! నువ్వు బాగున్నావని చూడడం కాదు. అఫ్‌కోర్స్ నువ్వు ఎప్పుడూ బాగానే కనిపిస్తావు నాకు. కాకపోతే ఆ నీరెండ నీ ఒంటిమీద పడితే నీకు మంచిది కదా!

కాని దానికి నువ్వు గొడుగు అడ్డంపెడుతున్నావేంటి అని అలాచూశాను" అన్నాడు.

"అబ్బ, మీకు ఎన్నిసార్లు చెప్పాను.

ఎండపడితే కందిపోతాను. కథల్లో చెప్తారుచూడండి మహారాణిల గురించి,అసూర్యంపశ్య అని, అలాగన్న మాట నేను" అంది.

"అసూర్యంపశ్యా.... అంటే" అన్నాడు.



## సామాజిక బాధ్యత

సామాజిక కారణాలను ఎలుగెత్తి చాటే విషయంలో రాధికా ఆప్టే ముందుంటుంది. ఓ సామాజిక పారిశ్రామికవేత్త శానిటరీ న్యాప్‌కిన్ల తయారీ ప్రయాణానికి సంబంధించిన ఇతివృత్తంతో తీసిన 'ప్యాడ్‌మ్యాన్' సినిమాలో ఆమె నటించింది.

"మన దేశంలో మహిళల వ్యక్తిగత పరిశుభ్రత పట్ల ఎవేర్‌నెస్ చాలా తక్కువగా వుంది. రుతుక్రమ సంబంధిత పరిశుభ్రతపై ప్రజల్ని జాగృతం చేయాల్సిన అవసరం ఉంది.

నిర్లక్ష్యంచేస్తే ఎటువంటి సమస్యలు వస్తాయో కూడా తెలియజెప్పాల్సి ఉంది. రాత్రికి రాత్రి మార్పులు వచ్చేయవు. ఇదంతా నెమ్మదిగా సాగే ప్రక్రియ. రుతుక్రమ పరిశుభ్రత గురించి మాట్లాడేందుకే సిగ్గుపడుతుంటారు.

దీనిగురించి ఓపెన్‌గా చర్చించడమే తొలి లక్ష్యం" అంటున్న రాధికా ఆప్టే ఓ నటిగా జీవితంలో ఆసక్తిదాయకమైన విషయాలను తెలియజెప్పాల్సిన సామాజిక బాధ్యత తన ప్రధానధ్యేయం అని చెప్తోంది.

"ఎండ కన్నెరుగని స్త్రీ అని అర్థం" అంది అరచేత్తో నుదురు సుతారంగా కొట్టుకుంటూ.

"నీ హెల్త్ బాగుండాలి అంటే నీకు ఎండ అవసరం బంగారూ" అన్నాడు, కొద్దిగా అనునయంగా!

"నా ఆరోగ్యానికేమొచ్చింది. ఫిట్‌నెస్ మెయింటైన్ చేస్తున్నాగా. పర్‌ఫెక్ట్ ఫిగర్ నాది. మన ఇంట్లో ట్రెడ్‌మిల్ చేస్తాను. ఏరోబిక్స్ చేస్తాను, యోగాచేస్తాను, చక్కటి డైట్ తీసుకుంటాను. నా హెల్త్ గురించి మీరేం వర్రీ కానవసరంలేదు. అదేదో మీ పేషెంట్ల గురించి వర్రీఅయితే మంచిది" అంది వ్యంగ్యంగా!

"అంతేలే పెరటిచెట్టుని నేను. నామాట ఎందుకు వింటావులే నువ్వు" అన్నాడు.

మాటల్లోనే ఇల్లు చేరారు. ఇంటికి వెళ్ళేసరికి ఊరి నుంచి పద్మనయన మేనత్త కాంతం ఫ్యామిలీతో సహా వచ్చి ఉంది.

కాంతం భర్త రమణారావు స్కూల్‌లో మాస్టారుగా చేసి రిటైర్ అయ్యాడు. వాళ్ళకి లేటుగా కలిగారు ఇద్దరు ఆడపిల్లలు.

అందులో పెద్దది డిగ్రీ మూడో సంవత్సరంలో ఉంది. రెండవది టెన్త్ చదువుతూ ఉంది.

"ఏమిటిది అత్తయ్యా, ఇలా సడన్ సర్‌ప్రైజ్?" అంది పద్మనయన.

"ఏముందే, పిల్లలిద్దరికీ సెలవులు. ఈమధ్య నాకు ఒంట్లో బాగుండటంలేదు.

కాళ్ళ నొప్పులు, కీళ్ళ నొప్పులు వస్తుంటే ఒకసారి అన్ని టెస్టులు చేయించుకుంటే బాగుంటుందని మీ దగ్గరకు వచ్చేశా. ఇక్కడైతే అబ్బాయి ఉంటాడు. స్పెషలిస్టులు ఎవరిని చూడాలో చెప్తాడు.

అక్కడ డాక్టర్లు మీ మావయ్యను లోకువ కట్టేసి అన్నిరకాల టెస్టులు రాసేస్తున్నారు. టన్నులకొద్దీ మాత్రలు మింగమంటున్నారు. నా వల్లకాదని ఇలా చక్కా వచ్చేశాను" అంది కాంతం.

"మంచి పనిచేశావు అత్తా. ఈ డాక్టర్‌గారికి పేషెంట్లంటే చాలా ప్రేమ. ఇప్పుడే అనుకుంటున్నా పేషెంట్లను ఈయన మంచిగా చూస్తారని" అంది పద్మనయన నవ్వుతూ.

మరుసటి రోజు కాంతంకి టెస్టులవి చేయించాడు, డాక్టర్ సూర్యనారాయణ.

తర్వాత బంధువులంతా సైట్‌సీయింగ్‌కని వెళ్ళిపోయారు. ఆ రాత్రికి వచ్చి అలిసిపోయామని చెప్పి పడుకున్నారు. తెల్లారి లేచి తన రిపోర్టులు చూసి అల్లుడు చెప్పిన సలహాల మేరకు మందులు, అవీ రాయించుకుంది కాంతం.

"మీకు ముఖ్యంగా 'ఆస్టియోపోరోసిస్' అనే వ్యాధి వచ్చే అవకాశం ఉంది. ఇది ఇలాగా వదిలేస్తే చాలా ప్రమాదం" అన్నాడు రిపోర్టులను కాంతంకి చూపించి. "చూశారా ఇది విటమిన్ డి. ఇది బాగా తక్కువగా ఉంది మీకు" అన్నాడు.

"నాకు విటమిన్లన్నీ బాగా ఉండాలని, బలానికి బి కాంప్లెక్సు బిళ్ళలు వేసుకుంటాను బాబూ, ఆకుకూరలు, కాయగూరలు కూడా బాగానే తింటాము, మరెందుకు ఇది తక్కువుందో" అంది కాంతం.

"ఇది వేరేనండి. తక్కిన విటమిన్లలాగా ఇది విరివిగా ఆహారం ద్వారా దొరకదు.

ఇది మన చర్మం తయారుచేసుకుంటుంది. ఇది మన శరీరంలోని ఎముకల ఆరోగ్యానికి చాలా ముఖ్యం" అన్నాడు సూర్యనారాయణ.

"ఏంటీ ఇది చర్మం తయారుచేసుకుంటుందా?" అన్నాడు రమణారావు.

"అవును బాబాయ్, ఈ ఒక్క విటమిన్ మాత్రమే మన శరీరం సొంతంగా తయారుచేసుకుంటుంది.

అయితే అలా చేసుకోవడానికి మన చర్మంపై సూర్యరశ్మి పడాలి. లేకపోతే విటమిన్ డిని మన శరీరం తయారుచేసుకోలేదు.

పైగా ఇది అన్ని ఆహారపదార్థాలలోనూ దొరకదు కనుక మనకు విటమిన్ డి లోపం వచ్చే అవకాశం ఉంది. దానివల్ల ఎముకలు గుల్లబారుతాయి, కండరాల నొప్పులు వస్తాయి, ఇలా చాలా సమస్యలు ఉన్నాయి. అందుకే మనవాళ్ళు సూర్యనమస్కారాలు చేయమన్నారు" అన్నాడు సూర్యనారాయణ.

"నిజమేనబ్బాయ్, మన పూర్వీకులు ఏది చెప్పినా దాని వెనుక మనకు ఎంతో మంచి దాగివుంటుంది" అన్నాడు రమణారావు.

"అబ్బ మీరూరుకోండి. నా ఆరోగ్యం గురించి అడుగుతుంటే మధ్యలో మీరొకరు. ఆయన సంగతి సరేగానీ బాబూ ఈ విటమిన్ డి లేకపోతే ఎముకలు గుల్లబారుతాయి అన్నావు.



## ఉత్తమ నిర్ణయం

మూడేళ్ళనాడు శాకాహారిగా మారాలన్నది తాను తీసుకున్న నిర్ణయాల్లో ఉత్తమమైనది అంటున్నది అనుష్క శర్మ.

"నా ఆహారంవల్ల ఏ జంతువులకూ హాని జరగడంలేదు. చాలా ఆరోగ్యంగా, సంతోషంగా ఉన్నాను" అంటున్న అనుష్క శర్మ జంతువులకు సాయపడడం కోసం అనేక ఇతర కార్యక్రమాల్లోనూ భాగమవుతున్నది. ముంబై సమీపంలో జంతువులకు షెల్టర్ ఏర్పాటుచేసే ప్లాన్‌లో ఉన్నట్లుకూడా ప్రకటించింది అనుష్క శర్మ.



## పాకులాట లేదు

సినీ ప్రాజెక్టులతోనే కాకుండా టెలివిజన్ టాలెంట్‌హంట్‌షో జడ్జిగా బిజీగా వున్న బాలీవుడ్ భామ హ్యూమాఖురేషి తానెప్పుడూ పాపులారిటీ కోసం,తక్షణ విజయంకోసం పాకులాడనని, ఎక్సె లెన్సీని ఛేజ్ చేస్తానని చెప్తున్నది.

"నా ప్రయాణాన్ని మరీ ఎక్కువగా విశ్లేషిస్తూ కూర్చోకుండా, నాకు వచ్చిన అవకాశాలను మంచి టైమ్‌గా భావిస్తుంటాను. టాలెంట్‌ను జడ్జి చేయడమన్నది సులువైన విషయం కాదు. ఇదో కొత్త అనుభవం" అని చెప్పింది.

నాకు కూడా అదే అనుమానంగా ఉంది. ఇప్పుడు నేనేం చెయ్యాలి" అంది కాంతం.

"అస్టియోపోరోసిస్ అని ఒక వ్యాధి ఉంది. దాన్నే 'ఎముకలు గుల్లబారడం' అంటారు. అది గనుక వస్తే ఎముకలు చిన్నచిన్న కారణానికి కూడా విరిగిపోతాయి" అన్నాడు సూర్యనారాయణ. "అంటే మెట్లమీద నుంచి పడడం వంటివా?" అంది కాంతం.

"అంతకూడా అక్కర్లేదు పిన్నీ, ఈ వ్యాధి వల్ల ఎముకల సాంద్రత బాగా తగ్గిపోతుంది. ఒక్కోసారి గట్టిగా తుమ్ము వచ్చినా ఎముకలు ఆ అదాటుకి విరిగిపోయే ప్రమాదం ఉంది. పైగా అతుక్కునే అవ కాశం కూడా లేదు" అన్నాడు.

"ఏంటీ, తుమ్మితే ముక్కు ఊడిందంటారు, అలాగన్నమాట" అన్నాడు రమణారావు ఆశ్చర్యంగా.

"అవును అంతే. కానీ అలాంటి స్టేజికి వెళ్ళకుం డానే మన జీవనసరళిని మార్చుకుని, కాస్త ఎండ పడేలా వ్యాయామాలు చేయడం, నడవడం వంటివి చేస్తుంటే మంచిది బాబాయ్" అన్నాడు డాక్టర్ సూర్య నారాయణ.

"భోజనానికి లేవండి అత్తయ్యా. ఈయనతో పెట్టుకుంటే మనల్ని బాగా భయపెట్టేస్తారు. ఎండలో తిరుగు, ఎండలో తిరుగు నీకు మంచిది అంటూ నన్ను ఒకటే పోరుపెడుతుంటారు.

ఎండ కన్నెరుగని రాజకుమారిఅనేమాట ఈయన వినలేదనుకుంటా. సుకుమారి రాజకుమారి ఎండల్లో తిరిగేదా ఏంటి. మరి అప్పట్లో ఇలాంటి వింతవింత రోగాల గురించి విన్నామా, మీరే చెప్పండి" అంది పద్మనయన నవ్వుతూ.

"అది కాదులే పద్మా, నేను ఒకసారి ఒక వింత విషయం విన్నాను సుమా!" అంది కాంతం. "ఏమిటో ఆ విషయం" అంది పద్మనయన ఆసక్తిగా.

"మా ఊళ్ళో ఒకమ్మాయి నడుస్తూ నడుస్తూ పడి పోయింది. ఆమెను లేపడానికి ప్రయత్నిస్తే విపరీత మైన బాధపడిందట. ఎలాగోలా డాక్టర్ దగ్గరికి తీసు కెళ్తే ఆమె ఎముకలు చాలా చోట్ల విరిగిపోయాయని చెప్పారు డాక్టర్ గారు. ఇప్పుడు అబ్బాయి చెప్పిన పేరే చెప్పి ఎముకలు గుల్ల అయిపోయాయి అన్నారట ఆ డాక్టర్ గారు" అంది కాంతమ్మ.

"నిజమా?!" ఆశ్చర్యంగా అంది పద్మనయన.

"అవును. నిజంగా నిజం" అన్నాడు రమణారావు.

భర్తవైపు ప్రశ్నార్థకంగా చూసింది పద్మనయన. అతను చెప్తుంటే ఏదో పాతకాలం కాన్సెప్ట్ పట్టుకుని వేలాడుతున్నాడు అనుకుంది గాని, అతను చెప్పే సమస్యలు నిజజీవితంలో ఎవరికైనా కలుగుతాయి అనేది ఆమె ఊహించలేదు.

ఇప్పుడు కాంతం చెప్తుంటే ఆమెకు ఒక్కసారి తన ఆరోగ్య పరిస్థితిపైన ఒక సందేహం వచ్చింది.

"ఆకలేస్తుంది, ముందు భోజనాలు చెయ్యండి, ఎప్పుడూ జబ్బుల గురించి మాట్లాడుకుంటే మనసుకి ఏమీ బాగుండదు" అంది కాంతం డైనింగ్ టేబుల్ దగ్గరకు వెళ్తూ.

ఆ రోజు రాత్రి పద్మనయనకు నిద్రపట్టలేదు. తనకు కండరాలలో నొప్పులు అప్పుడప్పుడూ వస్తుం టాయి. అవి తను జిమ్‌కి వెళ్ళి వర్కవుట్‌లు చెయ్య డంవల్ల వస్తున్నాయనే ఉద్దేశ్యంతో ఉంది ఆమె.

అవి గనుక విటమిన్ డి లోపంవల్ల గనుక వస్తే తన ఎముకలు కూడా గుల్లబారిపోయే అవకాశం ఉందా! అలా ఐతే తనకు కూడా తుమ్మితే ముక్కు ఊడటమో, చెయ్యి విరగడమో జరిగే అవకాశం ఉందా! మరుసటిరోజు ఉదయం లేచిన సూర్యనారా యణకు పక్కలో భార్య కనబడలేదు.

ఇంత త్వరగా లేచి ఎక్కడకు వెళ్ళిందిఅనుకుంటూ, తన కాలకృత్యాలు తీర్చుకుని టెర్రస్‌పైకివెళ్ళాడు సూర్యనారాయణ. ఉదయంపూట సూర్యోదయం సమయంలో టెర్రస్‌పైన సూర్యరశ్మి పడుతుండగా సూర్య నమస్కారాలు చేయడం, యోగా చేయడం అతనికి అలవాటు.



## ఎన్నో పాఠాలు

'విశ్వరూపం 2' సినిమాలో నటించడంవల్ల భారతీయ సామాజిక, రాజకీయ చరిత్రగురించి తెలుసుకునే అవకాశం లభించిందని చెప్తోంది ఇండో-అమెరికన్ తార పూజాకుమార్.

'ఏక్ దూజె కేలియే' నాటినుంచి నేను కమల్ సర్ అభిమానిని. ఆయననుంచి ఎన్నో పాఠాలు నేర్చుకున్నాను. జీవనప్రయాణం సుదీర్ఘంగా సాగుతున్నప్పుడు అనేక ఎత్తుపల్లాలను ఎదుర్కో వాల్సివస్తుంది. సినిమాలకోసం ఎంతో కష్టపడ తాం. విడుదలయ్యాక హిట్టా, ఫ్లాపా అనేది డిక్లేర్ అవుతుంది. వైఫల్యం ఎదురైతే ఎన్నో ప్రశ్నల్ని ఎదుర్కోకతప్పదు.

కాని, పరిస్థితులు ఎలా వున్నా దేన్నీ మధ్యలో వదలకూడదు. ఈ పెద్ద పాఠాన్ని నేను కమల్ సర్‌నుంచి నేర్చుకున్నాను" అంటూ వివరించింది భారీ అందాల పూజాకుమార్.

టెర్రస్‌పైకి వెళ్ళిన సూర్యనారాయణకు అక్కడ సూర్యనమస్కారాలు చేస్తున్న పద్మ కనిపించేసరికి ఆశ్చర్యం కలిగింది.

"ఏంటి సంగతి, రాజకుమారి ఎండకు కందిపోతుం దేమో" అన్నాడు నవ్వుతూ.

"నేను 'డాక్టర్ నో ఫీజ్' దగ్గరకు ట్రీట్‌మెంట్‌కోసం వచ్చాను. మీరు కాదులెండి" అంది పద్మనయన.

"మరి ఎవరు?" అన్నాడు నవ్వుతూ.

నవ్వుతూ ఆకాశంలో తూర్పున ఉన్న సూర్యుడిని చూపించింది పద్మనయన.

# నేనెవరో తెలుసా!

భారతీయులకు తమ చరిత్రను సక్రమంగా నమోదుచేసుకోవటం చేతకాదు. అందుకే భారతీయ చరిత్రమీద స్పష్టత కరువైంది.

ఆ భారతీయులలో భాగమైన తెలుగువారికి మరో బలహీనత వుంది. అది తమ భాషా జాతిలోని గొప్పవారిని గుర్తించలేకపోవటం. వారి గురించి స్మరించుకుని గర్వపడకపోవటం.

అందులో తెలుగుజాతికోసమే కాదు మానవ జాతి మొత్తానికీ మేలుచేసిన తెలుగువారున్నారు. అందులో ఒకరు యల్లాప్రగడ సుబ్బారావు.

యాంటీబయాటిక్స్ ఐన ఆరోమైసిన్, టెట్రా సైక్లిన్‌లను కనుక్కున్నవాడు, కణంలో శక్తినిచ్చే ఎ.టి.పి. పనితీరును కనుక్కున్నవాడు,క్యాన్సర్ చికిత్సకి మేథోట్రిక్సేట్‌ని కనుక్కున్న మహానుభావుడు యల్లాప్రగడ సుబ్బారావు. ఆయన పరిశోధనలుచేసిన అమెరికాలో ఆయన్ని గుర్తుపెట్టుకున్నారు.

ఆయన స్థాపించిన లీడర్లీ కంపెనీవారు గుర్తుపెట్టుకున్నారు. కాని తెలుగునాట ఆయనకు తగిన స్థానమే లేదు. అటువంటి గొప్పవాడైన యల్లాప్రగడ సుబ్బారావునే మరచిపోయిన తెలుగువారికి ఆయన ఆ స్థాయికి చేరటానికి ఆర్థిక సహాయం అందించిన ఒక ధార్మిక సంస్థను, దాని స్థాపకుడుగురించి గుర్తుంటుందనుకోలేము.

అయితే ఇటీవలి కాలంలో అటువంటి గొప్పవారిని తమ రాజకీయాలకోసం, తమ కులప్రాతిపదిక రాజకీయ ఎదుగుదలకు వాడుకుంటున్నారు. ఆయన చేసిన ఇతర సేవలు వదిలేసి ఆ ధార్మిక సంస్థ స్థాపకుడి ఆస్తుల విషయంలో మాత్రం పోరాటాలు చేస్తున్నవారు ఉన్నారు.

ఆ ప్రాంతానికి సంబంధంలేకున్నా, కుల నాటకాలు నడిపేవారున్నారు. ఫలితంగా ఆ గొప్ప వ్యక్తి ఆస్తుల వివరాలు బయటకు వస్తున్నాయేగాని నిజానికి ఆయనలోని ముందుచూపు, ఆయన స్థాపించిన వ్యాపార, విద్యాసంస్థలు వాటివల్ల కలిగిన మేలు గురించి మిగిలిన అన్ని వర్గాలు మాట్లాడాల్సిన అవసరం, సమయం నేడు వచ్చింది.

ఎంతో ముందుచూపుతో ఇప్పటికి నూట మూడు సంవత్సరాలక్రితమే ఒక సేవాసంస్థను అందునా విద్య, ఆధ్యాత్మిక అంశాలకోసం స్థాపించాలన్న ఆలోచన చేయటం విశేషం. చదువు విలువ తెలియటానికి ఆయన చదువుకున్నవాడు కాదు.

కాని వ్యాపార దక్షతతో ఆర్జించినది మొత్తం దానధర్మాలకు ఇచ్చేయటానికి ముందుకు వచ్చిన ఆ వ్యక్తిని మరచిపోతే ఎలా! ఆంధ్రదేశానికి తరగని ఆస్తి తీర ప్రాంతం. సముద్రంమీద వ్యాపారం కోసం సుదూర ప్రాంతాలకు వెళ్ళిన చరిత్ర ఆంధ్రులకుంది. తూర్పుతీరంలో నౌకల నిర్మాణం జరిగేది.

యంత్రాలతో నౌకలు నడపని కాలం, తెర చాపలు వేసుకుని నౌకలు విదేశాలకు వెళ్ళే రోజుల్లోనే అందుకు తగిన నౌకలను నిర్మించే కేంద్రాలు నడిపారు నాటి ఆంధ్రులు.

అటువంటి నౌకా నిర్మాణం జరిగే గ్రామంలో, విదేశాలకు నౌకలు నడిపే ఒక సంపన్న కుటుంబంలో పుట్టాడు. ఆయన పుట్టిన తేదీకూడా సక్రమంగా నమోదు అయిందా అన్నది అనుమానమే. అయితే అతను పుట్టేసరికి తండ్రిచేస్తున్న వ్యాపారం దెబ్బతింది. సముద్రం మీదకు వెళ్ళిన నౌకలు మునిగిపోయాయి. సరుకు పోయింది, నష్టాలు వచ్చాయి, అప్పులు మాత్రం మిగిలాయి.

ఆ తర్వాత తండ్రి పోయాడు. చివరికి మేనమామ ఇంటికి చేరాడు తల్లితో సహా. ఆ మేనమామది విదేశాలకు సరుకులు పంపే వ్యాపారమే.

అలా ఒకసారి నౌక సరుకుతో రంగూన్ వెళుతుందని తెలుసుకున్న ఆ కుర్రాడు తాను ఆ నౌకలో ఏదో ఒక పనిచేస్తూ వెళతానని మేనమామను అడిగితే, సరే ఒకసారి వెళ్ళి వస్తే వాడే వ్యాపారధోరణిలో పడతాడు అని అంగీకరించి, ఆ నౌక సరంగుకి ఆ కుర్రవాడి బాధ్యతను అప్పగించాడు.

ఆ చిన్ననిర్ణయమే ఆ కుర్రాడి జీవితాన్ని మార్చివేసింది. నౌక బర్మాతీరానికి చేరేవరకు కుర్రాడు చాలా మర్యాదగానే వ్యవహరించాడు.

కాని ఒక రేవులో నౌక లంగరు వేసి, సరుకులు దించి, ఎక్కిస్తుండగా నెమ్మదిగా నౌకలోనివారి కళ్ళు కప్పి రంగూన్ జనంలో కలిసిపోయాడు.

ఆ కుర్రాడు తప్పిపోయాడని భావించి నెల రోజులు అతనికోసం వెతికారు. తనకు ఆ కుర్రాడి బాధ్యత అప్పగించిన నౌక యజమానికి ఏం సమాధానం చెప్పాలన్నది సరంగు భయం, బాధ.

చివరికి ఆ కుర్రాడు దొరకలేదన్న వార్త ఆంధ్ర తీరానికి మోసుకువచ్చారు.

తన కొడుకు మరణించి వుంటాడేమోనన్న భయంతో గుండె పగిలి తల్లి మరణించింది.

తాను నౌక దిగి వెళ్ళటం ఇంత గందరగోళం సృష్టిస్తుందన్న ఆలోచన లేని ఆ కుర్రాడు రంగూన్‌లోని తెల్లవారి వ్యాపారాలలో సహాయకుడిగా చేరారు. అతగాడి పనితీరు, నిజాయితీ నచ్చి తెల్లవారు ప్రోత్సహించారు. వారికి అవసరమైన పనివాళ్ళను సరఫరా చేసే దళారీ అవతారం ఎత్తాడు.

రెండేళ్ళు తిరిగేసరికి లక్షరూపాయలు సంపాదించి, తిరిగి తెల్లదొరలకే వడ్డీకి డబ్బులివ్వటం చేశాడు. అలా సంపాదించిన డబ్బుతో రెండు ఆవిరి నౌకలను కొన్నాడు. తండ్రి నష్టపోయిన నౌకలను కొడుకుగా సంపాదించి, చేతిలో చిల్లిగవ్వ లేకుండా రంగూన్ వెళ్ళిన ఆ కుర్రాడు లక్షాధికారిగా తిరిగి ఆంధ్ర తీరంలోని తన స్వగ్రామానికి వచ్చాడు.

అతడి విజయం చూసి గ్రామం గ్రామం ఆశ్చర్యపోయింది. ఘనంగా స్వాగతించింది. హాయిగా పెళ్ళిచేసుకుని ఇక్కడే వుండిపొమ్మన్నారు. కాని వారి మాటల్లో మొదటి భాగంమాత్రమే విని,పెళ్ళిచేసుకుని భార్యతో సహా రంగూన్ వెళ్ళిపోయాడు.

అక్కడే వ్యాపారంలో భారీగా సంపాదించాడు. మధ్యలో భార్య పోయింది. పిల్లలు లేరు. ఒక పిల్లాడిని దత్తత తీసుకున్నాడు. వయసు మీద పడుతోంది. తాను అలా ఎదగటానికి కారణమైన సొంత ఊరి మీదికి, తన దేశ తీరం మీదికి మనసు మళ్ళింది. కాని వెనక్కి తిరిగి రాలేకపోయాడు.

రంగూన్‌లోనే మరణించాడు. మరణం తర్వాత విల్లు తెరచి చూస్తే తన దగ్గర 1915 సంవత్సరం నాటికి వున్న 8 లక్షల రూపాయలు ఎలా వినియోగించాలో స్పష్టంగా రాశాడు. స్కూళ్ళు పెట్టి నిర్వహించాలని, పేద పిల్లలకు ఉన్నత, సాంకేతిక విద్యలకు స్కాలర్‌షిప్ ఇవ్వాలని, దేవాలయాలు నిర్మించాలని, పేదలకు అన్నదానం చెయ్యాలని రాశారు.

అలా 1915లో మొదలైంది ఒక ధార్మిక సంస్థ. ఆ సంస్థ సహకారంతోనే యల్లాప్రగడ సుబ్బారావు చదువుకుని అంతటి వాడయ్యాడు.ఆయన వేసిన ఆ విత్తనం, పెద్ద వృక్షమై దాదాపు లక్షా ఇరవై ఐదువేలమందికి చదువు చెప్పింది.

వేదపాఠశాల, కాలేజీలు నిర్వహించింది. విశ్వవిద్యాలయానికి భూదానం చేసింది. ఆయన సొమ్ముతో దాదాపు 4000 ఎకరాల భూమి కొనగలిగారు ధార్మిక సంస్థ నిర్వాహకమండలి. అంత గొప్ప సామాజిక సేవచేశారాయన. ఇంతకీ ఆ

*1. వ్యాపారవేత్త పేరేమిటి?*

*2. ఆయన సొంత ఊరేది?*

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 1 సెప్టెంబర్ 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపికచేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

17.8.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు:
1. గొట్టిపాటి బ్రహ్మయ్య, 2. ఘంటసాల.

**₹ 500/- బహుమతి పొందిన విజేత :**

**విజేత:** కస్తూరి వెంకుబాబు, ఫ్లాట్ నెం.7 సత్య అపార్ట్‌మెంట్, 2/9, బ్రాడీపేట గుంటూరు 522 002.

సీరియల్

# పరదేశి ప్రేమకథ

**“తె**లుసు. కానీ మనం ఈ ఫొటో పట్టుకుని అతని గురించి అడుగుతూ తిరిగితే ఎవరో ఒకరు ఆ విషయాన్ని శర్మిష్ఠకి మోసేస్తారు,

ఇప్పుడు కాకపోయినా మనం వాడి కాళ్ళు విరిచేశాక! దానితర్వాత నువ్వు శర్మిష్ఠని మరిచిపోవలసివస్తుంది” అన్నాడు దత్తు. గట్టిగా నిట్టూర్చాడు బిప్లవ్. పిడికిలి బిగించి గాలిలోకి ఒక పంచ్ విసిరాడు..

అది నిజంగా తగిలితే ఆ ప్రఫుల్ ముఖం పచ్చడైపోతుంది అనుకున్నాడు దత్తు.

“ఒక్కరోజే కదా! వేచిఉందాం. మనం ఎలా వాడిని కార్నర్ చెయ్యాలో కూడా ప్లాన్ చేసుకోవచ్చు.

ఎటాక్ చేయడానికి ఎవరెవర్ని వాడుదామో కూడా ఆలోచించుకోవచ్చు...

రిలాక్స్ దాదా” అన్నాడు దత్తు.

“ఓకె. ప్లాన్ చెయ్. ఎట్టి పరిస్థితిలోనూ వాడిని రేపొక రౌండ్ వెయ్యాల్సిందే” అని అనౌన్స్ చేశాడు బిప్లవ్. అతను డిసైడ్ అయితే మొండిగా ఎటాక్ చేస్తాడు. కొన్నిసార్లు గతంలో అలా జరిగినప్పుడు అవతలివ్యక్తులు అతనికి జడిసి యూనివర్సిటీ వదిలి వెళ్ళిపోయారు బ్రతుకుజీవుడా! అని.

“మన గ్రూప్‌లో లేనివాళ్ళని ఇన్వాల్వ్ చేద్దామనుకుంటున్నాను” అన్నాడు దత్తు.

“సరే! అలాగే చెయ్” అన్నాడు బిప్లవ్.

“దానికి కొంచెం ఖర్చవుతుంది” అన్నాడు దత్తు.

“నో ప్రాబ్లమ్. పనికావడం ముఖ్యం. ఇదిగో డబ్బు” అంటూ తన అల్మరా ఓపెన్‌చేసి డబ్బు తీసి ఇచ్చాడు బిప్లవ్. బిప్లవ్ తండ్రి కోల్‌కతాలో పెద్ద లెదర్ ఇండస్ట్రియలిస్ట్.

వ్యాపారం చేసి ఎడాపెడా సంపాదించాడు. అతనికి డబ్బంటే లెక్కలేదు. కొడుకుకి కావలసినంత డబ్బు అడగకముందే ఇస్తాడు. దాంతో బిప్లవ్‌కి కూడా డబ్బంటే లక్ష్యం లేదు.

అతను ఇచ్చిన డబ్బులు జేబులో పెట్టుకుని, మన స్కెచ్ అంతా నీకు సాయంత్రం చెప్తాను. ఈ విషయం మనవాళ్ళదగ్గర కూడా డిస్కస్ చేయొద్దు” అన్నాడు దత్తు.

అతని మాటలకు కొద్దిగా ఆలోచించి “సరే” అన్నాడు బిప్లవ్. మిగిలిన స్నేహితులు ఏదో సందర్భంలో బయటపడే అవకాశం ఉందని అతనికి కూడా అనిపించింది.

బిప్లవ్ ఇచ్చిన డబ్బులు జేబులో కుక్కుకుని తన రూమ్‌కి వెళ్ళిపోయాడు.

ఒక అరగంటలో తయారైపోయి హాస్టల్‌లోనే మరో రూమ్‌కి వెళ్ళాడు.

అక్కడ ఉన్న అలోక్‌ని కలిశాడు. “ఒక విషయం మాట్లాడాలి అలోక్‌దా” అన్నాడు దత్తు.

“రా, లోపలికొచ్చి కూర్చో” అన్నాడు అలోక్.

“ఒక మనిషిని చావగొట్టాలి” అన్నాడు దత్తు. ఎలాంటి ఉపోద్ఘాతమూ లేకుండా.

“ఎవరు” అన్నాడు అలోక్.

అతనికి తన మొబైల్‌లో ఉన్న పిక్ చూపించాడు దత్తు. “ఓ, ఇతన్ని కళాభవన్ దగ్గర చూశాను” అన్నాడు అలోక్ ఆశ్చర్యంగా.

“నీకెలా తెలుసు?” ఆరా తీశాడు దత్తు.

“ఒకత్తి నన్ను కొట్టి అవమానపరిచింది. అదే, ఆ ట్రైబల్‌ది. దానికి బుద్ధిచెప్పడానికి అవకాశం కోసం చూస్తున్నా. అదికూడా కళాభవన్‌లోనే ఉంటుందిలే. అప్పుడు చూశా వీడిని” అని వివరించాడు అలోక్.

“సరే! టార్గెట్ మిస్ కాకూడదు. రేపే వాడిని ఒక రౌండ్ వెయ్యాలి.వెళ్తే హాస్పిటల్‌కి లేదా స్మశాన్ ఘాట్‌కి. అంతే! మళ్ళీ క్లాసులని, కళాభవన్ అని అనే పరిస్థితి ఉండకూడదు. పని అవగానే గిఫ్ట్ ఉంటుంది” ఆశపెట్టాడు దత్తు.

“డన్” అన్నాడు అలోక్.

అతనికి ఆ పని అప్పచెప్పాక క్యాంటీన్‌కి వెళ్ళిపోయాడు దత్తు.

తన వెనుక తన గురించి ఎవరెవరో సమాచారం సేకరించడం, తనని చితక్కొట్టడానికి ప్రణాళికలు సిద్ధం చేసుకోవడం ఏమీ ఎరుగని ప్రఫుల్ తన పనులు చూసుకుని, శర్మిష్ఠకు మెసేజ్ పంపించాడు, పిజి అకామిడేషన్ అడ్రస్ పంపించమని.

“అడ్రస్ పంపితే చాలా? నేను వచ్చి చూపించవద్దా! ఆ ఇంటివాళ్ళకి నిన్ను పరిచయం చేయొద్దా” అంటూ మెసేజ్ చేసింది శర్మిష్ఠ.

“నువ్వు వస్తానంటే నే వద్దంటానా” అన్నాడు ప్రఫుల్.

కిలకిలా నవ్వింది. “సరే వాళ్ళ వీలు కనుక్కుని నీకు తర్వాత ఫోన్ చేస్తాను. నేను చెప్పినచోటికి వచ్చేస్తే తీసుకునివెళ్ళి ఇల్లు చూపిస్తా” అంది శర్మిష్ఠ.

“ఇల్లు సంగతి సరే, నాకు యూనివర్సిటీ చూపిం

### 7 జరిగిన కథ

ప్రఫుల్ పి.జి.అకామిడేషన్ కోసం బోల్‌పూర్‌కెళ్తాడు బెనర్జీ. తన మిత్రుడైన అమిత్ ఇంటికి ప్రఫుల్, బెనర్జీ వెళతారు.

అమిత్ భార్య రంజిత, ప్రఫుల్‌కి బెనర్జీకి ఆతిథ్యమిచ్చి ఎప్పుడు వీలైతే అప్పుడు తన ఇంటికి రమ్మనమని ప్రఫుల్‌తో చెబుతుంది. అమిత్ ఇంటి నుండి బయలుదేరిన ప్రఫుల్, బెనర్జీలు దారిలో సేన్‌దాదాని కలుస్తారు.

ప్రఫుల్‌వుండటం కోసం ఓ పెంట్‌హౌస్ గురించిన ఇన్ఫర్మేషన్ ఇస్తుంది శర్మిష్ఠ.

రీతూ ద్వారా ప్రఫుల్ ఫొటోను సంపాదిస్తాడు బిప్లవ్. సౌబిక్,ప్రసేన్‌జిత్,దత్తు అంతా కలసి ప్రఫుల్‌ను దెబ్బతీయాలని బిప్లవ్‌తో రహస్యంగా సమాలోచన చేస్తారు.

శర్మిష్ఠ, ప్రఫుల్ ఇద్దరూ తమ సెల్లుల్లో ప్రేమ మెసేజ్‌లు పంపుకుంటూవుంటారు. శంతను సహకారంతో రీతూ పంపిన ప్రఫుల్ ఫొటో, తమకు కావలసిన ప్రఫుల్ ఒక్కరేనా అన్న వేటలో పడతాడు దత్తు.

తర్వాత జరిగింది చదవండి.





చవా?" అన్నాడు ప్రఫుల్. ఏదోవంక పెట్టుకుని ఆమెతో వీలు ఉన్నంత సమయం గడపవచ్చనే ఆశతో.

"యూనివర్సిటీ అంతా నడుస్తావా?" అడిగింది.

"నువ్వెలా చెప్తే అలా" అన్నాడు.

"ఒక పనిచెయ్. మీ హోటల్ వాడికి చెప్పి సైకిల్ రెంట్‌కి తీసుకో. అప్పుడు క్యాంపస్ అంతా హాయిగా తిరగొచ్చు" అంది శర్మిష్ఠ.

ఇదేదో బాగుంది. సైకిల్‌పై అమ్మాయిని ఎక్కించుకుని పాత బ్లాక్ అండ్ వైట్ తెలుగు సినిమాల్లో నాగేశ్వరరావులా డ్యూయెట్‌లు పాడుకుంటూ తిరగొచ్చు, అనుకున్నాడు.

"సరే, ఒక అరగంట ఇవ్వు నాకు. ఈలోగా రెడీ అయిపోతా" అన్నాడు ప్రఫుల్.

"గంట తీసుకో. నేను కూడా తయారవ్వాలిగా" అంది శర్మిష్ఠ.

శ్రీ సదన్ దగ్గర కొత్తగా కట్టిన లేడీస్ హాస్టల్‌లో ఉన్న మేరీ ఆమె మిత్రులు ఉదయాన్నే షటిల్ ఆడుకుని అలాగే డైనింగ్ రూమ్‌కి వెళ్ళారు, బ్రేక్‌ఫాస్ట్ కోసమని. అక్కడ కొంతమంది అమ్మాయిలు వీళ్ళను చూసి నవ్వుతూ పలకరించారు. వాళ్ళలో ఒకామె "మీలో కరాటే ఫైటర్ ఎవరు?" అంది.

"మేరీ ఫ్రెండ్స్ ముఖముఖాలు చూసుకుని మేరీ వైపు చూశారు. మేరీ స్పందించింది. "కరాటే కాదు జూడో! అది నేనే!! జూడోలో స్టేట్ చాంపియన్" అంది గర్వంగా.

"వావ్! సో నైస్ టు నో" అంది ఆమె. తక్కిన అమ్మాయిలంతా కూడా మేరీవైపు ఆరాధనగా చూశారు.

"అది చాలా గొప్ప విషయం. కానీ ఈ క్యాంపస్‌లో కొన్ని చీడపురుగులకు నీమీదే దృష్టి ఉంది. కొంచెం జాగ్రత్తగా ఉండాలి సుమా!" హెచ్చరించింది ఆమె.

"ఎవరు మమ్మల్ని టార్గెట్ చేస్తున్నది. వాళ్ళ పేర్లు చెప్తావా ప్లీజ్" అంది మేరీ.

"ఎందుకు. వాళ్ళ పేర్లు నేనే నీకు చెప్పానని తెలిస్తే వాళ్ళు నిన్ను వదిలి నన్ను పట్టుకుంటారు. నాకు జూడో కాదు కదా కనీసం పరిగెట్టడం కూడా రాదు" అంది ఆమె.

"ఎలా తెలుస్తుంది?" అంది మేరీ.

"ఏం ఎందుకు తెలియదు. ఒక్కసారి మనం మాట్లాడుకుంటే ఆ మాటలు ఇక్కడ ఉన్న ఎవరి చెవినైనా పడతాయి. లేదా ఇక్కడివారు మరెప్పుడైనా మరెవరితోనైనా అంటారు.

అలా ఆ మాటలు వాళ్ళ చెవినిపడేదాకా ఈ క్యాంపస్‌లో తిరుగుతూనే ఉంటాయి. ఆ తర్వాత నా పరిస్థితి ఏమవుతుందో. అందుకే నేను చెప్పను. సారీ" అంది ఆమె నిక్కచ్చిగా.

"మేరీ, ఆమె భయపడుతుంది. మాకు కూడా ఆ విషయం తలుచుకుంటే భయంగానే ఉంటుంది. నిద్రకూడా పట్టడంలేదు.

నిన్ను ఏమైనా చేయాలని చూస్తున్నారు వాళ్ళు. ఒకవేళ వాళ్ళకి నువ్వు దొరకలేదనుకో వాళ్ళకు తేలికగా దొరికే మాలాంటివాళ్ళను పట్టుకుని ప్రతీకారం తీర్చుకుంటే ఏంటి గతి చెప్పు" అంది ఈశా.

"భయం, భయం! ఎందుకు భయం. ఎంతకాలం ఈ భయం. ఏమవుతుంది. మనకు ఏమైనా డ్యామేజి జరిగితే అంతకుమించి వాళ్ళకు దెబ్బ తగిలేలా చేయాలి. అంతేగాని, భయపడుతూ బ్రతకటంకంటే చావు మేలు" అంది మేరీ రోషంగా!

"ఛ, ఛ. అలాంటి మాటలు అనకు.



## అందాల రహస్యం

సౌకర్యపూరితమైన వస్త్రధారణే తన అందాల రహస్యం అంటున్నది అనుపమా పరమేశ్వరన్. అందాన్ని కాపాడుకోవడానికి ఎటువంటి ప్రయత్నాలు చేస్తారని అడిగితే నవ్వులు చిందించింది. "దర్శకుడు ఒక పాత్ర గురించి చెప్పగానే, ఎలా కనిపిస్తే బావుంటుందో ఊహించుకుంటాను.

అందం అంటే స్లీవ్‌లెస్ దుస్తులతో వస్తుందనుకుంటే అదంతా భ్రమ మాత్రమే. పాత్రను పూర్తిగా అర్థంచేసుకుని అందుకుతగినట్లు సిద్ధం కావాలి. సౌకర్యంగా ఉన్నప్పుడే ఆత్మవిశ్వాసం ఉంటుందని మర్చిపోకూడదు. ప్రతికూలపాత్ర చేయాలన్న కోరిక ఉంది" అని చెప్పింది.

నీ ధైర్యం మెచ్చుకోవలసిందే! కానీ అందరికీ నీలాంటి మనో ధైర్యం ఉండదు. అందువలన కాస్త జాగ్రత్తగా ఉండండి.

ఒంటరిగా ఎక్కడకీ వెళ్ళకండి. ఎప్పుడైనా అలా వెళ్ళాల్సివస్తే, నాకు ఫోన్ చేయండి.

నేను నా ఫ్రెండ్స్‌ని తీసుకుని మీకు సాయంగా వస్తాను" అంది ఆమె.

"ఇందాక వాళ్ళ పేర్లు చెప్పమంటే భయపడ్డావు. అంతలోనే ఇంత ధైర్యమా?" అంది మేరీ.

"కావాలని సమస్యలు తెచ్చుకోవడం ఇష్టంలేదు కాని సమస్య వచ్చి మీదపడితే ఊరుకుంటాననుకున్నావా. బెంగాల్ అంటే తెలుసుగా... మా కాళీ!" అంది ఆమె నవ్వుతూ.

మేరీ కూడా నవ్వింది. "ఇక్కడే చదువుకున్న ఇందిరాగాంధీని దుర్గాదేవితో పోల్చారు, బంగ్లాదేశ్ ఆవిర్భావానికి ఆమె కారణమైనప్పుడు" అంది.

"సరే, నా పేరు సాత్రి" అంది అప్పటివరకు వాళ్ళతో మాట్లాడిన ఆమె.

హోటల్‌వాడిద్వారా ఒక సైకిల్ తెప్పించుకున్నాడు ప్రఫుల్. దాన్ని తొక్కుకుంటూ శర్మిష్ఠ చెప్పిన చోటికి బయల్దేరాడు. ఆమె మెసేజిలో 'పాలౌ భవన్' అని రాసింది.అది ఎక్కడ ఉందో అక్కడక్కడా కనుక్కుంటూ వెళ్ళాడు ప్రఫుల్.

ఆమె వస్తానన్న టైమ్‌కి పదినిముషాల ముందే అక్కడకు చేరుకుందామనుకున్నాడు కాని చివరికి అతను పాలౌ భవన్‌కి చేరేసరికి ఆమె వస్తానన్న సమయం అవనే అయింది.

పాలౌ భవన్ అంటే ఏదో పెద్ద భవనం ఉంటుందనుకున్నాడు ప్రఫుల్.

కాని అక్కడ చెట్ల కింద ఒక సిమెంట్ వేదిక, దానికి ఎదురుగా వర్తులాకారంలో కొంచెం తక్కువ ఎత్తులో సిమెంట్ బెంచిలాంటిది ఉంది.

అలాంటివే చుట్టుపక్కల మరికొన్ని బెంచీలు, వేదికలు మరిన్ని చెట్లకింద ఉన్నాయి.

సైకిల్ ఒకపక్కగా స్టాండ్ వేసి వేదిక దగ్గరకు వెళ్ళి అక్కడ కూర్చుని చుట్టూ కలియచూశాడు. ప్రశాంతంగా అనిపించింది.

ఇంతలో కోకిల స్వరంలాంటి స్వరం "హాయ్" అని విన్పించింది. శర్మిష్ఠ వచ్చేసింది అనుకున్న ప్రఫుల్ చటుక్కున తలతిప్పి చూశాడు.

చూసి ఆశ్చర్యపోయాడు. ఎదురుగా కనిపించిన అమ్మాయి సోహిణి. ఆమెను గుర్తుపట్టడానికి కొద్దిగా ఆలోచించాల్సివచ్చింది.

అతను వెంటనే తనను గుర్తుపట్టినట్లు కనబడకపోయేసరికి చిన్నబుచ్చుకుంటూ,

"అదేంటి, అప్పుడే మరిచిపోయారా. ఆర్ట్స్ బ్లాక్ దగ్గర పరిచయం అయ్యారు. నెంబర్ కూడా తీసుకున్నారు. మీ పిక్ తీసుకున్నాను. కానీ మీరే తీసుకోలేదు. అందుకే అనుకుంటా నన్ను గుర్తు పట్టలేదు. అయామ్ సోహిణి" అంది.

ఆమె అంత స్పీడుగా మాట్లాడేసరికి చాలావరకు అర్థంకాలేదు ప్రఫుల్‌కి.

చివర్లో ఆమె చెప్పిన పేరు విని ఫ్లాష్‌లా ఆమెను ఆర్ట్స్ బ్లాక్ దగ్గర కలవడం గుర్తుకువచ్చింది. "ఓహ్, మీరా! సారీ వెంటనే గుర్తుపట్టలేదు. ఇక్కడ చాలా ప్రశాంతంగా ఉంటే మనసు ఎక్కడకో వెళ్ళిపోయింది" అన్నాడు ప్రఫుల్.

అప్పుడే అక్కడకు వచ్చింది శర్మిష్ఠ. ఆమెకూడా సైకిల్‌పైన వచ్చింది. తన సైకిల్ ఒక పక్కగా స్టాండ్ వేసి ప్రఫుల్ దగ్గరకు వచ్చింది.

అతనితోపాటు ఉన్న సోహిణిని చూసి పలకరింపుగా నవ్వింది. కానీ ప్రఫుల్ మనసు ఎక్కడికోపోయింది అనడం విని క్షణకాలంపాటు ఆలోచనలోపడింది.



## చెడును చాటాలి

చెడు జరిగినప్పుడు ఆ విషయాన్ని గట్టిగా చెప్పడం వల్ల తప్పుచేసిన వ్యక్తులను శిక్షించడానికి వీలవుతుందంటున్నది అందాల ఆండ్రియా.

'విశ్వరూపం 2'సినిమాలో ప్రేక్షకుల ముందున్న ఆండ్రియా క్యాస్టింగ్ కౌచ్ గురించి ప్రస్తావిస్తూ "పరిశ్రమలో నాకు ఇప్పటిదాకా చెడు పరిస్థితులు అయితే ఎదురవలేదు.

అందుకు సంతోషపడుతున్నాను. నటన, సంగీతం రెండూ రెండు కళ్ళ వంటివి. దేంట్లో అవకాశం వుంటే, ఆ రంగాన్ని సద్వినియోగం చేసుకుంటా" అని ఫ్రాంక్‌గా చెప్పింది.

"ఎక్కడకు పోయింది మీ మనసు" అని అడిగేసింది శర్మిష్ఠ వెంటనే తేరుకుని.

ఉలిక్కిపడ్డాడు ప్రఫుల్. తానెవరిని కలుసుకోవడం కోసం అక్కడ వెయిట్ చేస్తున్నాడో ఆమే పలకరించిందని తెలుసుకుని అతని కళ్ళు ఆనందంతో మెరిశాయి. కానీ శర్మిష్ఠ అతని ఉలికిపాటుకే ఎక్కువ వెయిట్ ఇచ్చింది.

"సారీ మీరేదో మాట్లాడుకుంటూ ఉంటే మధ్యలో డిస్టర్బ్ చేసినట్లున్నాను" అంది.

"అదేంలేదు. ఇటుగా వెళ్తూ ఈయన ఇక్కడ కనిపిస్తే హాయ్ చెప్పివెళ్దామని వచ్చాను.

మొన్న ఆర్ట్స్ బ్లాక్ దగ్గర కలిశాము" అంది

సోహిణి వాతావరణాన్ని తేలికపరుస్తూ.

"అంతేనా! ఏమైనా ప్లాన్ చేసుకుని కలుసుకున్నారేమో అనుకున్నాను" అంది శర్మిష్ఠ గడుసుగా.

"ఓకే నాకు కొద్దిగా అర్జెంట్ పని ఉంది. మళ్ళీ కలుద్దాం. బై" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయింది సోహిణి. తను అక్కడకు అనుకోకుండా వచ్చినా శర్మిష్ఠకు నచ్చలేదని అర్థమైంది ఆమెకు.

వాళ్ళ మధ్యలో అనవసరమైన చిచ్చుపెట్టడం ఎందుకులే అనుకుంటూ వెళ్ళిపోయింది. "వాట్ ప్రఫుల్ బాబూ, నేను రావడం ఆలస్యం అయితే ఇంకెవరో అమ్మాయితో మాట్లాడుతారా" అంది శర్మిష్ఠ నవ్వుతూ.

ఆమె ముఖంలోని నవ్వు తెచ్చిపెట్టుకున్నదని అర్థం అయింది ప్రఫుల్‌కి. ఆమె గొంతులోని జీర కూడా అతనికి అర్థమయింది.

"అయామ్ రియల్లీ సారీ! తను ఎవరో కూడా మర్చిపోయాను" అంటూ జరిగిన విషయం పూస గుచ్చినట్లు వివరించాడు. అంతా విన్నాక శర్మిష్ఠ మనసు కుదుటపడింది.



**రాజకీయాలను సభ బయటే వదిలి రాజ్యసభలోకి వచ్చి చర్చలు సజావుగా జరపటంపై దృష్టిపెట్టాలి.**
**-వెంకయ్యనాయుడు, ఉపరాష్ట్రపతి**



**మీ ఆసక్తి, లక్ష్యంపై గురిపెడితే చాలు... ఆపై డబ్బు వచ్చిపడుతూనేవుంటుంది.**
**-అరవింద్ కేజ్రీవాల్, ఢిల్లీ సి.ఎమ్.**

అందరి అబ్బాయిల్లాగా ఈ ప్రఫుల్ కూడా చంచల స్వభావంతో ఉంటాడేమో అని అనుమానం వచ్చింది ఆమెకు.

అది తొలగి మళ్ళీ మామూలు అయింది. "లేదు నేనే సారీ చెప్పాలి. పూర్తిగా తెలుసుకోకుండా మిమ్మల్ని ఇబ్బందిపెట్టినందుకు" అంది.

"అవన్నీ వదిలెయ్. నువ్వేంటి సైకిల్ తీసుకునివచ్చావు. నేనింకా సైకిల్‌పైన ఎక్కించుకుని శాంతినికేతన్ మొత్తం తిప్పుదామనుకున్నాను" అన్నాడు ప్రఫుల్.

"ఇంకా నయం. అలాగాని చేస్తే, ఇక నాలుగు రోజులు కాళ్ళు పట్టి మంచంమీద నుంచి లేవకుండా ఉండేవారు. నా బరువు ఎంతో తెలియక ఏదో ఊహించుకున్నారు. ఛలో ఛలో క్యాంపస్ మీకు పరిచయం చేస్తాను" అంది శర్మిష్ఠ అక్కడ నుంచి వెళ్ళడానికి ఉద్యుక్తురాలవుతూ.

"అలాకాదు. ఈ వేదిక మీద ఒక్కసారి కూర్చుని ఇలా ఈ పరిసరాలు చూడు.

ఎంత బాగుందోకదూ. మనసంతా ఎక్కడకో తేలిపోతుంది" అన్నాడు ప్రఫుల్.

అతని ముఖంలోకి గాఢంగా చూస్తూ అతని పక్కనే కూర్చుని కళ్ళు మూసుకుంది ధ్యానం చేస్తున్నట్లు. ఆమె మూసిన కళ్ళు కలువరేకులను గుర్తుకు తెచ్చాయి. ప్రఫుల్‌లోని చిత్రకారుడు మేల్కొన్నాడు.

ఆమె ముఖంలో ప్రతిఫలిస్తున్న సౌందర్యం, సౌకుమార్యం అతన్ని సమ్మోహనపరిచాయి. అలా ఆమెనే చూస్తూ ఉండిపోయాడు.

కొద్దిసేపటికి కళ్ళు తెరిచింది శర్మిష్ఠ.అతని చేయి పట్టుకుని "అవును ఇక్కడ చాలా ప్రశాంతంగా ఉంటుంది.దీన్నే పాఠా భవన్ అంటారు.

ఇక్కడ టీచర్ కూర్చుంటారు. ఆ సిమెంట్ బెంచి పైన విద్యార్థులు కూర్చుని ఉంటారు. ఓపెన్ స్కూల్ సిస్టమ్ అంటూ శాంతినికేతన్ విద్యాబోధన పద్ధతికి ఇవే మూలరూపాలు" అంది శర్మిష్ఠ.

అతని కళ్ళల్లోకి చూస్తూ అతని చేయి పట్టుకుని అలా ఆమె మాట్లాడుతూ ఉంటే ప్రఫుల్‌కి ఆమె తప్ప ఈ లోకంలో మరేమీ కనబడలేదు.

అతని కళ్ళు ఆమెను మాత్రమే చూడగలిగాయి.

అతని మనసంతా ఆమె రూపమే అలా నిండిపోయింది. తన చేయిని పట్టుకున్న ఆమె చేతిని రెండవ చేత్తో పట్టుకుని మైమరిచిపోయాడు.

"మొదటి తరగతి నుంచి పదవతరగతి వరకు ఇలా క్లాసులు జరుగుతాయి. ఈ చెట్లు ఎక్కడానికి ఇక్కడ ఆడుకోవడానికి పిల్లలకు అడ్డుచెప్పరు. అయితే ఇంటర్వెల్‌లో మాత్రమే అలా వదులుతారు" అంది శర్మిష్ఠ.

"పాఠా' భవన్ అంటే పెద్ద భవనం ఉంటుందని అనుకున్నా. కానీ ప్లెజంట్ సర్‌ప్రైజ్" అన్నాడు ప్రఫుల్. అక్కడనుంచి సొగసుగా లేచింది శర్మిష్ఠ.

అతని చేయిపట్టి తనవెంట తీసుకువెళ్తూ "రా ఇంకా చాలా విశేషాలు ఉన్నాయి ఇక్కడ. నీకు చూపిస్తాను" అంది శర్మిష్ఠ.

చేతిలోచేయికలుపుకునివాళ్ళిద్దరూఅలానడుస్తూ ఉంటే దేవలోకం నుంచి దిగివచ్చిన గంధర్వులు ఉద్యానవనవిహారం చేస్తున్నట్లుగా ఉంది.

సైకిల్ దగ్గరకు తీసుకెళ్ళి అప్పుడు అతని చేతిని విడిచిపెట్టింది. "పద నిన్ను ఉత్తరాయణ కాంప్లెక్స్‌కి తీసుకెళ్తా" అంది శర్మిష్ఠ.

ఇద్దరూ పక్కపక్కనే సైకిళ్ళు తొక్కుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ వెళ్ళారు.

"ఇదే ఉత్తరాయణ కాంప్లెక్స్. ఇందులో అయిదు భవనాలు ఉంటాయి. చూడు" అంటూ సైకిల్ ఒక పక్కగా పెట్టింది శర్మిష్ఠ.

తన సైకిల్ కూడా ఆమె సైకిల్‌కి పక్కనే పెట్టి ఆమె వెనుక నడుచుకుంటూ వెళ్ళాడు ప్రఫుల్.

వాళ్ళు లోపలికి వెళ్ళగానే ఎడమచేతివైపు ఒక భవనం కనిపించింది. "దీన్నే 'విచిత్ర' అంటారు.దీన్ని 'రబీంద్రభవన్' అని కూడా పిలుస్తారు. ఇది టాగోర్ మరణాంతరం కట్టింది. అందువల్ల ఇది ఆయన స్వయంగా వాడినది కాదు. దీనిలో టాగోర్‌కి చెందిన వస్తువులు ఉన్నాయి" అంది శర్మిష్ఠ.

దానిపక్కనే ఉన్న ఒక పెద్దభవంతిని చూపించి, "ఇది 'ఉదయన', దీని తర్వాతది 'కోణార్క', దాని తర్వాత మట్టితో కట్టిన కుటీరంలాగుంది చూడు దాన్ని 'శ్యామలి' అంటారు.

ఆ తర్వాత పుణశ్చ, దాని పక్కనే ఉదిచి ఉన్నాయి. వీటన్నిటితోనూ టాగోర్‌కి తన జీవితకాలంలో ఏదో ఒక సంబంధం ఉంది.

ఆ సంబంధాన్ని గుర్తుకు తెచ్చే వస్తువులతో అక్కడ మ్యూజియంలా ఏర్పాటు చేశారు" ఆ భవనాల సముదాయాన్ని ఆశ్చర్యంగా చూశాడు ప్రఫుల్.

"ఈ ఉదయనలోనే టాగోర్‌కి ఆయన ఆఖరి జన్మదినోత్సవం జరిగింది 1941లో. ఇక్కడ నుంచే ఆయన కోల్‌కతాకి తన ఆఖరి ప్రయాణం చేశారు. దానికి గుర్తుగా ఇక్కడ రైల్వేవారి సెలూన్ అని పిలిచే ప్రత్యేకమైన కోచ్ ఉంది ఇక్కడ.

అలాగే కోణార్క కూడా చాలా విశిష్టమైనది. 'దీనబంధు'అని పిలవబడే సి ఎఫ్ ఆండ్రూస్ ఇక్కడ నివసించాడు" అంది శర్మిష్ఠ.

ఆనాటి విషయాలను ఆమె చెప్తున్నప్పుడు ఆమె కళ్ళల్లో కనబడే వెలుగుచూసి ఆమెకి టాగోర్ అన్నా శాంతినికేతన్ అన్నా చాలా అభిమానం అని గ్రహించాడు ప్రఫుల్.

"శ్యామలి కూడా ఒక కుటీరమే. కానీ చాలా ప్రత్యేకమైనది, విశిష్టమైనదీను. దీనిలో రబీంద్రనాథ్ టాగోర్ ఒక సంవత్సరంపాటు ఉన్నారు. దీంట్లో గాంధీజీ కూడా కొంతకాలం ఉన్నారు.

దీన్ని సుందరంగా తీర్చిదిద్దడానికి నందలాల్ బోస్, రామ్ కింకర్ బైజ్ తమ విద్యార్థులతో కలిసి పనిచేశారు తెలుసా" అంది శర్మిష్ఠ.

"చాలా ఆసక్తికరంగా ఉంది ఇక్కడ ఈ కార్ ఉంది అది ఎవరిది?" అడిగాడు ప్రఫుల్.

"అది హంబర్ 1933 మోడల్ కార్. టాగోర్ చివరికాలంలో దీనిలోనే ఎక్కువగా తిరిగేవారు.

జీవితంలో ఆయన ఉపయోగించిన ఏకైక కార్ ఇది. యూనివర్సిటీ అధికారులు దీన్ని రిపేర్‌చేయించి మళ్ళీ దీన్ని రోడ్డుపై నడిచేలా చేయాలనుకుంటున్నారు" అంది శర్మిష్ఠ.

"గ్రేట్ కదా! దీన్ని ఇలాగే వదిలేసి తుప్పుపట్టేలా





స్వాతి సపరివార పత్రిక

## స్పందించరా...

తన మనస్సుకు నచ్చినట్లు ముక్కుసూటిగా మాట్లాడటంలో బాలీవుడ్ భామ కంగనా రనౌత్ తొలివరసలో వుంటుంది. సామాజిక సమస్యలపై స్పందించని తోటి నటీనటుల వైఖరిపై ఈసారి విమర్శల వర్షం కురిపించింది.

"స్టార్‌డమ్ అనేది ప్రేక్షకులు ఇచ్చినదే. అటువంటివారిపక్షాన అవసరమైనప్పుడు నిలబడి మాట్లాడకపోతే సాధిస్తున్న విజయాలకు అర్థమే ఉండదు. మాకు లేని సమస్యల గురించి మేమెందుకు మాట్లాడాలని నా ముందే అన్న తారలున్నారు. ఇటువంటి వ్యాఖ్యలు నన్ను నొప్పించాయి. ఈ దేశంలో పుట్టి ఈ దేశప్రజలు ఇచ్చిన స్టార్‌డమ్‌ని అనుభవిస్తూ, వారి సమస్యల గురించి మాట్లాడకపోవడం దారుణం" అంటూ వేడిగా, వాడిగా స్పందించింది కంగనారనౌత్.

చేసేస్తే ఒక మంచి జ్ఞాపకాన్ని చేజేతులా దూరం చేసుకునేవాళ్ళం మనం" అన్నాడు ప్రఫుల్.

అతని ఫీలింగ్ గమనించిన శర్మిష్ఠ అతని చేతిని సుతారంగా పట్టుకుని చిన్నగా నొక్కి వదిలింది.

మరో గంటసేపు అక్కడే గడిపిన తర్వాత "నాకు కొద్దిగా అర్జెంట్ పని ఉంది. నువ్వు సాయంత్రం నేను చెప్పిన చోటికి వస్తే నీకు పిజి అకామిడేషన్ చూపిస్తాను, సరేనా" అంది శర్మిష్ఠ.

"సరే" అన్నాడు ప్రఫుల్.

అతనికి బై చెప్పి శర్మిష్ఠ వెళ్ళిపోయింది. తన సైకిల్‌పై క్యాంపస్‌లో అలా కొన్ని చోట్ల తిరిగి లంచ్ చేయడానికి హోటల్‌కి వెళ్ళాడు ప్రఫుల్.

సాయంత్రం నాలుగు గంటలకు శర్మిష్ఠనుంచి మెసేజ్ వచ్చింది ప్రఫుల్‌కి.

"హాయ్. నేను ఒక అడ్రస్ పంపుతాను. అక్కడకు వెళ్ళి పిజి అకామిడేషన్ గురించి అడుగు. నీకెలా తెలిసింది అంటే బెనర్జీ సార్ స్టూడెంట్‌ని అని చెప్పు. నా పేరు మాత్రం చెప్పకు సుమా" అని ఉంది ఆ మెసేజ్‌లో.

దాని తర్వాత మరో మెసేజ్ వచ్చింది. దానిలో అవనీష్ ఛటోపాధ్యాయ్ పేరున ఉన్న అడ్రస్, అతని మొబైల్ నెంబర్ ఉంది. అది చదివి తనకి ఎలా తెలిసింది అంటే, శర్మిష్ఠ పేరు ఎందుకు చెప్పకూడదు అని ఆలోచించాడు.

తమ మధ్య పరిచయం ఉన్న విషయం అందరికీ తెలియడం ఆమెకి ఇష్టం లేదేమో. అదే ఫ్యాకల్టీ మెంబర్ పేరు చెప్తే వాళ్ళు తన గురించి ఎంక్వయిరీ చేసినా ఆయన రికమెండ్ చేస్తాడు కాబట్టి అది సేఫ్. బాగానే ముందుచూపుతో ఆలోచించింది.

అందుకే తనతో రాకుండా తనొక్కడినే వెళ్ళమంది అనుకున్నాడు. టీ తాగి రెండు బిస్కట్స్ తిని సైకిల్ ఎక్కాడు. నడకకంటే సైకిల్ బాగుండటంతో ఆ రోజంతా సైకిల్ ఉంచుకుంటానని ముందేచెప్పాడు హోటల్ వాళ్ళతో. జిపిఎస్ పెట్టుకుని గూగుల్ మామ సాయంతో ముందుకు సాగిపోయాడు.

టెక్నాలజీ సాయం ఉండటంతో భాష తెలియని చోట డైరెక్షన్స్ అడిగి ఇబ్బందిపడే అవసరం లేకపోయింది. సరైనదారిలో నడిపించుకుపోతుంది టెక్నాలజీ!

వెళ్ళాల్సిన ఏరియాకి పావుగంటలో వెళ్ళిపోయాడు ప్రఫుల్. అక్కడ కొద్దిగా ఇబ్బంది అనిపించింది. ఎవరైనా స్టూడెంట్‌లా కనిపిస్తే సాయం అడుగుదామనుకున్నాడు. ఒక చిన్ని దుకాణం ముందు సిగరెట్లు కొంటూ ఒక యువకుడు కనిపించాడు.

అతనికి దగ్గరగా వెళ్ళి సైకిల్ ఆపాడు ప్రఫుల్. "ఎక్స్‌క్యూజ్ మీ" అన్నాడు మర్యాద మేళవించిన స్వరంతో.

అప్పుడే కొనుక్కున్న సిగరెట్ నోటిలో పెట్టుకుని దుకాణంవాడు ఇచ్చిన లైటర్‌తో సిగరెట్ వెలిగించబోతున్నాడు ఆ యువకుడు.

తన పక్కనే సైకిల్ ఆగడం, తనతోనే మాట్లాడడం గమనించి తల ఎత్తి పైకి చూశాడు. ప్రఫుల్ ముఖంలోకి చూడగానే అతని నోటిలోని సిగరెట్ దానంతట అదే జారిపోయింది, అతని నోరు ఆటోమేటిక్‌గా పెద్దగా తెరుచుకోవడం వల్ల.

అతని ముఖంలో తననుచూసి కలిగిన ఆశ్చర్యం ప్రఫుల్ పట్టించుకోలేదు. తనకు అడ్రస్ పైన వచ్చిన సందేహాన్ని అతనితో అడిగాడు.

తను వెళ్ళవలసిన వీధి అదేనా, తను వెతుకుతున్న



## ఊతపదం

మలబారు మగువ నివేదా థామస్ ఓ పక్క చదువును, ఇంకోవైపు కెరీర్‌ను బహుచక్కగా కొనసాగించుకుంటున్నది.

నవ్వుతూ, నమ్రతగా మాట్లాడే నివేదా థామస్ తన మాటల్లో తరచూ ఓ పదం వాడుతుంటుందట. చిన్నప్పటినుంచి ప్రతి నాలుగు మాటల్లోనూ ఓ 'హ్యాపీ' పదం దొర్లేదట. ఇప్పుడది తెలుగులోకి మారి 'సంతోషం' అంటోందట.

"నాకిప్పుడు 'సంతోషం' అన్నమాట ఊతపదం అయిపోయింది. ఇప్పుడన్ని భాషల్లోనూ సంతోషానికి అర్థం తెలుసుకునే ప్రయత్నాలు చేస్తు న్నా" అంటూ సంతోషంగా నవ్వేసింది.

బిల్డింగ్ ఎక్కడ అంటూ అడిగాడు ప్రఫుల్.

"ఇదే, ఇదే. కుడివైపున ఉన్న నాలుగో బిల్డింగ్" అని చెప్పాడు అతను.

"థ్యాంక్స్ అండ్ సారీ ఫర్ యువర్ సిగరెట్" అంటూ వెళ్ళిపోయాడు ప్రఫుల్.

వెళ్తున్న ప్రఫుల్ వైపే చూస్తూ ఉండిపోయాడు అతను. ప్రఫుల్‌పైన ఎలా ఎటాక్ చేయించాలో ప్రణాళిక వేస్తున్న దత్తుయే అతను. ఇలా అనుకోకుండా ప్రఫుల్‌ని తన కళ్ళెదుట చూసి షాక్ అయిపోయాడు. అంతకుమించి అతన్ని ఆ వీధిలో చూడడం,

ఆ అడ్రస్ కోసం వెతుకుతూ రావడం చూసి మరీ షాక్ అయిపోయాడు. వెంటనే మొబైల్ తీసి బిప్లవ్‌తో మాట్లాడాడు.

**ఇంకా ఉంది**

# WhatsApp

మనిషిదీపంలాగానైనా వెలగాలి లేదా అద్దంలా అయినా వుండాలి.
అందరూ దీపాలు కాలేకపోవచ్చు.
కనీసం అద్దంలా అన్నా కావాలి. తనకున్న జ్ఞానాన్ని పదిమందికీ పంచిపెట్టాలి.

⩓

శిష్యుడు : నేను దేవుడిని ఎక్కడ చూడగలను?
గురువు : ఆయన నీ ఎదురుగానే వున్నాడు.
శిష్యుడు : మరి నాకెందుకు కనబడటంలేదు?
గురువు : తాగుబోతుకు ఇల్లు ఎదురుగా వున్నా కనపడదుగదా?
అలాగే నీ మనసంతా నిండిపోయిన కామ, క్రోధాదులవల్ల భగవంతుడు కనిపించడు.

⩓

దేవుని సందేశాన్ని మనకు అందించే,వ్యక్తులను అనుసరించటం మతం. సందేశాన్ని పాటించటం అంటే ఆధ్యాత్మికత.

⩓

భగవంతుడు నిన్ను చీకట్లోకి నెట్టేశాడని బాధపడకు. ఆయన నిన్ను భూమిలోపల విత్తనంలా నాటాడు, మొలకెత్తి మహావృక్షమవ్వాలని.

⩓

భగవంతునికి, నీ కష్టాలెంత పెద్దవో చెప్పవద్దు. నీకష్టాలకు, భగవంతుడెంత గొప్పవాడో చెప్పు.

⩓

చింతపడడంవల్ల రేపటి కష్టాలు తొలగిపోవు. నేటి మనశ్శాంతి దూరమవుతుంది.

⩓

రామాపురంలో లక్ష్మీపతి, విద్యాపతి అనే ఇద్దరు వ్యక్తులు నివసించేవారు.
లక్ష్మీపతికి చెప్పలేనంత డబ్బువుంది. విద్యాపతి గొప్ప పండితుడు.
లక్ష్మీపతికి, విద్యాపతి పాండిత్యానికి ప్రజలిచ్చే గౌరవం చూస్తే అసూయ.
విద్యాపతికి లక్ష్మీపతి డబ్బు చూస్తే ఏడుపు.
దాంతో వారిద్దరి మధ్య ద్వేషం పుట్టింది. పెరిగి మర్రిచెట్టులా తయారయ్యింది.
ఇద్దరూ ఎదుటివారిపై గెలుపుకోసం ఓ అడవిలో నదికి ఈ పక్కన ఒకరు, ఆ పక్కన ఒకరు తపస్సు తీవ్రంగా చేశారు.
లక్ష్మీపతికి దేవుడు ప్రత్యక్షమయ్యాడు, "ఏం కావాలన్నాడు" నా శత్రువుకు ముందు వరం ఇవ్వు. "అతను కోరిన దానికి నాకు రెట్టింపు ఇవ్వు" అని కోరాడు.
దేవుడు విద్యాపతికి ప్రత్యక్షం అయ్యి విషయం అంతా చెప్పి ఏం కావాలన్నాడు.
అప్పుడు విద్యాపతి "నాకు ఒక కన్ను పోగొట్టు" అని వరం కోరాడు. దాంతో అతనికి ఒక కన్ను పోయింది.లక్ష్మీపతికి రెండు కళ్ళూ పోయాయి.
నీతి : అసూయవల్ల నాశనమే తప్ప లాభం వుండదు. మనకున్నది ఇతరులతో పంచుకుంటే అందరం సుఖంగా వుంటాం, అంతేకాని, ఎదుటివాడికుంది, నాకులేదు అన్న "రెండు చింతలు" మనిషిని నాశనం చేస్తాయి.
అసూయ లేకపోవటమే "అహింస" అంటారు స్వామీ వివేకానంద.

⩓

గతంతో వర్తమానం సంఘర్షిస్తూవుంటే, భవిష్యత్తు పాడైపోతుంది.
గతం గురువై, వర్తమానం శిష్యుడైతే భవిష్యత్తు భేషుగ్గా వుంటుంది.

⩓

చదువు అంటే మనకు అవసరమైనదని తెలుసుకోవటం. జ్ఞానం అంటే "మనకు అక్కరలేని దానిని వదులుకోవటం"

---

- రిటైర్ అయి ఇంట్లో కూర్చున్న భర్తలను హోమియోపతి (Home + O + Pati) అంటారు. భర్త ఎంత ఆలస్యంగా వచ్చినా, భార్య ఇంటికి రానిచ్చే ప్రక్రియని అల్లోపతి (Allow + O) + Pati) అంటారు.
- స్త్రీ భర్తతో సుఖపడాలంటే వారిని తక్కువగా ప్రేమించాలి, ఎక్కువ అర్థంచేసుకోవాలి. భర్త భార్యతో సుఖపడాలి అంటే, ఆమెను ఎక్కువ ప్రేమించాలి. అర్థంచేసుకోవటానికి ప్రయత్నించకూడదు?
- మనసు కోతిలాంటిది. ఎల్లప్పుడూ ఇటూ అటూ కదులుతూనే ఉంటుంది. కోతికి అరటిపండు ఇస్తే ఎలా ఒకచోట బుద్ధిగా కూర్చొని తింటుందో అలా, మనసుకు ధ్యానాన్ని అలవాటుచేయాలి. ధ్యానంవల్ల మనసుకు నిలకడవస్తుంది.
- "అన్నీ మనమనుకున్నట్లు జరిగితే, మనకు మనశ్శాంతి లభిస్తుంది" అంటుంది అహంకారం. అలాగే "నువ్వు గనుక ప్రశాంతంగా వుంటే, అన్నీ సరవుతాయి" అంటుంది మనలోని ఆత్మ.
- వ్యక్తులు నీతో ఎలా ప్రవర్తిస్తారన్నది వారి కర్మకి సంబంధించిన విషయం. దానికి నీవెలా స్పందిస్తావో అది నీ కర్మకు సంబంధించిన విషయం.
- కదిలితే శరీరం, కదలకపోతే మనసు రెండూ మేలుచేస్తాయి. ◆




Courtesy : VANITHA

# అమ్మకు లేవు హద్దులు

ఒక్కొక్కరిది ఒక్కో పేరెంటింగ్ స్టయిల్. ఉద్యోగినులైన అమ్మలైతే పిల్లల పెంపకం విషయంలో తమదైన సౌలభ్యాన్నిబట్టి సాగుతుంటారు. అవి చూపరులకు నచ్చవచ్చు, నచ్చకపోనూవచ్చు. నచ్చలేదని ఏదోక వ్యాఖ్యానం చేస్తే, అవి అమ్మపై తీవ్ర ప్రభావం చూపుతాయి.

పిల్లలకు విరేచనాలవంటివి అయినా, ఒళ్ళు వెచ్చబడినా, పాలు తాగకపోయినా, కొద్దిగా చిక్కిపోయినా సరిగ్గా చూసుకోలేకపోయిందన్న కామెంట్లు వినపడతాయి. ఇవన్నీ అమ్మను నొప్పిస్తాయి. గిల్టీగా ఫీలవుతుంది. ఒక్కోసారి తోటి అమ్మలే మరో అమ్మ పేరెంటింగ్ స్టయిల్‌ను విమర్శిస్తారు.

ఇవన్నీ ఆమెలోని పేరెంటింగ్ కాన్ఫిడెన్స్‌ను దెబ్బ తీస్తుంటాయి. ఉద్యోగ బాధ్యతలు వద్దనుకుంటారు కూడా. నిజానికి మహిళలు ఉద్యోగం చేయాలి.

స్వతంత్రంగా వుంటూ, తమ అభిరుచులు, ఆసక్తులను అనుసరిస్తుండాలి. ఇటువంటి మహిళల పెంపకంలో పెరిగిన పిల్లలుకూడా స్వతంత్ర భావాలతో, బాధ్యతగా వ్యవహరించడమేకాకుండా తమ తల్లుల పట్ల, వారి సమయంపట్ల గౌరవంగావుంటారు.

తమ అమ్మకూ లక్ష్యాలున్నాయని, ఆమె సమయానికి విలువ ఇవ్వాలని, తమ జీవితాల్లో అమ్మ సమక్షం ఎంతో విలువైనదని గ్రహిస్తారు.

కాబట్టి, తాము ఇంట్లో అనుక్షణం వారిని కనిపెట్టుకుని లేకపోవడంవల్ల వారికేదో జరిగిందనో, జరుగుతుందనో న్యూనతాభావానికి లోనవ్వాల్సిన పని అస్సలు లేదు. అమ్మలపట్ల వ్యతిరేక వ్యాఖ్యానాలు ఎక్కడైనా వినిపిస్తుంటాయి. వాటిని ఎలా ఎదుర్కోవాలో తెలిస్తే చాలు.

## అమ్మ'మ్మ'ల అవసరం

కుటుంబంలోని పెద్దవాళ్ళ విశ్లేషణ చాలాముఖ్యం. అమ్మ తన తల్లిదండ్రులతో సకల విషయాలూ చర్చించవచ్చు. కుటుంబసభ్యులతో ముఖ్యంగా మన దేశంలో ప్రతి విషయమూ బహిరంగంగా చర్చించుకునే అవకాశం ఉంటుంది.

స్తన్యం నుంచి బాటిల్ ఫీడింగ్ దాకా, దుస్తుల నుంచి డైపర్ల వరకు ఏ విషయంలోనైనా అమ్మా, అమ్మమ్మలు సలహాలిస్తారు. వాళ్ళకు తమ కూతురి అలవాట్లు, ఆసక్తులు అన్నీ తెలుసు. పేరెంటింగ్‌ను అంచనా వేయడంలో వాళ్ళు ముందుంటారు.

విమర్శలైనా, ప్రశంసలైనా వారినుంచి నిక్కచ్చిగా వస్తాయి. ఇతరుల అనవసర వ్యాఖ్యానాలతో బెంబేలెత్తే అమ్మలు ఇంట్లోనివారినుంచి సరైన సలహాలు తీసుకోవాలి. ఎందుకంటే వాళ్ళే నిష్పాక్షికంగా తమ బిడ్డల పెంపకాన్ని అంచనా వేయగలుగుతారు.

## పెంపకం ఓ కళ

భారతీయ కుటుంబవ్యవస్థలో అనుబంధాలు ఎక్కువ. కుటుంబసభ్యులందరూ సన్నిహితంగా వుంటారు. వ్యక్తిగత అభిప్రాయాలు, ముఖ్యంగా పిల్లల పెంపకానికి సంబంధించి అమ్మలకు స్వంత అభిప్రాయాలకు తావుండదు. ఇది కొత్త అమ్మల ఒత్తిడికి కారణం అవుతుంటుంది.

పెంపక విషయాలు చర్చలకు దారితీస్తుంటాయి. వ్యక్తిగతమైన అభిప్రాయాన్ని నెమ్మదిగా, మృదువుగా వివరించాలి. ఇతరుల అభిప్రాయాలను తోసిపుచ్చుతూనో, అవమానపరుస్తూనో మాట్లాడకూడదు.

ఫలానా పనిని ఎందుకు చేస్తున్నామో కుటుంబ సభ్యులకు తెలియజెప్పాలి. అది డాక్టర్‌సలహా కావచ్చు లేదా ఇతర పిల్లలకు తన బిడ్డ అలవాటు భిన్నమైనది కావచ్చు. ఏది ఏమైనా కాని పిల్లల పెంపకానికి సంబంధించినంతవరకు ఇంట్లో మిగతా కుటుంబసభ్యులతో వీలైనంతవరకు సామరస్యంగా వుంటేనే ప్రశాంతత సాధ్యపడుతుంది.

పిల్లల్ని ఎలా, ఏ తీరులో పెంచాలనుకుంటున్నారో, అదే వ్యవహారానికి సంబంధించి ఇతర కుటుంబ సభ్యులకు వివరించాలి. దుస్తులు మార్చడం, స్నానం చేయించడం వంటి చిన్నచిన్న విషయాలైతే వాటిని అస్సలు పట్టించుకోవద్దు. పిల్లల పెంపకంలో అమ్మ

## అమ్మ రక్షణలో

**స్తన్యం :** కొన్నిసార్లు కొన్నికారణాలరీత్యాపూర్తి స్థాయిలో స్తన్యాన్ని ఇవ్వలేకపోవచ్చు.

జీవనస్థాయి అంశాలవల్ల కాని, వైద్య కారణాల రీత్యా కాని ఇవ్వలేకపోవచ్చు. దానిగురించి ఆందోళనలు, చర్చలు అవసరం లేదు.

**లావు సన్నం :** ఏ తల్లీకూడా కావాలని, ఉద్దేశ్యపూర్వకంగా పిల్లల ఆహారం విషయంలో అశ్రద్ధ చూపదు. తిండి సరిగ్గాపెట్టకపోవడమో,

ఎక్కువ పెట్టడమోలాంటివి కావాలని ఏ అమ్మా చెయ్యదు. కాబట్టి సన్నగావున్న పిల్లల్ని చూసినప్పుడో, లావుగా వున్నవారిని చూసినప్పుడో నుదురు చిట్లించడాన్ని మానేయాలి. పిల్లల బరువు, ఎత్తు, ఆరోగ్యాల గురించి వైద్యుడిని సంప్రదించి సలహాలు తీసుకోవాలి కాని, ఇతరుల వ్యాఖ్యానాలు అక్కర్లేదు.

**ఉద్యోగినులా :** అమ్మ ఉద్యోగినా లేక గృహిణా అన్నది అప్రస్తుతం. అమ్మ అమ్మే. అమ్మకు ఉద్యోగం అవసరం. ఇంటి కోసం అవసరమైన ఇ.ఎం.ఐలు కట్టాల్సిరావచ్చు. ఇంకా ఏవోక ఆర్థిక బాధ్యతలు ఉంటాయి. పిల్లల పక్కన అనుక్షణం ఉండలేకపోతున్నామన్న గిల్టీనెస్ అనవసరం. ఇతరుల సహాయ సహకారాలు కావాల్సి వుంటుంది. కుటుంబంలోని ప్రతిఒక్కరూ ఇందుకు అండగా నిలవాలి.

**బరువు తగ్గాలా :** ప్రతి కొత్త అమ్మకూ రూపం మారడం సహజం. లావయ్యారనో, మారిన రూపం త్వరితంగా యథాస్థానానికి రావడంలేదనో ఎవరో ఒకరు ఏవోకటి అంటున్నారనో నొచ్చుకోనవసరం లేదు. కొందరు అమ్మలకు అందుకు తగిన సమయం లేకపోవచ్చు. కొంత సమయం తీసుకుని, నెమ్మదిగా ట్రై చేసుకోవచ్చు.

లకు స్వేచ్ఛ ఇవ్వాలి. వారి సలహాలిస్తూ సాయపడుతున్నా, వారి ఉద్దేశ్యాలకు మాత్రం తప్పనిసరిగా విలువ ఇవ్వాలి. తన ఛాయిస్‌లకు మిగతా కుటుంబ సభ్యులంతా మద్దతు ఇవ్వాలి.

## బిడ్డలపట్ల జాగ్రత్తలు

బిడ్డను తీసుకుని బయటకు వెళ్ళినప్పుడు తెలియని వారుసైతం విమర్శలు చేస్తుంటారు.

ఎలా నడుస్తుంది, పాపాయిని ఎలా పట్టుకున్నది, ఎటువంటి దుస్తులు వేశారు వంటి విషయాల్లో ఏదోక తీర్పులు ఇచ్చేస్తుంటారు. వీళ్ళు తెలిసినవాళ్ళూ కాదు, పరిచయస్తులూ కాదు. అయినా జనాంతికంగా ఏవోక మాటలు అనేస్తుంటారు.

చేసిన సూచనలకు సింపుల్‌గా థ్యాంక్స్ చెప్పేసి, సదరు సలహాను తానెందుకు పాటించడంలేదో వివరించాలి. అనుకూలంగా స్పందించాలి కాని, విమర్శల్ని భావోద్రేకంతో స్వీకరించకూడదు.

నచ్చితే అనుసరిస్తేసరిపోతుంది. అంతేకాని, దాని గురించి ఎక్కువగా ఆలోచించవద్దు. పిల్లల్ని తీసుకు వెళ్ళే అమ్మలకు బయట ఎవరైనా సాయాన్ని అందిస్తామని ఆఫర్ చేయవచ్చు. ఉదాహరణకు చేతిలో బరువుంటే పట్టుకుంటామనో, క్యూలో వుంటే ఇబ్బంది లేకుండా సాయపడతామనో చెప్తారు.

పబ్లిక్‌లో బిడ్డ గట్టిగా ఏడుస్తుంది. కొంచెం పెద్ద పిల్లలైతే అల్లరి చేస్తారు, పేచీలు వేస్తారు. చుట్టూ వున్నవాళ్ళు సహజంగానే చూస్తారు. వీటిగురించి ఫీలైపోనక్కర్లేదు. తమ అభిప్రాయాలను వెల్లడించడానికి సామాజిక మాధ్యమాన్ని ఓ వేదిక చేసుకుంటున్నారు. అమ్మల గ్రూపులూ ఆన్‌లైన్‌లో వుంటున్నాయి. చాలామంది తల్లులు సపోర్ట్‌కోసం, ప్రోత్సాహంకోసం ఈ గ్రూప్‌లో చేరుతుంటారు.

తెలిసిన వాళ్ళయినా, తెలియని వారయినా పిల్లల పెంపకానికి సంబంధించి అనుసరించే పద్ధతుల గురించి జడ్జి చేస్తుంటారు. ఇవన్నీ ఒక్కోసారి ఆందోళనకు గురిచేస్తుంటాయి. మద్దతు, ప్రోత్సాహకాలను పక్కన వుంచితే ఒత్తిడిని కలిగిస్తాయి.

గ్రూపులనుంచి బయటకు వెళ్ళిపోతే హాయిగా, రిలీఫ్‌గా ఫీలవుతారు. సామాజికమాధ్యమాన్ని తరచూ పరికించడాన్ని మానేయడం మంచి ఆప్షన్. పోస్టింగ్‌లూ, వ్యాఖ్యానాలు మానేయాలి. ఎవరి పద్ధతులు, తీరు వారికి వుంటాయి.

అన్నింటికంటే ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సిన విషయం అమ్మ పెంపక ప్రయాణం అసాధారణం. అందమైనదీను. ఎవరి ఇష్టానుసారాన్ని బట్టి వాళ్ళు బిడ్డకు అసౌకర్యం కలగకుండా, ఆరోగ్యంగా చూసుకుంటే చాలు. ఎక్కువభాగం అమ్మ తీరు గురించి వినిపించే వ్యాఖ్యానాలు నాలుగు అంశాల్ని లక్ష్యం చేసుకుని వుంటుంటాయి.

ఎమ్.భార్గవి



# ది బెట్



₹ 9,999 బహుమతి కథ

వల్లూరు శివప్రసాద్

సెల్ : 92915 30714
sprasadvalluru@gmail.com

మెడికల్ రిపోర్ట్స్ స్టడీ చేసి, కేసు పొజిషన్ వివరించి, మందులురాసిచ్చి నెలరోజుల తర్వాత చెకప్‌కు రమ్మని పేషెంట్‌కు చెప్పి పంపిస్తూ "సిస్టర్! ఓ.పి. టెన్ మినిట్స్ ఆపండి. డోంట్ ఎలో ఎనీబడీ, ప్లీజ్" అన్నాడు డాక్టర్ చక్రవర్తి నుదురు చేత్తో రుద్దుకుంటూ.

"ఓకే సార్!" అంటూ సిస్టర్ చిర్నవ్వుతో బయటకు నడిచింది.

ఉదయం ఎనిమిది గంటలనుండి ఇప్పటిదాకా ముప్ఫయిమంది పేషెంట్లను పరీక్షించాడు. మనసుకు అలసటగా అనిపించి పదినిమిషాలు రిలాక్స్ కావాలనిపించింది. చక్రవర్తి ఫ్రెష్ రూమ్‌లోకి వెళ్ళి ఫ్రెషప్ అయ్యి ఐదునిమిషాల్లో బయటకొచ్చాడు.

ఫ్రిజ్‌లో ఉన్న మజ్జిగ ప్యాకెట్ తీసుకుని కట్‌చేసి గ్లాసులోకి ఒంపుకుని తిరిగి సీట్‌లోకి వచ్చి కూర్చుని కొంచెం కొంచెం సిప్‌చేస్తూంటే కడుపు చల్లబడటంతో ప్రాణంలేచొస్తున్నట్టనిపించింది.

ఏ డాక్టరైనా వృత్తిలో గొప్ప పేరుప్రతిష్ఠలు సంపాదించాలని తాపత్రయపడతాడు. అందుకు తగిన శ్రమ చేస్తాడు.

తీరా పేరుప్రతిష్ఠలు ఇబ్బడిముబ్బడిగా పెరిగి ఎక్కడెక్కడినుంచో పేషెంట్లు వెతుక్కుంటూరావటం మొదలయ్యాక, ఊపిరితీసుకునే సమయం లేక ఉక్కిరిబిక్కిరైపోతాడు. వ్యక్తిగత జీవితాన్ని సైతం ఫణంగా పెట్టాల్సివస్తుంది.

ప్రస్తుతం డాక్టర్ చక్రవర్తి పరిస్థితి అలాంటిదే. వృత్తిధర్మాన్ని పవిత్రంగా భావించినవాడు గనుక, విసుగూ విరామం లేకుండా రోజులో పదిహేడు, పద్దెనిమిది గంటలు వృత్తికే కేటాయించడానికి అలవాటుపడిపోయాడు.

రాష్ట్రంలో టాప్‌టెన్‌గా పేరొందిన కార్డియో థొరాసిక్ సర్జన్స్‌లో అతనొకడు. కేసు డయాగ్నసిస్ విషయంలోగాని, సర్జరీ విషయంలోగాని పొరపాటు జరగనే జరగదు.

పదినిమిషాలవుతూనే కాలింగ్ బెల్ నొక్కాడు.

సిస్టర్ శ్యామల పేషెంట్‌ని, అతని తాలూకు ఐడెంటిటీని వెంటబెట్టుకుని లోపలకు వచ్చింది. చక్రవర్తి రిపోర్టులన్నీ ఒకసారి పరీక్షగా చూశాడు.

"రావుగారూ! ఒక రక్తనాళంలో మినిమం బ్లాక్ వుంది. స్టంట్ వెయ్యాల్సిన అవసరం గాని, ఆపరేషన్ చెయ్యాల్సిన పరిస్థితిగానీ ఏంలేదు. మందులు వాడితే సరిపోవచ్చు" చెప్పాడు చక్రవర్తి.

అంతవరకు భయం తొంగిచూస్తున్న పేషెంట్ ముఖంలో సంతోషం కనిపించింది. "సర్! మా ఫాదర్ ఎంప్లాయి. మెడికల్ రీఎంబర్స్‌మెంట్ ఉంది. ఖర్చు గురించి వెనకాడాల్సిన పనిలేదు. సర్జరీకైనా ప్రిపేర్డ్‌గానే ఉన్నాం..." కొడుకు కలగజేసుకున్నాడు.

"సీ మిస్టర్! జబ్బునిబట్టి వైద్యంగాని, డబ్బునిబట్టి కాదు. పేషెంట్‌కి ఏది అవసరమనుకొంటే అదిమేం చేస్తాం" చక్రవర్తి స్వరంలోని తీవ్రతకు అతను కొంచెం గాభరాపడ్డాడు.

"సారీ సర్! విశాఖపట్నంలో చెకప్ చేయిస్తే, ఆపరేషన్ అవసరపడొచ్చని డాక్టర్ గారు చెప్పారు. తెల్సిన కొందరు మిత్రులు సెకండ్ ఒపీనియన్‌గా మీ దగ్గరకు వెళ్ళమంటే వచ్చాను. ఆ డైలమాలో మిమ్మల్ని అడగాల్సివచ్చింది" వినమ్రంగా చేతులు జోడించాడు. చక్రవర్తికి విషయం బోధపడింది.

చాలామంది డాక్టర్లు పేషెంట్ ఛాతీలో కాస్త నొప్పనగానే గుండె జబ్బంటూ గాభరాపెట్టేస్తుంటారు. స్టంట్‌లు వెయ్యాలనో, ఓపెన్ హార్ట్ సర్జరీ చెయ్యాలనో డిసైడ్ చేసి చెప్పేస్తుంటారు.

ప్రభుత్వం ఓ.హెచ్.ఎస్. ఆరోగ్యపథకం ప్రవేశపెట్టాక అనవసరంగా ఆపరేషన్లు చేస్తూ క్యాష్ చేసుకుంటున్న హాస్పిటల్స్, డాక్టర్ల గురించి న్యూస్‌పేపర్లలో ఎన్ని విమర్శలు రావటంలేదు?

"ఈ రిపోర్ట్స్ ప్రకారం మీ తండ్రిగారికెలాంటి ప్రాణభయం లేదు. జాగ్రత్తగా మందులు వాడుతూ, వ్యాయామం చేస్తూ,ఆహారనియమాలు పాటిస్తుంటేచాలు. తరచూ చెకప్ చేయించుకుంటుంటే ఎప్పుడే చికిత్స అవసరమో అది చేస్తాం. ఒకే" అంటూ ప్రిస్క్రిప్షన్ రాసి, ధైర్యం చెప్పి పేషెంట్‌ని పంపేశాడు.

ఓపీ చూడడం పూర్తిచేసి కుర్చీలోంచి లేవబోతుండగానే హాస్పిటల్ సి.ఇ.ఓ. ప్రసాద్ ఛాంబర్‌లోకి అడుగుపెట్టాడు "గుడ్మార్నింగ్ సర్!" అంటూ.

"యస్ ప్లీజ్! వాటీజ్ ద మేటర్!" చిరునవ్వుతో స్వాగతించాడు డాక్టర్ చక్రవర్తి.

"సర్! మీరు పరశురామ్ అన్న పేషెంట్‌కు బిల్లు మీద ట్వంటీ పర్సెంట్ డిస్కౌంట్ ఇమ్మని రికమెండ్ చేశారు"

"యస్! యస్! హి ఈజ్ మై టీచర్! ఆర్థికంగా కూడా వీక్. అప్పుడప్పుడు నా పేషెంట్స్‌లో కొందరికి ఇలా ఫేవర్ చేస్తుండడం కొత్తేమీ కాదుగా" ఆశ్చర్యపోతూ అడిగాడు చక్రవర్తి.

"సారీ సర్! ఇకమీదట టెన్‌పర్సెంట్ మించి డిస్కౌంట్ రికమెండ్ చెయ్యొద్దని యం.డి.సార్ మీతో చెప్పమన్నారు" అంతటితో తను వచ్చినపని ఐపోయినట్లు ప్రసాద్ లేచి బయటకు వెళ్ళిపోయాడు.

ఆ మాటలకు చక్రవర్తి కొద్దినిమిషాలు తేరుకోలేకపోయాడు. రెండు నెలలనుంచి హాస్పిటల్ పరిస్థితులు గమనిస్తూనే ఉన్నాడు తను.

కన్సల్టేషన్ ఫీజుదగ్గర నుంచి ల్యాబ్,స్కాన్, యం.ఆర్.ఐ, థియేటర్‌ఛార్జెస్, రూమ్‌రెంట్స్, ఆపరేషన్ ఫీజులన్నీ ట్వంటీ టూ థర్టీ పర్సెంట్ పెంచేశారు.

మెల్లగా హాస్పిటల్‌లో వ్యాపారధోరణి కన్పించటాన్ని

హర్షించలేకపోతున్నాడు. ఈ హాస్పిటల్‌కి డాక్టర్‌గా వచ్చి మూడేళ్ళయింది. ఏ పరిస్థితుల్లో ఇక్కడ పని చెయ్యటానికి అంగీకరించి వచ్చిందీ మర్చిపోలేదు.

కోస్తాప్రాంతంలో హాస్పిటల్‌కు మంచిపేరేవచ్చింది. అంతకుముందు ఎంతోమంది పేషెంట్లు గుండె జబ్బునగానే హైద్రాబాద్‌కి ప్రిఫర్ చేసేవాళ్ళు. ఇప్పుడా పరిస్థితి లేదు. డిమాండ్ దృష్ట్యా ఒకటొకటిగా కొత్త హాస్పిటల్స్ కట్టటం మొదలైంది.

చెన్నైలో వున్న ఒక సూపర్ స్పెషాలిటీ కార్డియాలజీ విభాగంలో కార్డియో థొరాసిక్ సర్జన్‌గా ఏడేళ్ళుగా పనిచేస్తున్నాడు. వందలకొద్దీ ఓపెన్ హార్ట్ సర్జరీలు చేశాడు. ఫెయిల్యూర్ అన్నదిలేకుండా సర్జన్‌గా ఎంతో పేరుప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు.

హాస్పిటల్ కార్డియాలజీ విభాగానికి మంచి పేరు వచ్చింది. రోజుకు పద్దెనిమిది గంటలు హాస్పిటల్‌లోనే ఉండేవాడు. హాస్పిటల్‌మేనేజిమెంట్ తన కెంతో గౌరవంఇస్తుండేది. జాబ్ శాటిస్ఫాక్షన్‌ముందు జీతం లెక్కలోది కాదనుకున్నాడు. తల్లిదండ్రులిద్దరూ పేరొందిన డాక్టర్లు. ఒక్కడే కొడుకు.

జీవితాంతం వాళ్ళు మెడికల్ ఎథిక్స్ పాటిస్తూ బ్రతకడం తనకు తెలుసు. వాళ్ళ జీవనవిధానమే తనకు పాఠాలు నేర్పింది. కావాలంటే తనే ఒక హాస్పిటల్ కట్టగలడు. డబ్బు, పలుకుబడీ అన్నీ వున్నాయి. కాని, వ్యాపారదృష్టితో వృత్తికి న్యాయం చేయలేనేమో నన్న భయంతో అందుకు పూనుకోలేదు. భార్య కూడా న్యూరాలజిస్ట్‌గా ఒక హాస్పిటల్‌లో వైద్యసేవలు అందిస్తుంది.

ఒకరోజు హఠాత్తుగా డాక్టర్‌ప్రదీప్‌తనను వెతుక్కుంటూ హాస్పిటల్‌కు వచ్చాడు. యం.బి.బి.ఎస్‌లో ఇద్దరూ క్లాస్‌మేట్స్.

డిగ్రీ అయ్యాక తను ఇండియాలోనే పి.జి.లో చేరాడు. ప్రదీప్ అమెరికా వెళ్ళి రెసిడెన్సీ చేసి, అక్కడే కొంతకాలంకార్డియాలజీ యం.డి.గా పనిచేస్తూ మంచి పేరు, డబ్బూ సంపాదించాడు. "చక్రవర్తీ! ఈరోజు నీ స్నేహితుడిగా కాకుండా, డాక్టర్‌గా నీ సహకారం కోరి వచ్చాను. నా ఆశయానికి నీ సపోర్ట్ కావాలి" అంటూ ఆత్మీయంగా చేతులు కలిపాడు.

"చెప్పు! నా నుంచి ఎలాంటిసపోర్ట్‌కావాలంటావు?" అడిగాడు నవ్వుతూ చక్రవర్తి.

"సామాన్యులకువైద్యసేవలుఅందించాలన్న సంకల్పంతోరెండేళ్ళక్రితం అమెరికానుంచి తిరిగొచ్చేశాను. హైద్రాబాద్‌లోకాకుండా, విజయవాడలో ఈ చుట్టుపక్కల జిల్లాల ప్రజలకు అందుబాటులో వుండేలా ఓ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ కట్టించాను. టూ హండ్రెడ్ క్రోర్స్ ప్రాజెక్ట్. కొంత నా ఎర్నింగ్, కొంత బ్యాంకులోను.

అన్ని అధునాతన సౌకర్యాలు వున్నాయి. నెక్ట్స్ మంత్ హెల్త్ మినిస్టర్‌తో ఓపెనింగ్ చేయిస్తున్నాను" చెప్పుకొచ్చాడు ప్రదీప్.

"కంగ్రాట్స్! కోస్తాప్రాంత ప్రజల అవసరాలు తీర్చడానికి అలాంటి హాస్పిటల్ అవసరం చాలాఉంది" అభినందించాడు. "చక్రవర్తీ! హాస్పిటల్ కట్టటంలో గొప్పదనం ఏం వుంది? ఆ మాత్రం కెపాసిటీ వున్నవాళ్ళు ఈ ప్రాంతంలో లెక్కలేనంతమంది.

దాని కన్నా ముఖ్యం హాస్పిటల్‌ని సక్సెస్‌ఫుల్‌గా నడపడం. నెంబర్ వన్ స్టాఫ్‌ని సెలక్ట్ చేసుకోవాలి. దటీజ్ మోస్ట్ ఇంపార్టెంట్"

"యస్! యస్!" తలూపాడు చక్రవర్తి.

"నా హాస్పిటల్ ఛీఫ్ కార్డియో థొరాసిక్ సర్జన్‌గా నువ్వుండాలి. సర్జన్‌గా నీకున్న నైపుణ్యం, పేరుప్రతిష్ఠలూ నాకు తెలుసు. నీకిప్పుడు ఈ హాస్పిటల్ ఇస్తున్నదానికంటే లక్ష ఎక్కువే ఇస్తాను.

కారులాంటి అదనపు ఫెసిలిటీస్ కూడా ఇస్తాను. ఎవ్విరియర్ టెన్‌పర్సెంట్ శాలరీ పెంచుతాను" అసలు వచ్చిన విషయం బయటపెట్టాడు ప్రదీప్.

"ఇలాంటి ఆఫర్స్ నాకు కొత్తకాదు. నాస్కిల్‌ని కమర్షియలైజ్ చేసుకోవటం నాకిష్టం వుండదు" "ఐనోయువర్ ప్రిన్సిపల్స్! కొత్తగా ఎస్టాబ్లిష్ చేసిన హాస్పిటల్ మీద పేషెంట్లకు కాన్ఫిడెన్స్ బిల్డప్ చేయాలంటే నీలాంటి పేరుప్రఖ్యాతులున్న సర్జన్ చాలా అవసరం. ప్లీజ్... నా ప్రాబ్లమ్ అర్థం చేసుకో. ఒక మిత్రుడిగా అభ్యర్థిస్తున్నాను.

గుండెజబ్బున్న ప్రతి వ్యక్తీ హైద్రాబాద్ వెళ్ళాల్సి రావటంతో పేషెంట్లు ఎంతో వ్యయప్రయాసలకు లోనవుతున్నారు. సకాలంలో వైద్యంఅందక ప్రాణాలూ కోల్పోతున్నారు. లాభాపేక్షకంటే ఒక సదాశయంతోనే ఈ హాస్పిటల్ కట్టించాను. ప్లీజ్ అండర్‌స్టాండ్‌మీ" ప్రాధేయపూర్వకంగా అడిగాడు ప్రదీప్.

స్నేహితుడ్ని కాదనలేని సంకటపరిస్థితి "నాలుగు రోజులు టైమ్ ఇవ్వు. ఆలోచించి

**చంద్రబాబు ఎక్కువగా విశ్లేషణ చెయ్యటంతో దాని ప్రభావం పనిమీద వుంటున్నది. విశ్లేషణ, పని సమానంగా వుంటే మంచి ఫలితాలు వస్తాయి.**

*-అశోక్ గజపతిరాజు, టి.డి.పి. నేత*



## విజయానికి మించి

విజయాలు ముఖ్యమే అయినప్పటికీ కేవలం వాటికోసమే పనిచేయకూడదంటున్నది కాజల్. "అందరి మాదిరే నేనూ విజయంకోసం పని చేస్తాను. కాని వాటికి మించిన అంశాలు మరెన్నో వున్నాయి. ఇష్టమైన పనిచేస్తున్నప్పుడు గొప్ప అనుభూతి దక్కుతుంది. అది చాలు.

కష్టాన్ని పదిమంది గుర్తించినప్పుడు బావుంటుంది. సినిమా చేసినతర్వాత నటిగా సంతృప్తి దక్కుతుంది. కొత్త విషయాలు నేర్చుకుంటాం. కొత్త స్నేహితులు ఏర్పడతారు. ఇవన్నీ విజయాలే కదా" అంటున్నది కాజల్.

చెప్తాను" అన్నాడు తను మెత్తబడుతూ.

"నీ నిర్ణయం పాజిటివ్‌గా వుంటుందని ఆశిస్తాను. బై" అంటూ ఆశాజనకంగా వెళ్ళాడు ప్రదీప్.

చక్రవర్తి తన రిజిగ్నేషన్ లెటర్ చేతిలో పడుతూనే చదివి నమ్మశక్యం గానట్లు చూశాడు డాక్టర్ నిరంజన్ "వాట్ ఎ సర్‌ప్రైజ్! మావల్ల మీకేమైనా ఇబ్బందికల్గిందా! మీకు అదనంగా శాలరీగాని, ఇన్‌సెంటివ్స్‌గాని కావాలంటే నిరభ్యంతరంగా చెప్పండి" షాకింగ్‌గా మాట్లాడాడు.

"సారీ నిరంజన్‌గారూ! ఇటీజ్ ఎ మోరల్ ఆబ్లిగేషన్. ప్రస్తుతం మీరిస్తున్న శాలరీ విషయంలోగానీ, ఇన్‌సెంటివ్స్ విషయంలోగాని నాకెలాంటి అసంతృప్తీ లేదు. ఇక్కడెంతో జాబ్ శాటిస్‌ఫేక్షన్ వుంది. నా మిత్రుడు ప్రదీప్ అభ్యర్థన కాదనలేకపోతున్నాను. మీకు ఇక్కడ మంచి స్టాఫ్ కూడా వున్నారు. నేను వెళ్ళినంతమాత్రాన మీకెలాంటి ఇబ్బందీ రాదు" ప్లీజింగ్‌గా మాట్లాడాడు తను.

చివరకు నిరంజన్ చక్రవర్తి అభ్యర్థన మీద రిజిగ్నేషన్ ఆమోదించక తప్పలేదు.

ఘనంగా సెండాఫ్ పార్టీ ఇచ్చి వీడ్కోలు చెప్పారు హాస్పిటల్ స్టాఫ్ అండ్ మేనేజ్‌మెంట్. తన నిర్ణయం చెప్పగానే ప్రదీప్ ఉప్పొంగిపోయాడు. హృదయపూర్వకంగా స్వాగతంపలికాడు. కార్డియాలజీ వార్డుకు చీఫ్‌గా బాధ్యతలు చేపట్టి మూడేళ్ళవుతుంది.

"సర్! లంచ్ ఎరేంజి చేశాను" సిస్టర్ రావటంతో చక్రవర్తి ఆలోచనల్లోంచి తేరుకున్నాడు. పర్సనల్ రూమ్‌లోకి అడుగుపెట్టాడు.

పెట్టింది తింటున్నాడన్న మాటేగాని మనసు ఇంకా నిలకడగా లేదు.

గతవారం జరిగిన మరో సంఘటన చక్రవర్తి మనస్సులో మెదలసాగింది.

ఒక పేషెంట్‌కు కరోనరీ ఆంజియోగ్రఫీచేసిచూస్తే రెండు కరోనరీ ధమనుల్లో రెండు బ్లడ్ క్లాట్స్ కనిపించాయి. స్టెంట్స్ వేయక తప్పని పరిస్థితి. స్టెంట్స్ వెయ్యబోతూ చూస్తే అవి ఇండియావి.



ప్రతిపక్షాలు నరేంద్రమోడీని తొలగించమంటున్నాయి. మేము అవినీతి, పేదరికం తొలగిస్తామంటున్నాం. -విజయ్ రూపానీ, గుజరాత్ సి.ఎమ్.

పేషెంట్ తనకు ఫారిన్ స్టెంట్స్ వెయ్యమనికోరటం జరిగింది. ఇదేంటని అసిస్టెంట్ డాక్టర్‌ని అడిగాడు. సి.ఇ.ఓ. పేరు చెప్పి తనకేం తెలియదన్నాడు. ఇంటర్‌కమ్‌లో చక్రవర్తి సి.ఇ.ఓని నిలదీశాడు.

"పేషెంట్‌కి అవన్నీ ఏం తెలుస్తాయి సార్! యం.డి గారి ఇన్‌స్ట్రక్షన్స్ ప్రకారం పంపాను" చెప్పాడు సి.ఇ.ఓ. క్యాజువల్‌గా.

చక్రవర్తి సీరియస్ అయ్యాడు. వెంటనే ఫారిన్ స్టెంట్స్ పంపమని కోపగించేసరికి నిమిషాల్లో ఫారిన్ స్టెంట్స్ పంపారు. అవే పేషెంట్‌కి అమర్చటం జరిగింది. ఎందుకిలా చేస్తున్నట్లు?

ఇండియన్ స్టెంట్స్‌వేసి ఫారిన్ స్టెంట్ ఛార్జెస్ అధికంగా వసూలు చేస్తున్నారా? అదే నిజమైతే పేషెంట్‌ని మోసంచేసినట్లు కాదా?

ఈ రోజు ఎక్కడ చూసినా కార్పొరేట్ హాస్పిటల్స్ పుట్టగొడుగుల్లా వస్తున్నాయి. ప్రాణాంతక రోగాలతో రోగులు చనిపోతే, ఆ బిల్లులు కట్టాల్సిన రోగుల బంధువులకు చచ్చినంత పనవుతోంది.

రోగుల్ని రోగాలు పీడిస్తుంటే, వాళ్ళ బంధువుల్ని హాస్పిటల్ బిల్లులు పీడిస్తున్నాయి.

ఫీజుల భయంతో సకాలంలో డాక్టర్లని సంప్రదించకుండా, వ్యాధుల్ని ముదరబెట్టుకుని వెళ్తూ అటు ప్రాణాలు, ఇటు డబ్బూ పోగొట్టుకుంటున్నారు.

కోటానుకోట్ల బ్యాంకు ఋణాల్తో కట్టే కార్పొరేట్ హాస్పిటల్స్ వ్యాపార సంస్థల్లా లాభనష్టాలు బేరీజు వేసుకునే దుస్థితికి దిగజారాయి. రోగుల బాగుకన్నా, రోగుల మీద వచ్చే ఆదాయం ముఖ్యమైపోయింది.

ప్రదీప్ ఒక పేషెంట్‌కు ఓపెన్‌హార్ట్‌సర్జరీరిఫర్‌చేశాడు. చక్రవర్తి ఆంజియోగ్రఫీ రిపోర్టు చూస్తూ ఆశ్చర్యపోయాడు. ఒక ధమనిలో వున్న మినిమమ్ బ్లాకేజిని మందుల సహాయంతో క్లియర్ చేయవచ్చు.

కొంతకాలం తర్వాత రివ్యూచేసి మార్పురాని పక్షంలో బ్లడ్‌క్లాట్స్ పెరిగే పక్షంలో కొంతకాలం తర్వాత రివ్యూచేసి తగిన చికిత్స చేయవచ్చు. తన ఒపీనియన్ ప్రదీప్‌కి చెప్పాడు చక్రవర్తి.

"హాస్పిటల్ చీఫ్‌గా నిర్ణయం నాది చక్రవర్తీ! నీ పాటి నాకు తెలియక కాదు. పేషెంట్ ఓ.హెచ్.ఎస్. కవరేజి క్రిందికి వస్తాడు.

ఒక్కోసారి పేషెంట్ వ్యాధిని బట్టేకాదు, సైకాలజీనిబట్టికూడా మనం డెసిషన్ తీసుకోవాలి. కేవలం నువ్వు పేషెంట్ బెనిఫిట్ గురించే ఆలోచిస్తున్నావు.

హాస్పిటల్‌కి వచ్చే ఇన్‌కమ్ గురించి కూడా నువ్వు ఆలోచించాలి. రెండువందల కోట్లు ఇన్వెస్ట్ చేసి కట్టిన హాస్పిటల్ మెయిన్‌టెయిన్ చెయ్యటం ఎంతకష్టమో నీకు తెలీదు.

ఇక్కడ పేషెంట్ ప్రాణానికి మనం ఏమీ నష్టం కలిగించడం లేదు. రిస్కులేదు. నేను చెప్పినట్లు చెయ్యి... ఒక రకంగా ప్రదీప్ ఆజ్ఞాపించాడనుకోవాలి.

"సారీ ప్రదీప్! నేను డాక్టర్‌గా పేషెంట్ బెనిఫిట్‌గురించి మాత్రమే ఆలోచించగలను. నా ప్రిన్సిపల్స్‌కి వ్యతిరేకంగా నేనీపని చెయ్యలేను" అంటూ బయటకు వచ్చేశాడు.

రెండ్రోజులు చక్రవర్తి మానసిక సంఘర్షణకు గురయ్యాడు. హాస్పిటల్ ప్రారంభించిన నాటి ఆలోచనలు, ఆశయాలు ఇప్పుడు ప్రదీప్‌లో లేశమాత్రం కన్పించటంలేదు.

హాస్పిటల్‌కు వచ్చిన పేరుప్రతిష్ఠల్ని క్యాష్ చేసుకోవాలన్న తాపత్రయంలో మునిగిపోయాడు ప్రదీప్. ఇప్పుడు తను ప్రదీప్ స్నేహితుడిగా కాదు, ఒక డాక్టర్‌గా ఆలోచించాలి.

"ఐ విల్ ప్రివెంట్ డిసీజ్ వెనెవర్ వై కెన్, ఫర్ ప్రివెన్షన్ ఈజ్ ప్రిఫరబుల్ టు క్యూర్..."

హిప్పోక్రటిక్ ఓత్‌లోని వాక్యాలు ఒక్కసారిగా మననం చేసుకున్నాడు. తనిప్పుడు ఒక నిర్ణయానికి రాగలిగాడు చక్రవర్తి.

"సారీ! డాక్టర్‌గా ఎథిక్స్ పాటించాలన్న సంకల్పం నాది. నావృత్తికిన్యాయంచెయ్యలేనిచోట, ఆత్మవంచన చేసుకుంటూ పనిచెయ్యలేను" రిజిగ్నేషన్ లెటర్ చేతికిచ్చేసరికి డాక్టర్ ప్రదీప్ ఖిన్నుడయ్యాడు.



Courtesy : GRIHASHOBA

# రక్షాబంధన్

సోదరీ, సోదరుల అనుబంధానికి ప్రతీకగా జరుపుకునే పండుగ రక్షాబంధనం. ప్రతి సంవత్సరం శ్రావణపౌర్ణిమను రక్షాబంధనంగా జరుపుకుంటారు. 'రక్ష', 'బంధనం' అనే రెండు పదాల కలయికతో ఏర్పడినది. కష్టాలలో వున్నవారిని రక్షించేందుకు కడుతున్న బంధనం.

ఆ రక్ష కట్టించుకుంటే రక్షించే బంధం ఏర్పడినట్టే. అది రక్తం పంచుకుపుట్టినవారే కానక్కరలేదు. సోదర భావం వున్నవారెవరికైనా రక్షాబంధనం కడతారు ఆడపిల్లలు. అలా తన చేతికి కట్టినటువంటి ఆ బంధనం వున్నంతవరకు ఆ ఆడపిల్లకు అండగా నిలుస్తాడు ఆ సోదరుడు. అలా చేతికి కట్టేది రాఖీ.

ఒకనాడు అది సాదాసీదా తాడు వంటిది.

నేడు క్రమంగా దాని రూపం, పరిమాణం రెండూ మారాయి. ఖరీదైన రాఖీలు, ఎన్నెన్నో రూపాలలో మార్కెట్‌లో లభిస్తున్నాయి.

## సోదరుడు అండగా

ఒకరకంగా రాఖీ పండుగను వ్యాపారానికి వాడుకున్నారు.కాని వాస్తవంలో రాఖీ పండుగ ఎంతో గొప్ప పవిత్రమైన లక్ష్యంతో మొదలైనటువంటిది.

వేల సంవత్సరాలుగా భారతీయులు జరుపుకుంటున్నటువంటి పండుగ. ఉమ్మడి కుటుంబాలు వున్నరోజుల్లో ఆడపిల్లను పెళ్ళిచేసి అత్తగారింటికి పంపినా పుట్టిం టితో ఆమె బంధం తెగిపోయేదికాదు. మెట్టినింట జరిగినా, పుట్టింట జరిగినా ప్రతి శుభ కార్యంలో ఆడపిల్ల సోదరుడికి,మేనమామలకు పాత్ర కల్పించారు. వివాహసమయంలో మేనమామలు పెళ్ళికూతురిని పెళ్ళిమంటపానికి తీసుకువస్తాడు. అది ఆ తరంలో సోదరుడు అండగా నిలవటం.

## సామాజిక పండుగ

ఇప్పుడు పెళ్ళికూతురు, చేసుకోబోతున్న బావగారికి వివాహమండపానికి తరలిరమ్మని ఆహ్వానించేది సోదరుడు. కాళ్ళు కడిగి పీటలమీదికి ఆహ్వానించేది సోదరుడు. తన సోదరి పెళ్ళి హడావుడి అంతా సోదరుడు భుజాలమీద వేసుకుని చేస్తాడు. అప్పగింతలవరకు సోదరుడి పాత్ర వుంటుంది.

పుట్టింటికి అమ్మాయిని తీసుకురావటానికి వెళ్ళేది సోదరుడే. సోదరికి పిల్లలు పుడితే వారికి అన్నప్రాసన సమయంలో సోదరుడి పాత్ర వుంటుంది.

మెట్టినింట సోదరి ఎలావుందో కనిపెట్టుకుని చూసేవాడు సోదరుడు. అలా తనకు అండగా నిలుస్తున్న సోదరుడిపట్ల తన ప్రేమ,కృతజ్ఞతను తెలియజెప్పేందుకు, ఆమె వచ్చి రాఖీ కడుతుంది. ఆ రాఖీ కట్టించుకున్న సోదరుడి బాధ్యత మరింత పెరుగుతుంది.

తాను ఆ అనుబంధాన్ని అలాగే ముందుకు తీసుకువెళతానని సోదరికి భద్రతాభావం కలిగిస్తాడు. సోదరిని రక్షించటం అనేది సోదరుడి బాధ్యత. ఇది మానవ అనుబంధానికి సంబంధించినది.

**రాఖీపూర్ణిమ : 26.8.2018**

ఇది ఒక సామాజిక పండుగ కాని మతపరమైన పండుగ కాదు. రక్షాబంధన్‌ని హిందూపండుగలలో ఒకటిగా క్యాలెండర్‌లో చూసవచ్చుగాని, వాస్తవంలో ఇది ఉత్తర భారతదేశంలో మతాలకు, ప్రాంతాలకు అతీతంగా జరుపుకునే పండుగ. ప్రార్థనావిధానమేదైనా సోదరసోదరీ ప్రేమ, అనుబంధం ఒకలాంటిదే.

భారతీయ సంస్కృతిలో 'బంధనం' అనేదానికి ప్రాముఖ్యత వుంది. అది ఒక కట్టుబాటుకు సంబంధించినది. ఇచ్చినమాటకు కట్టుబడటంవంటిది.

మాటకు మించిన బంధం ఒక దారంతో,తాడుతో ఏర్పాటుచేసిన సంస్కృతి మనది. దేవాలయంలో పూజారి మంత్రించి దారం కడతాడు భక్తుల చేతికి. దుష్టశక్తులను పారద్రోలేందుకు దారం కట్టే సాంప్రదాయం ఇతర మతాలలోనూ వుంది.

## భారతీయ సంస్కృతిలో

స్త్రీ పురుషులను కట్టిపడేసే మంగళసూత్రం కూడా సామాన్యుల పరిభాషలో పసుపుతాడే.

కాని ఆ పసుపుతాడుకున్న విలువ ఎటువంటిదో భారతీయ సమాజానికి ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. అది ఆ ఇద్దరినీ కట్టిపడేస్తుంది. భార్యాభర్తగా జీవించటానికి ప్రారంభం మంగళసూత్రధారణ. ఈ క్షణం నుండి 'నీ బాధ్యతలన్నీ నావి'అని ప్రకటించి, మంగళ సూత్రం కట్టి ఆమెను స్వీకరిస్తాడు.

నాటినుండి ఆమె భర్త రక్షణలో ఆనందంగా సంసారజీవితం గడుపుతుంది. రక్ష కట్టడం అనేది పలు ఇతర సందర్భాలకు సంబంధించిన గాథలు మన పురాణాలలో, చరిత్రలో కనిపిస్తాయి.

రాక్షససంహారం కోసం బయలుదేరుతున్న ఇంద్రునికి, శత్రువులనుండి రక్షణకు రక్షాబంధనం కట్టిన విషయం పురాణాలలో వుంది.

అలెగ్జాండర్ భారతదేశం మీద దండెత్తివచ్చినపుడు వాయువ్య సరిహద్దులో అలెగ్జాండర్‌ని నిలువరించినవాడు పురుషోత్తముడు. ఇది క్రీస్తు పూర్వం 326 సంవత్సరాల క్రితం జరిగినది.

తన భర్త ప్రాణాలకు ముప్పుతేవద్దని కోరుతూ అలెగ్జాండర్ భార్య రొక్సోనా రక్షాబంధన్‌ని పురుషోత్తమునికి పంపింది. ఆ రక్షాబంధన్‌కి వున్న విలువ ఎటువంటిదో తెలిసిన పురుషోత్తముడు రొక్సోనాని తన సోదరిగా స్వీకరించి, ఆమెకు ఎటువంటి ఇబ్బందీ రానివ్వనని హామీ ఇచ్చాడు.

అందుకే అలెగ్జాండర్ యుద్ధంలో ఓడినా ఎటువంటి చెరుపు తలపెట్టక వదిలివేశాడు.రాఖీపండుగ దక్షిణ భారతదేశంలో కన్నా ఉత్తర భారతదేశంలో ఉత్సాహంగా జరుగుతుంది. దీనికి చారిత్రక అంశాలే కారణం. విదేశీ ఆక్రమణదారులు ఆడవారిని అపహరించుకుపోతున్న వేళ అటువంటి రక్షణకు సోదరులు సమాయత్తమై పోరాటానికి దిగేవారు.

ఆ రోజు సోదరుడికి అండగా, నైతికబలం, ప్రోత్సాహం అందించేందుకు సోదరి రాఖీ కట్టేది. అందుకే ఆ సాంప్రదాయ పండుగ ఆ ప్రాంతంలో ఎంతో ఉత్సాహంగా నేటికీ కొనసాగుతోంది.

# డ్యాన్సులు, పాటలకు పరిమితం కావడంలేదు



అచ్చతెలుగు అమ్మాయి శోభిత ధూళిపాళ. అయిదేళ్ళనాడు ఫెమీనా మిస్‌ఇండియా టైటిల్‌దక్కించు కున్నది. ఫిలిప్పైన్స్‌లో 2013లో మిస్ ఎర్త్‌గా భారత్ తరపున ప్రాతినిధ్యం వహించింది. కింగ్ ఫిషర్ క్యాలెండర్ పైనా తళుక్కుమన్నది. ఆమె తొలి సినిమా రెండేళ్ళనాటి 'రమన్ రాఘవ్'.

తొలి తెలుగు చిత్రం గూఢచారి. ఆమెతో ఇంటర్వ్యూ విశేషాలు :

**తెనాలినుంచి కింగ్‌ఫిషర్ క్యాలెండర్ దాకా ప్రయాణం చేసేశారు?**

నేను పుట్టింది తెనాలిలో. వైజాగ్‌లో ప్లస్ టూ దాకా చదువుకుని తర్వాత ముంబై చదువుకోవడానికి వెళ్ళాను.

**చిన్నప్పట్నుంచి సినిమాల్లో నటించా లనుకునేవారా?**

నాకు అస్సలు అటువంటి ఆలోచనే లేదు. మా ఇంట్లో అటువంటి వాతావర ణమే ఉండేదికాదు. మాది ఎడ్యుకేషనల్ ఓరియంటెడ్ ఫ్యామిలీ. నేను సినిమాలు చూస్తూ పెరగలేదు. కాకపోతే ఫ్యాష న్‌ను బాగా ఇష్టపడేదాన్ని.

**మరి గ్లామర్ పరిశ్రమని ఎలా ఎంపిక చేసుకున్నారు?**

ముంబయిలో చదువుకుంటున్న ప్పుడు 'ఫెమినా మిస్ ఇండియా' పోటీలో పాల్గొని గెలిచాను. తర్వాత చాలా ఉత్పత్తులకు అడిషన్లు, మోడ లింగ్‌లతో బిజీగా గడిపేశాను.

షో బ్లిట్జ్ కోరిక లేదుకాని, సరదాగా, ఫాసినేటింగ్‌గా గ్లామర్ ప్రపంచంలోకి మోడలింగ్‌తో కాలుపెట్టాను.

**మీరు గ్లామర్‌పట్ల ఆకర్షణ వుండ బట్టే ముంబయ్ వెళ్ళారా?**

(నవ్వేస్తూ) కాదు. వైజాగ్ తర్వాత ఏదైనా పెద్ద నగరానికి వెళ్ళి చదువుకోవా లన్నది నా కోరిక. అలా ముంబయ్‌ని ఎంచుకున్నాను. నాకు అప్పుడు అకడ మిక్ ఆసక్తి మినహా మరొకటి లేదు. ఎకనామిక్స్ అంటే చాలా ఇష్టం.

ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ నుంచి ఈమధ్య కూడా ఎకనామిక్స్, హ్యూమా నిటీలో డిప్లొమా చేశాను.

**మరి అంత చదువుకుని మోడలింగ్ ఎందుకు చేయాలనుకున్నారు?**

కాలేజీలో ఉన్నప్పుడు 18, 19 సంవ త్సరాల వయస్సులో ఓ ఎగ్జయిట్‌మెంట్ ఉంటుందికదా. అలా ఎట్రాక్ట్ అయ్యా. పైగా, నాకు కథలు చెప్పడం బాగా ఇష్టం. మోడలింగ్‌ను బాగా ఎంజాయ్







చేశానుకాని, సంతృప్తి అయితే పూర్తిగా దక్కలేదు. ఇందులో నటన కూడా ఓ మాధ్యమం కదా. కాబట్టి నటించా లన్న కోరిక నాలో మొలకెత్తింది.

**సినిమాల్లోకి ఎలా వచ్చారు?**

మిస్ ఇండియా పోటీ తర్వాత బాలీవుడ్ ఆఫర్లు వచ్చాయి కాని, అప్పట్లో వద్దనుకున్నాను. నటించా లన్న కోరిక అప్పటికి జనించ లేదు. తెలుగులో ఆనంద్ సినిమా ప్రభావం పడిందని కూడా చెప్పాలి.

అది చూశాక నటించా లన్న కోరిక కలిగింది.

**మరి ఆ తర్వాత?**

మొట్టమొదటి సినిమా రమన్ రాఘవ్. అనురాగ్ కశ్యప్‌వద్ద పనిచేయ గల అదృష్టం, అవకాశం రెండూ దక్కాయి. ఆడిషన్లు జరిగిన గంట లోపే ఎంపికైనట్లు ప్రకటించారు. రెండే రోజుల్లో షూటింగ్ మొదలయి, పది రోజుల్లో నా పని పూర్తయింది.

మంచి కాంబినేషన్‌లో, నవరసాలతో నటించానన్న సంతృప్తి దక్కింది.

**ఏవైనా సినిమాలు చూస్తున్నప్పుడు నచ్చని విషయాలుంటాయా?**

చెప్తే సిల్లీగా ఉంటుందేమోకాని, ఉన్నాయి. 'క్యాజువల్ లుక్' అంటారు. అటువంటి లుక్‌లో హీరోయిన్ అధునా తన అలంకరణలతో ఉంటే సహజత్వం ఎక్కడ ఉంటుంది! ఉదాహరణకు హాస్పిటల్‌లో హీరోయిన్ ఉందను కుందాం. లిప్‌స్టిక్ వేసుకుని, హై హీల్స్ ధరించి కనపడితే ఎలా ఉంటుంది?

**మొదటి రోజు షూటింగ్ అనుభవం ఎలా ఉంది?**

నిజం చెప్పాలంటే కొంచెం ఇబ్బంది పడ్డాను. మొదటిదే ఇంటిమేట్ సీన్. తర్వాత అమ్మ ఫోన్ చేస్తే మాట్లాడడానికి కొంచెం ఫీలైపోయి, తర్వాత చేస్తానని ఫోన్ పెట్టేశా (నవ్వేస్తూ). ఏదిఏమైనా గొప్ప వ్యక్తివద్ద పనిచేయడం చాలా లక్కీ.



**తెలుగమ్మాయి అయివుండీ తెలుగు సినిమా ఆలస్యంగా చేశారేం?**

ఫ్రాంక్‌గా చెప్పాలంటే, గ్లామర్ ప్రపంచానికి సంబంధించి ముంబయ్ కొంత అలవాటైపోయింది. అక్కడో కాస్టింగ్ స్ట్రక్చర్ ఉంటుంది.

హైదరాబాద్ సినీ వాతావరణం కొత్త. అందుకే కొంత సందేహించా.

**'గూఢచారి' సినిమా అవకాశం మీకు ఎలా వచ్చింది?**

అడవి శేషుగారు ఫోన్‌చేసి 'గూఢచారి'పాత్రకోసం హైదరాబాద్ రమ్మన్నారు. వచ్చి ఆయనను కలిశాను. కథ నచ్చింది. ఒప్పుకున్నాను.

**మీరు తెలుగులో కొనసాగాలనుకుంటున్నారా?**

అవును. ఈమధ్యకాలంలో తెలుగులో మంచి సినిమాలు వస్తున్నాయి. హీరోయిన్లకు మంచి పాత్రలుదక్కుతున్నాయి. ఇంతకుముందుమాదిరి వాళ్ళు పాటలకు, డ్యాన్సులకు పరిమితం కావడంలేదు.

నటనకు ఆస్కారం గల పాత్రలు చేస్తున్నారు. ఈ ధోరణి నాకు నచ్చింది. అందుకే ఇకపైన తెలుగులో సినిమాలు చేయాలనుకుంటున్నాను.



**మీరు బాగా ఇష్టపడేవి ఏంటి?**

మేకప్ ఉత్పత్తులకంటే ఎక్కువగా పుస్తకాలు చదువుతాను, కథలు రాయడం చిన్నప్పటినుంచి ఇష్టపడేదాన్ని.



**బాగా చదువుకున్న కుటుంబానికి చెందిన మీకు నటనపట్ల మద్దతు లభించిందా?**

కుటుంబం సపోర్ట్ ఉంది. అయితే, ఈ పరిశ్రమలో అనిశ్చిత వాతావరణం ఉంటుందన్నది అమ్మానాన్నల అభిప్రాయం. 'గూఢచారి'లో నా పాత్ర వారికెంతగానో నచ్చింది.

**ఎటువంటి పాత్రలు చేయాలనుకుంటున్నారు?**

పాత్ర నిడివి చిన్నదైనా పర్వాలేదు. కాని, నా పేరు వినగానే నేను కాకుండా, నా పాత్రే కనపడాలి. సాధారణ అమ్మాయిగా తెరపై కనపడాలనుకుంటాను కాని, ఆధునికంగా కాదు.

**మీ భవిష్యత్ ప్రాజెక్టులు?**

'గూఢచారి' సినిమా చేస్తున్నప్పుడు నన్ను చాలామంది దర్శక నిర్మాతలు కలిశారు. ఒకటి రెండు కథలు నాకు నచ్చాయి. కొన్ని నచ్చలేదు. అయినా అలా చెప్పలేనుకదా- అంటూ ముగించింది శోభిత ధూళిపాళ.

**అయినపూరి సుజాత**




నాని వెర్రెత్తినట్లు అరుస్తూ మంజుల చేతిలో వున్న పుస్తకాన్ని తీసి విసిరికొట్టాడు.

రవళి ఏదో చెప్పబోతుంటే ఆగమన్నట్లు సైగచేసింది నిత్య. ఆమె నాని మొహంలోని భావాలను అర్థం చేసుకుంటుంది... అందరూ నిశ్శబ్దంగా, మౌనంగా ఉండిపోయారు.

"నానీ... మనం ఇక్కడికి వచ్చింది ఆడుకోవడానికి. సో... నో స్టడీస్‌కదా?" అని మెల్లగా అంది నిత్య.

కొద్ది కొద్దిగా నెమ్మదిస్తున్న నాని ఔనన్నట్లు తల ఊపాడు.

"నానీ సిట్యుయేషన్ అర్థమయింది. బలవంతంగా చదవమని రుద్దితే

# నానీతో నిత్య

## సాయిరాం ఆకుండి



భరించలేకపోతున్నాడు..." అని పక్కకి తిరిగి పెదాలు కదపకుండా మాట్లాడింది నిత్య.

"చదువుమీద ఇంట్రెస్టు పుట్టేలా చెయ్యడానికి సమయం పట్టేలా ఉంది. ముందు నానీని పీస్‌ఫుల్‌గా ఉంచాలి. తర్వాత కౌన్సిల్ చెయ్యాలి. మోటివేట్ చెయ్యాలి.సో ప్రస్తుతానికి బ్రేక్ ఇద్దాం"

నిత్య సైగని అర్థం చేసుకుని అక్కడ్నుంచి అందరూ తమ రూముల్లోనికి వెళ్ళిపోయారు. ఇప్పుడా నడింవాకిట్లో ఇద్దరే ఉన్నారు. వీల్ ఛెయిర్‌మీద ఓ పక్కగా ఒదిగి నిత్యవైపే చూస్తున్న నానీ, అతని బిహేవియర్‌లో మార్పులను గమనిస్తున్న నిత్య.

టీచర్లూ, ఆయాలూ, చంద్రావూ అందరూ ఒకే రూమ్‌లో చేరి గుసగుసలాడుకుంటూ నిత్య గురించే హేళనగా మాట్లాడుకుంటున్నారు.

"ఇప్పుడేం చేస్తుందో? ఏదో సాధించేద్దామని తపన పడుతున్నాదిగా. నాని గాడితో అంత ఈజీయా?"

"అమ్మో... వాడు ఒక్కోసారి ఒక్కోలాగా బిహేవ్ చేస్తాడు. నరకం చూపిస్తాడు..."

"వాడికి ఉన్న జబ్బు 'ఆటిజం'అని పేరుపెట్టి చెపుతారుకానీ, నిజానికి మెంటల్ కూడా ఉంది... ఆ సతాయింపు భరించలేం"

"ఈమె ఎన్నాళ్ళో ఇక్కడ ఉండదు. ఏదో రోజు జంప్ అయిపోద్ది. థియరీ చదువులతో అన్నీ తెలుసు అనుకుని ప్రాక్టికల్ నాలెడ్జి లేకుండా వచ్చేసే వాళ్ళతో ఎవ్వారం ఇలాగే ఉంటాది"

ఇలా మాట్లాడుకుంటూనే కిటికీ లోంచి తొంగిచూస్తున్నారు. బయట నడవాలో స్తంభాలవారనుంచి పని వాళ్ళూ పిల్లలూ కూడా ఇటువైపే దృష్టి నిలిపి ఉంచారు. నాని మొహంలోనికి చూస్తూ చిన్నగా పచార్లు చేస్తోంది నిత్య. "సో... ఏ ఆట ఆడదాం ఇప్పుడూ?" ఆలోచిస్తున్నట్లు అభినయిస్తోంది.

సడెన్‌గా ఒక ఐడియా ఫ్లాష్ అయినట్లు ఎక్‌స్ప్రెషన్ ఇచ్చింది.

"ఫుట్‌బాల్ ఆడదామా?"

టీచింగ్ స్టాఫ్, ఆయాలే కాకుండా ఈ తతంగాన్ని గమనిస్తున్నవాళ్ళంతా విస్తుపోయారు. ఈమెకు మతిభ్రమించిందా అనుకుంటూ నివ్వెరపోయారు. నడిచే యత్నం చేస్తే చాలు కిందపడిపోయే నాని, ఇక నడవాలన్న ప్రయత్నమే మానేసి వీల్‌ఛెయిర్‌కి పరిమితమయిపోయిన నాని ఫుట్‌బాల్ ఆట ఆడడమా?

చంద్రావైతే వచ్చే నవ్వుని ఆపుకోలేకపోతున్నాడు.నోటికి అడ్డంగా చెయ్యి పెట్టుకుని నవ్వుని తొక్కి పెట్టేస్తున్నారు జానకీ, భాగ్యలక్ష్మీ.

"నానిగాడిక్కాదు... అసలు ఈమెకే మెంటల్ ఎక్కినట్లుంది. అతిగా ఆలోచించి అసలు సమయానికి పప్పులో కాలేసినట్లు మేడమ్ ఈమెని తెచ్చి పెట్టిందేంటి?" ఎకసక్కెంగా మంజుల అంటూంటే వత్తాసు పలికింది రవళి.

"ఒక్కనిమిషం" అంటూ నిత్య తన రూమ్‌వైపు పరుగు తీసింది. ఆవైపే తలతిప్పి చూస్తున్నాడు నాని. సరిగ్గా నాలుగు నిమిషాల అనంతరం నిత్య బయటకొచ్చింది. స్పోర్ట్స్‌వేర్ ధరించి

6

### జరిగిన కథ

తల్లిని బ్రతికించుకునేందుకు జయప్రభ పెట్టిన కండిషన్‌కి ఒప్పుకోవాలని నిర్ణయించుకుంటుంది నిత్య. జయప్రభ ఇచ్చిన అడ్వాన్స్‌తో తల్లికి ఆపరేషన్ చేయిస్తుంది.

తర్వాత ఆమె జయప్రభ భవంతికి వచ్చి ఆటిజం గురించి తను స్టడీ చేసిన విషయాలను వివరిస్తుంది జయప్రభకి.

పిల్లవాడి మనస్తత్వంనుంచి తాను నానీని ఎలా పరిపూర్ణమయిన వ్యక్తిత్వంతో తీర్చిదిద్దాలనుకుంటోందీ వివరణ ఇస్తుంది.

పంచవటిలోకి ప్రవేశించిన నిత్య పట్ల అక్కడి పనివారందరిలో తిరస్కార ధోరణి కనిపిస్తుంది.

నాని కూడా మనతోనే వుంటాడని సోమయ్యతో చెబుతుంది నిత్య. రవళి, మంజుల నానిచేత ఇంగ్లీషు పదాలను బలవంతంగా వల్లెవేయించడం చూస్తుంది నిత్య. వాళ్ళిద్దరి దగ్గరికీ వెళ్ళి తనని పరిచయం చేసుకుంటుంది.

నిత్య రాక నానిలో సంతోషాన్ని ఇస్తుంది. నానీ బాగోగులు చూసే మేన్ సర్వెంట్ చంద్రరావుకి నిత్య అంటే కినుక వస్తుంది.

ఇక జరిగేది చదవండి.





## హోమ్లీ గాళ్

ప్రతి స్క్రిప్టునూ ఎంతో జాగ్రత్తగా చదివి, ఆచితూచి ఎంచుకుంటున్నానంటున్నది 'అమీతుమీ' పిల్ల ఈషారెబ్బా.

ఈసారి నాగశౌర్య సరసన హోమ్లీ గాళ్‌గా నటించబోతున్నది.

"హోమ్లీగాళ్ పాత్ర అయినా నా రూపం ఆధునికంగా ఉంటుంది. నా పాత్ర మేనరిజం బావుంటుంది. ఇది నాకు విభిన్నమయిన పాత్ర. అందుకే సంతకాలు చేశాను. డైలాగులు సరదాగా, వినోదంగా సాగుతాయి. కంటెంట్, మంచి క్యారెక్టర్ గల సినిమాలనే ఎంచుకుంటాను. అప్పుడే నాలోని ప్రతిభ కనపడుతుంది" అని వివరించింది.

స్పోర్ట్స్ షూ వేసుకుని చేతిలో ఫుట్‌బాల్‌తో వచ్చింది. ఆమె మరోచేతిలో ఒక త్రీ బై టూ సైజు వైట్ మార్కర్ బోర్డూ, పెన్నూ ఉన్నాయి.

నాని ఆశ్చర్యంగా చూస్తే అంతకుమించి విస్తుపోవడం మిగతావాళ్ళవంతయింది. "ఈమె స్పోర్ట్ పర్సన్ కూడా అన్నమాట. డౌట్‌లేదు.ఆటాడిస్తుంది" అనేసింది భాగ్యలక్ష్మి.

అప్పుడప్పుడూ టీవీలో చూసినా దివాణం పరిసరాలలో ఇలా స్పోర్ట్స్ పర్సన్‌ని ఎప్పుడూ చూసివుండకపోవడంతో పంచవటి జనాలు అందరికీ క్యూరియాసిటీ నెలకొంది. మార్కర్ బోర్డుని ఒక స్తంభానికి చేరబడి ఉండేలా పెట్టి ఇటు తిరిగింది నిత్య.

నేలకేసి బంతిని ఆడుతూ నెమ్మదిగా నడుస్తూ వచ్చి నాని ఎదురుగా నిలబడింది నిత్య.

"నానీ... నువ్వూ నేనూ ఫుట్‌బాల్ ఆడుతున్నాము... నేను స్ట్రయికర్ని... నువ్వేమో గోల్ కీపర్‌వి..."

ఇదేదో బంతాట అని అర్థమవుతున్నా ఎలా ఆడాలి, ఎలా గెలవాలి అన్నది తెలియని నాని చాలా ఎగ్జైటింగ్‌గా చూస్తున్నాడు. విశాలమయిన దీర్ఘచతురస్రాకారంలో ఉన్న ఆ నడింవాకిలికి ఓ డయాగనల్ మూల నీటిని కలెక్ట్ చేసేందుకూ,పంప్ అవుట్ చేసేందుకూ డీ-వాటరింగ్ పిట్ ఉంది. నాని కూర్చున్న వీల్‌ఛెయిర్‌ని తోసుకుంటూ పిట్ దగ్గరికి తీసుకెళ్ళి అభిముఖంగా తిప్పి చక్రాలను లాక్ చేసింది. బాల్ తీసుకుని నడిచిన నిత్య రెండో డయాగనల్ మూలకు చేరుకుని ఇటు తిరిగి నిలబడింది.

ఏళ్ళుతరబడి గడిచిన రొటీన్‌కి భిన్నంగా నిత్య చెబుతున్న విషయాలూ, చేస్తున్న పనులూ సాగుతున్నందున, సరికొత్తగా అనిపిస్తున్నందున ఆసక్తితో చూస్తున్నాడు నాని. అత్యంత శ్రద్ధగా వింటున్నాడు.

"నానీ... నేను స్ట్రయిక్ చేసిన బాల్ ఆ పిట్‌లో పడితే నాకో పాయింట్ వస్తుంది. అదే బాల్‌ని నువ్వు ఆపగలిగితే నీకో పాయింట్ వస్తుంది. నేను గోల్ చెయ్యలేకపోయినా నీకే పాయింట్ వస్తుంది" ఇలా చెప్పి క్షణం ఆగి నాని మొహంలోనికి చూసింది.

నాని చాలా జాగ్రత్తగా వినడాన్ని గమనించి నిత్య చెప్పడం కొనసాగించింది. "సో, ఎవరికి ఎక్కువ పాయింట్లు వస్తే వారు గెలిచినట్లు... నీకు ఎక్కువ పాయింట్లు వస్తాయో నాకు వస్తాయో చూద్దాం..." సవాల్ విసురుతున్నట్లు అంది నిత్య. వైట్ బోర్డ్ దగ్గరికి నడిచి మార్కర్‌తో పట్టిక గీసింది "నాని వర్సెస్ నిత్య... మనం ఎవరికి వాళ్ళం గెల్చుకున్న పాయింట్లు ఇక్కడ రాస్తాను"

మళ్ళా డయాగనల్ కార్నర్ దగ్గరకు వచ్చింది. "సో... గేమ్ స్టార్ట్స్ నౌ" బంతిని నేలకేసి కొడుతూ సమాయత్తమౌతోంది నిత్య.

అసలు ఈ గేమ్ ఎలా ఆడాలో, తన పాత్ర ఏంటన్నది ఇతమిత్థంగా అర్థం కాలేదు నానికి. అలా సూటిగా చూస్తున్నాడు. కళ్ళార్పకుండా నిత్యకేసి చూస్తున్నాడు.

కాళ్ళదగ్గర పడేసిన బంతిని పుష్‌పుల్ టెక్నిక్‌తో లాఘవంగా కదిలిస్తోంది నిత్య... చిన్నగా జంప్ చేస్తూ ముందుకీ వెనక్కీ అడుగులేస్తూ బూట్ల కొనలతో బంతిని తాకుతూ నేర్పుగా మూవ్ చేస్తోంది.

ఒక్కసారిగా వెనక్కి చిన్న అడుగేసి కుడికాలి బూటుతో బంతిని బలంగా ముందుకు పుష్ చేసింది. గింగిరాలు తిరిగిన బంతి రివ్వున దూసుకుపోయి నాని తలమీదనుంచి వెళ్ళి అవతల ఉన్న పిట్‌లో పడింది.

"యా..." అంటూ కుడి చెయ్యి బిగించి గాల్లోకి పంచ్ విసిరింది నిత్య.

"నానీ... నువ్వు బంతిని అడ్డుకోలేకపోయావ్... నాకో పాయింట్ వచ్చింది. నీకు సున్నా" వైట్ బోర్డ్ దగ్గరకి నడిచి సైడ్ రాసున్న తన పేరుకింద ఒకటి నెంబర్ వేసింది.

నాని పేరుకింద సున్నా వేసింది.పిట్ దగ్గరకు వెళ్ళి బాల్‌ని తెచ్చుకుని మళ్ళా కార్నర్ దగ్గరకొచ్చింది నిత్య. బంతిని బూట్లతో కదిలించడం మొదలెట్టింది. "నానీ... బంతిని ఆపడానికి ట్రైచెయ్యి. నీకో పాయింట్ వస్తుంది..."

మళ్ళా మెరుపు వేగంతో బంతిని పుష్ చేసింది నిత్య.

ఈసారి బాల్ రోల్ అవుతూ నానికి కుడివైపునుంచి మెలికలు తిరుగుతూ వెళ్ళి పిట్‌లో పడింది. అచేతనంగా చూస్తుండిపోయాడు నాని.

"ఓ నానీ... నీకు మళ్ళీ పాయింట్ రాలేదూ... నాకొచ్చిందీ..."

అలా అరడజను పాయింట్లు నిత్య అకౌంట్లో పడ్డాయి. బోర్డుమీద తన పేరుకింద ఉన్న సున్నాని చూస్తున్నాడు నాని. బంతి ఆపాలని తెలుస్తోంది. బ్రెయిన్‌లో కాంక్ష బలంగా ఏర్పడింది. కానీ ఇంకా ఆ చైతన్యం ఉరకలెత్తడం లేదు. నానికి సమీపంలోనించి అన్నివైపులా బంతి దూసుకుపోతూ పిట్‌లో పడుతోంది. పట్టికలో నిత్య పాయింట్లు పెరుగుతున్నాయ్. నానిని మాత్రం సున్నా వెక్కిరిస్తోంది.

"నానీ బ్యాడ్‌లక్... నీకు పాయింట్లు రాలేదు. సరే ఇవాళ్టికి రెస్ట్ తీసుకో... రేపు మళ్ళీ ఆడదాం" క్రీగంట అతని మొహంలోని భావాలను చదవడానికి

## అది సరికాదు

వ్యక్తిలోని ప్రతిభను తక్కువ చేసి, శారీరక రూపాన్ని ఎత్తిచూపడము హేయం అంటున్నది సోనాక్షి సిన్హా. లావు, నలుపు, ఎత్తుల కబుర్లు అనవసరం అనేది ఆమె అభిప్రాయం.

"ఇతరులతో నన్ను పోల్చి కామెంట్‌లు చేసేవాళ్ళు. అటువంటి వాటిని నేను అస్సలు పట్టించుకోను. నేను చిన్నతనంలో బొద్దుగా ఉండేదాన్ని. కాని బరువు గురించి ఏనాడూ బాధపడలేదు. ఇబ్బందీ పడలేదు. కాని, నా తరపున అనేక మంది బాధపడ్డారు. నేనెలా ఉంటే బావుంటానో సలహాలిచ్చారు.

నా మంచి నాకు తెలుసు కదా. నా గురించి నేను ఆలోచించుకోగలను కదా" అంటూ అకారణంగా రుసరుసలాడింది. ఎందుకో హఠాత్తుగా ఇంత కోపం?

ప్రయత్నిస్తూ అంది నిత్య.

ఎలాంటి ఎక్స్‌ప్రెషన్‌లేకుండా ఉండిపోయాడు నాని. ఇదంతా గమనిస్తున్న రవళి, మంజులా, ఆయాలూ నిత్యని క్రిటిసైజ్ చేస్తూ నవ్వుకుంటున్నారు.

"శాడిస్టులా ఉందీమె... చక్రాల కుర్చీలో ఉన్నవాడితో ఆటా? అదీ ఫుట్‌బాల్ ఆటా? అందులో అన్ని పాయింట్లూ ఈమెవేనా? ఆట అంటే సమఉజ్జీతో ఆడాలిగానీ రోగిష్టితోనా... ఇలాంటి క్యాండిడేటుని పట్టుకువచ్చి నానిని అప్పజెప్పారేంటి మేడమ్?"

"వీలైతే మోటివేట్ చెయ్యాలిగానీ



**గాంధీ తత్వాన్ని చాలామంది న్యాయవాదులు బుట్టదాఖలు చేశారు. అది న్యాయవ్యవస్థకు మంచిది కాదు.**
**-జస్టిస్ రాధాకృష్ణన్, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి**

ఇంకొంచెం డిస్కరైజ్ చేసేలా ఉంది ఈమె వాటం" రవళి అంది.

వాళ్ళని సమర్థించాడు చంద్రరావు "ఓవర్ కాన్ఫిడెన్స్‌తో ఓవర్ యాక్షన్ చేస్తుందీమె. మొదటికే మోసం వచ్చే లాగా ఉంది..."

వాళ్ళు ఎంత గుసగుసలాడుకుంటున్నా సన్నగా నిత్య చెవిన పడుతున్నాయి. నిత్య పిలిచినమీదట చంద్రావొచ్చి నాని కూర్చున్న వీల్‌ఛెయిర్‌ని తోసుకుంటూ వెళ్ళాడు.

ఆ ఆట తతంగాన్ని చూసినవారెవరికీ రిజల్ట్ నచ్చలేదు. నూకరత్నమైతే పెద్దగా కేకలు పెడుతున్నట్లు అరిచింది "పాపం జబ్బుతో బాధపడుతున్న అబ్బాయిగార్ని ఇంకా బాధ పెట్టడం ఏంటి? ఏదోలా ఆటలో గెలిపిస్తే మన సైనా బాగుంటది బిడ్డకి.

అట్లాంటిది బాబుకి సున్న ఏసి ఈ పిల్ల మార్కులు ఏసేసికోవడమేంటీ? ఇదేమి అన్యాయం?"

గట్టిగా వినిపిస్తున్న నూకరత్నం మాటలకి వత్తాసు పలుకుతూనే చాలా మంది నిత్యవైపు తలలు తిప్పారు. ఆమె హావభావాలు ఎలా ఉంటాయన్నది తెలుసుకుందామని వాళ్ళ ప్రయత్నం. కానీ ఎవరికీ ఆ ఛాన్సివ్వలేదు నిత్య.

అన్ని మాటలూ ఆమె చెవిని సోకుతున్నా ఎలాంటి స్పందననూ కనపడనీయకుండానే రూమ్‌లోనికి వెళ్ళిపోయింది నిత్య.

తెలతెలవారుతుండగానే అలారం శబ్దానికి నిత్యకి తెలివొచ్చేసింది. సెల్ ఫోన్లో డిఫాల్ట్‌గా ఉండిపోయిన అలారం ఐదునలభైఐదుకి మోగడంతో ఫోన్ అందుకుని స్నూజ్ చేసింది.

మరో పావుగంటతర్వాత లేవొచ్చు అనుకుంటూ పక్కకి ఒత్తిగిలి కళ్ళు మూసుకుంది.చెవుల్లో సోకుతున్న చిన్న చిన్న అరుపులకు మొదట ఇగ్నోర్ చేసింది. కానీ అలా వినపడుతూనే ఉన్నాయ్. ఏకాగ్రత అంతా ఆ అరుపులమీదకి మళ్ళుతూండడంతో నిద్ర పట్టే అవకాశం కనిపించలేదు.

ఆ శబ్దాలు ఏంటో తెలుసుకుంటే మంచిది అన్న ఆలోచన వచ్చి మంచం మీద నుంచి లేచింది. బెడ్ ల్యాంపు వెలుగులో తలుపుకున్న గడియ తీసి బయటకి నడిచింది.

అప్పుడప్పుడే తూర్పున సన్నగా విచ్చుకుంటున్న వెలుగురేఖల కాంతిలో నడింవాకిట్లో దృష్టి మళ్ళించి చూస్తూ విస్తుపోయింది నిత్య.

అక్కడ డయాగనల్ కార్నర్‌దగ్గర వీల్ ఛెయిర్‌మీద ఉన్నాడు నాని. అతను చేతులు గాల్లో ఊపుతూ చిన్నగా అరుస్తున్నాడు. నిన్నటి ఆటలో బంతి వచ్చిన అన్నివైపులా చేతుల్ని విసురుతున్నాడు. ఊహించుకుంటున్న బంతి ఆగమనాన్ని చేత్తో అడ్డుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

నిత్య ఆశ్చర్యపోతూనే కొద్ది నిమిషాలు ఓ స్తంభంవారన నిలబడి గమనించింది. నానిమాత్రం దీక్షగా తన ప్రయత్నాన్ని కొనసాగిస్తున్నాడు. కాస్త దూరంలో గోడకి చారబడి కునికిపాట్లు పడుతున్న చంద్రరావు కనిపించాడు.

అతని దగ్గరకి నడిచి నిద్రలేపింది నిత్య. ఆమెని చూసి చంద్రరావు ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు. ఆమె ప్రశ్నించబోయేది ఏంటో ఊహించి సమాధానమిచ్చాడు, "బాబు రాత్రంతా సరిగ్గా నిద్రపోలేదు. ఏవేవో కలవరించాడు. అటూ ఇటూ దొర్లుతూనే ఉన్నాడు.

ఉదయం నాలుగున్నర అయ్యేసరికి లేచిపోయి సతాయింపు మొదలుపెట్టాడు. రూమ్ బయటకి వెళ్ళాలని గొడవ... నరకం చూపించాడు. వీల్ ఛెయిర్ని ఇక్కడికి తీసుకొచ్చి పెట్టే వరకూ ఊరుకోలేదు..."

ఇమేజినేషన్లో బంతిని అడ్డగించి గోల్ పడకుండా కాసుకున్నట్లు ఫీలవుతూ వైట్ బోర్డువైపు చూస్తున్నాడు. తన పేరుకింద వున్న సున్నా వెక్కిరిస్తుంది. తెలియకుండా తన మనసునీ, ఆలోచననీ సాధనవైపు మళ్ళిస్తున్న నానీని చూశాక చిన్న దరహాసం ఆమె పెదవులపై మెరిసింది.

"యస్... నానీలో నేను ఊహించిన క్వాలిటీస్ ఉన్నాయ్.శ్రమపడితే బాగవుతాడు... సానపెడితే వజ్రమవుతాడు" ఆమె స్వగతంలా ఉచ్చరించిన మాటలు చంద్రరావుకి విన్పడ్డాయి.

పెద్ద అడుగులేస్తూ నాని దగ్గరకి నడిచింది నిత్య. "గుడ్‌మార్నింగ్ నానీ... ఏం చేస్తున్నావ్?"

నిత్య మాటలు విని తల ఇటు తిప్పిచూసి కదిలిపోతూ నవ్వాడు నాని.నిత్యని చూసినఆనందం అతని కళ్ళల్లో కనిపిస్తోంది.

కళ్ళని కదుపుతూ అతను మొహంలో వ్యక్తపరిచే భావాలను అర్థంచేసుకున్నట్లుగా తలాడించింది నిత్య.

"ప్రాక్టీస్ చేస్తున్నావా...? వెరీ గుడ్" నాని చేతిని అందుకుని షేక్‌హ్యాండ్ ఇచ్చింది నిత్య.

"బట్... ఇప్పుడు కాదు... ఆటలాడి గెలవాలంటే ఎనర్జీ ఉండాలి.ఎనర్జీ రావాలంటే మంచిగా తినాలి. మంచిగా నిద్రపోవాలి... నువ్వు రాత్రి సరిగ్గా నిద్రపోలేదు. అంచేత ఎంత ప్రాక్టీస్ చేసినా స్కిల్ రాదు" ఆమె మాటల్ని అర్థంచేసుకున్నట్లు వింటున్నాడు నాని.

"సో... ఇప్పుడు నువ్వు రూముకెళ్ళి కాసేపు పడుకోవాలి. నిద్రలేచి తర్వాత ఫ్రెష్‌అప్ అవ్వాలి. బ్రేక్‌ఫాస్ట్ చెయ్యాలి. పాలు తాగాలి" నాని మనసులో ముద్ర పడేలా ఒక్కొక్క పదం ఒత్తిపలుకుతూ అంది నిత్య. యస్ అన్నట్లు తలూపాడు నాని. తన సిన్సియారిటీని తెలియచెప్పాలనేవిధంగా మళ్ళీమళ్ళీ తలూపాడు.

"దట్స్ ది స్పిరిట్" నిత్య నవ్వుతూ థమ్స్ అప్ చూపించింది.

నిత్య మనోభావాన్ని అర్థంచేసుకుని చంద్రరావు ముందుకొచ్చి నాని వీల్ ఛెయిర్‌ని పక్కకితిప్పి రూమ్‌వైపు నడిపించాడు. వాళ్ళిద్దరూ రూమ్‌లోనికెళ్ళే వరకూ అటే చూసి ఆ తర్వాత వెనుదిరిగి తన రూమ్‌లోకొచ్చింది నిత్య.

మంచంమీద దొర్లినా నిద్ర వచ్చే సూచనలు కనపడ్డం లేదు. సహాయసహకారాలు చెయ్యని మనుషుల మధ్య నాని ఇప్పుడున్న పరిస్థితిలో మార్పుని



**విపక్షాలు కాంగ్రెస్ నాయకత్వం వద్దంటే బి.జె.పికి లబ్ధి చేకూర్చినట్టే.**
**-సల్మాన్ ఖుర్షీద్, కాంగ్రెస్ నేత**

తెచ్చి అతన్ని సంపూర్ణంగా మార్చగలగడం ఒప్పుకున్న వ్యవధిలో సాధ్యమవుతుందా అన్న సంశయం ఆమె మదిలో మెదులుతూనే ఉంది.

పాజిటివ్‌గా ఆలోచిస్తూ సెల్ఫ్ మోటివేషన్ చేసుకుంటున్నప్పటికీ ఒక్కోసారి ఇలాంటి ఆలోచనలు వస్తూనే వున్నాయి. ఇలా నిరాశాపూర్వకమయిన ఆలోచనలు మెదిలినప్పుడల్లా తన పెస్సిమిస్టిక్ ఊహల్ని నియంత్రించుకుని పాజిటివ్ సజెషన్స్‌తో తననితాను మోటివేట్ చేసుకోవడం నిత్యకు అలవాటయిన ప్రక్రియ.

లక్ష్యసాధనలో తనకు వ్యతిరేకంగా ఉండేవారందర్నీ కలుపుకునిపోతూ మోరల్ స్ట్రెంగ్త్ బలపడేవిధంగా ప్రయత్నాలు సాగించాలనే దిశగా ఆమె ఆలోచనలు కొనసాగుతున్నాయి.

నడింవాకిలిని ఎవరో ఊడుస్తున్న శబ్దం వినవచ్చి ఇక తనూ లేచి పనులు మొదలెట్టాలనుకుంది నిత్య.

"మీరే ఉద్దేశ్యంతో నాని దృష్టిని



## ఆ కిక్కే వేరు

సినిమాల్లోనే పుట్టిపెరిగిన తనకు ఈ రంగం స్పష్టంగా అర్థమవుతుందంటున్నది శృతీహాసన్.

"కథ నిజంగా డిమాండ్ చేస్తే పలువురు స్టార్లు కలసి పనిచేస్తే ఆ కిక్కు చాలా గొప్పగా ఉంటుంది. అందుకే నాకు మల్టీస్టారర్ సినిమాలంటే గౌరవం.

దశాబ్దాల తర్వాత సైతం వెను తిరిగి చూసుకుంటే కెరీర్‌లో కొన్ని అత్యుత్తమ పాత్రలు చేశామన్న తృప్తి కలుగుతుంది. వైవిధ్యమైన పాత్రలు పోషించినప్పుడే నటీనటులకు నిజమైన సంతృప్తి దక్కుతుందని నమ్మే వ్యక్తిని నేను" అని తెలిపింది శృతీహాసన్.



## సరికొత్త అవతారం

గ్లామర్ బొమ్మగానే ప్రేక్షకులకు గుర్తున్న 'జయసింహ' పిల్ల నటాషా దోషి 'కోతలరాయుడు' సినిమాలో సరికొత్త అవతారంలో కనపడుతుంది. లంగా ఓణీతో అత్యంత సంప్రదాయబద్ధంగా ధనలక్ష్మి పాత్రలో విభిన్నంగా ఉంటుంది.

"నాకు ఎక్కువ స్క్రిప్టుల ఆఫర్లు ఏవీ రాలేదు. నాలోని కామిక్ దృక్పథాన్ని వెలికితీయడానికిదో గొప్ప అవకాశం. డైలాగుల్లో వినోదాన్ని జొప్పించగలిగాను. వినోదాత్మక పాత్రల్లో ఇటువంటి అవకాశం అరుదయినదిగా భావిస్తున్నాను" అని తెలిపింది నటాషా.

ఆటలమీదకి మళ్ళించారో తెలీదు గానీ ఇక్కడికొచ్చినదగ్గర్నుంచీ ఇదేదో పిక్నిక్‌కి వచ్చినట్లు ఫీలవుతున్నాడు. పుస్తకం చూపిస్తేనే విసిరికొడ్తున్నాడు" దగ్గరికొస్తూనే కంప్లైంట్ చేస్తున్నట్లు గట్టిగా మాట్లాడింది మంజుల.

ఆమెవెనకే ఉన్న రవళికూడా ఫిర్యాదుల్ని మోసుకొచ్చింది. ఇదేదో ఇంట్రెస్టింగ్ మేటర్ అన్నట్లు చంద్రరావూ ఆ గదిదగ్గరే తచ్చాడుతున్నాడు. రవళి వచ్చి కంప్లైంట్ ఇస్తున్న సమయంలో ఆయాలిద్దరినీ కూర్చోబెట్టి ప్రత్యేకమైన సూచనలు ఇస్తుంది నిత్య.

రవళినీ, మంజులనీ కూడా పక్కనున్నకుర్చీలపై కూర్చోమని చెప్పింది "ఫైవ్ మినిట్స్.. వీళ్ళతో మాట్లాడడం అయిపోయాక ఆ సంగతి చూద్దాం"

జానకి, భాగ్యలక్ష్మివైపు తిరిగి తన లాప్‌టాప్‌లో పేజీలను చూపించింది.

"మొదట్లో, ఐమీన్ కొన్నేళ్ళ క్రితం ఆటిజం స్పెసిఫిక్ పోషక ఆహారాన్ని నానికి ఇచ్చివుంటారు. కానీ నేను చూస్తున్నప్పట్నుంచీ గమనిస్తున్నా. ఈ రుగ్మతకోసం ప్రత్యేక డైట్ సిస్టమ్స్ ఉన్నాయి. వాటిల్లో దేన్నీ పాటించడంలేదు" సూటిగా అంది నిత్య.

కారణాలు వెతుక్కుంటోంది జానకి "ఆ మధ్య వచ్చిన డాక్టర్ గారు ఫుడ్ గురించి ప్రత్యేకంగా ఏం చెప్పలేదు. ఏది తింటే అది పెట్టండీ అన్నారు..."

అదే తరహాలో తోచిన మాటలు చెప్పేసింది భాగ్యలక్ష్మి "అసలు... ఏం పెట్టినా విసిరికొడతాడు. ఏ మాత్రం సపోర్ట్ చెయ్యడు. ఏదో గంటలతరబడి కష్టపడితే కాస్తంత పెరుగన్నం తినిపించగలం... అంతే"

కొద్ది క్షణాలు మవునంగా ఉంది నిత్య. ఆమె తాను చెప్పదలచుకున్న విషయాలను మననం చేసుకుంటుందని అక్కడున్నవారందరికీ అర్థమైంది. "చంద్రరావ్... ఇలారా. నువ్వు కూడా నేను చెప్పింది వినాలి"

బయట వున్న చంద్రరావు లోపలికొచ్చి స్టూల్‌మీద కూర్చున్నాడు.

"ఈ సమస్య తీవ్రత మనందరికీ తెలుసు. వయసు పెరిగేకొద్దీ ఈ రుగ్మతను నిర్మూలించడం కష్టమనీ తెల్సు. సో... నాని ఇప్పుడు ఉన్న స్థితిలో ఈ రుగ్మతను నివారించాలంటే మల్టీడైమెన్షనల్‌గా చికిత్సా విధానాలు పాటించాలి..." అందర్నీ ఉద్దేశించి కూలంకుషంగా వివరిస్తోంది నిత్య.

"ముఖ్యమయినది మందులతో చికిత్స... గతంలో డాక్టర్లు ఇచ్చిన ట్రీట్‌మెంట్ వివరాలూ, కేసు హిస్టరీని మా యూనివర్సిటీ సీనియర్ ప్రొఫెసర్‌కి ఈమెయిల్లో రిఫర్ చేశాను.

హిస్టారికల్ డేటా అంతా పంపించాను... ఆయన రికమండ్ చేసిన మందులు రెండు మూడు రోజుల్లో కొరియర్లో వస్తాయి"

సమాంతరంగా పాటించాల్సిన ఒక్కో చికిత్సా విధానాన్నీ వివరిస్తోందామె.

"నెంబర్ టూ... మానసిక స్థితిని చక్కదిద్దడం... ప్రోయాక్టివ్‌గా మారేందుకు, పాజిటివ్ థింకర్‌గా మార్పు చెందేందుకు, ఆశావాద దృక్పథం చేకూరేందుకు, ప్రేరణ పొందగలిగేలా మోటివేట్ చెయ్యడం.. తనకు తాను మారాలి అన్పించాలి. తనుకూడా అందరిలాగే ఫిజికల్‌గా ఆరోగ్యాన్ని పొందాలని అతనికి అనిపించాలి.

అందుకు అనువైన సైకలాజికల్ ట్రీట్‌మెంట్ మెథడ్స్‌ని మనం ఫాలో కావాలి"

ఇంతలా ముదిరిపోయిన కేసుకి ఈమె చెప్పే థియరిటికల్ అప్రోచ్ పనిచేసే అవకాశంలేదన్నది వింటున్నవాళ్ళ ప్రగాఢ నమ్మకం. సరే ఎంతవరకూ చెపుతుందో చెప్పనీ అని లోలోపల అనుకుంటూ పైకిమాత్రం శ్రద్ధ నటిస్తూ వింటున్నారు.

"ఇక మూడోది... స్పీచ్ థెరపీ. ఒక పద్ధతి ప్రకారం రోజంతా అతనితో మాట్లాడుతుండాలి. అతన్ని మనం ఆశిస్తున్న స్పందన మాటల రూపంలో లేక హావభావాల రూపంలో వెల్లడి చేయగలిగేలా చూడాలి. ఏదో సంజ్ఞలాగో జవాబులు ఇవ్వడం కాకుండా అడిగినదానికి మాటల రూపంలో రిప్లై ఇచ్చేలా ప్రేరేపించాలి..."

ఆ మాత్రం పదాలు తెలిసినా పిచ్చి అరుపులతో చికాకు తెప్పించే నాని ఈమె చెప్పేవిధంగా మారడం సాధ్యమేనా అనే అపనమ్మకం వింటున్న అందరి మదిలో గాఢంగా ఉంది.

"తరువాత... లాంగ్వేజ్, బాడీ లాంగ్వేజ్ ఈ రెండూ పూర్తిగా మారేలా మనంప్రేరేపించాలి. అతను పలికే ప్రతి మాటనూ విని దోషాన్ని అక్కడికక్కడ కరెక్ట్ చెయ్యాలి. సరయిన హావభావాలూ, ముఖకవళికలూ వ్యక్తమయ్యేందుకు అవసరమైన ప్రోద్బలం ఇవ్వాలి..."

తన మాటలు అందరినీ చేరుతున్నాయో లేదో గమనించి మళ్ళా కొనసాగించింది నిత్య "ఇక... బిహేవియరల్ మాడిఫికేషన్... అతనికి కావల్సింది ఇవ్వాలంటే మనక్కావలసింది అతను ఇవ్వాలన్నది అలవాటు కావాలి. ఆ విధంగా మనం చెప్పినవన్నీ పాటించేందుకు ప్రయత్నించాలి"

జానకి, భాగ్యలక్ష్మి కూర్చున్నవైపు తిరిగి మాట్లాడింది నిత్య. "ఇదంతా ఒక పార్ట్ అయితే మీ ఇద్దరి బాధ్యతా మరింత ఎక్కువ ఉందిప్పుడు. ఆటిజమ్‌కి వైద్యం జరుగుతున్నప్పుడు మనం ఈ జాగ్రత్తలు తీసుకోవాలి"

**ఇంకా ఉంది**

# హెల్త్ బిట్స్




## ఒక వైద్యుడే మంచిది

ఒక వైద్యుడు బాగోలేదని మరో వైద్యుడిదగ్గరికి, ఒకేసారి తగ్గలేదని మరో డాక్టర్ దగ్గరికి తరచుగా వెళ్ళటం మంచిది కాదు. ఎవరో ఒకరిని నమ్మి ఆ వైద్యుడితోనే దీర్ఘకాల సంబంధం కలిగివుండటం మీ ఆయుర్దాయానికి మంచిది.

తొమ్మిది దేశాలలో, భిన్న సంస్కృతులు, విభిన్న ఆహార అలవాట్లకు, వైద్య విధానాలకు చెందినవారి మీద జరిగిన 22 అధ్యయనాలను క్రోడీకరించి ఈ ఆలోచనకు వచ్చారు పరిశోధకులు.

ఎవరైతే ఒకే డాక్టర్ దగ్గర ఎక్కువ కాలం వైద్యం చేయించుకున్నారో వారు ఎక్కువ సంవత్సరాలు జీవించినట్లు 18 అధ్యయనాలు తెలియచెప్పాయి. అది సాధారణ వైద్యులకే కాదు, స్పెషలిస్టు వైద్యులు, మానసిక నిపుణులు, శస్త్రచికిత్సలకు సంబంధించిన వారి విషయంలోనూ ఇదే సరైన పద్ధతి.

ఒకే డాక్టర్ దగ్గర ఎక్కువ కాలం చికిత్స చేయించుకునే రోగుల గురించి వైద్యుడికి సమగ్ర సమాచారం వుంటుంది. కాబట్టి చక్కని చికిత్స చెయ్యగలుగుతాడు. సరైన మందులు ఇవ్వగలడు. ◆

## సముద్రంలో ఈత

సముద్రతీరానికి వెళ్ళినప్పుడు సముద్రంలోని అలలతో ఆడుకోవాలని అనిపించకుండా వుండదు. కాళ్ళను తడుపుకోవటంతో మొదలుపెట్టి చివరికి ఈతవరకు వెళుతుంది ఆ సరదా.

అయితే సముద్రంలో ఈతతో కొన్ని రకాల అనారోగ్యాలు వస్తాయి అంటున్నారు. ఆస్ట్రేలియా, ఐరోపా ఖండదేశాలలోని బీచ్‌లలో తరచుగా ఈత కొట్టేవారి ఆరోగ్యాలను పరిశీలించారు.

వీరిలో చాలామందికి కడుపునొప్పి, విరోచనాలు వంటివి ఎక్కువగా కనిపిస్తుంటాయి. వీటితోపాటుగా చెవిలో పోటువంటివి వస్తున్నాయి.

సముద్రజలాల కాలుష్యంవల్ల వస్తున్నాయా లేక సముద్ర జలాలలోని సూక్ష్మజీవులు చేరటంవల్ల ఆ అనారోగ్యాలు కలుగుతున్నాయా తెలియదు.

అయితే అవి మరీ తీవ్రస్థాయికి చేరటంలేదు. ప్రస్తుతానికి వాటివల్ల మరీ అంతగా ఇబ్బంది కనిపించనందున సముద్రంలో ఈత మంచిది కాదని చెప్పటంలేదు. కాని సముద్రంలో ఈత విషయంలో కొంచెం జాగ్రత్త అవసరమే. ◆

## ఇలా చేస్తే లివర్ ఎలా!

శరీరంలోని కీలకఅంగాలలో కాలేయం ఒకటి. అటువంటి గ్రంధిని జాగ్రత్తగా చూసుకోవటం అవసరం.కాని ఆ విషయం మరచిపోయి కాలేయాన్ని దెబ్బతీసే అలవాట్లు, ఆహారంతో అనారోగ్యాన్ని కొని తెచ్చుకుంటున్నారు. ఈ తరంలో కాలేయ ఇబ్బందులు పెరుగుతున్నాయి. కాలేయ సమస్యలను వీరు ఎదుర్కోవటానికి వైద్యులు చెపుతున్న అంశాలలో

- వేళకు పడుకుని వీలయినంత త్వరగా నిద్ర లేవకపోవటం.
- మూత్రవిసర్జన చేయకపోవటం.
- రాత్రివేళ,పొద్దుపోయినతర్వాత అతిగా తినటం.
- ఉదయం అల్పాహారం తీసుకోకపోవటం.
- అతిగా మందులు మింగటం.
- కృత్రిమ పదార్థాలతో రంగులు తెప్పించిన వంటకాలు తినటం.
- వంట నూనె సక్రమమైనది వాడకపోవటం.
- పచ్చిపదార్థాలు తిని కాలేయంమీద ఒత్తిడి పెంచటం.మొత్తంమీద జీవనశైలి కాలేయం ఆరోగ్యానికి మేలు అనేది తాత్పర్యం.



# కదిలే బొమ్మల కబుర్లు

Review

## పాయింట్ చిన్నది... పంచిన వినోదం పెద్దది

మూడు పాటలు... ఆరు ఫైట్లుతో తయారు చేసిన ట్రంప్లెట్ సినిమాలు అంటే జనం కిలోమీటర్ దూరంలో వుంటున్నారు ఇప్పుడు. ఇప్పుడు అంతా కొత్తదనం.

అందులోనూ వైవిధ్యం. నిన్నటితరం ఇందులో ఏముంది... అంతా అనార్గనైజ్డ్ అనుకోవచ్చు. కానీ ఇప్పుడు అదే ఫ్యాషన్.

ఇందులో ఏముంది వడ్లగింజలో బియ్యంగింజ అనుకోవచ్చు. దాన్నే అద్భుతంగా చెప్పడం కావాలి. రెండున్నర గంటల సినిమా కోసం రెండుగంటల కథ ఇప్పుడు అవసరంలేదు. పావుగంట కథను, రెండు గంటల సినిమాగా మార్చగల నేర్పు కావాలి. కూర్చోపెట్టగల టెక్నిక్ తెలియాలి.

ఆ కథనం వంటపడితే, ఏ పాయింట్‌తో అయినా జనం మెచ్చే సినిమా తీయచ్చు. ఇలాంటి ట్రెండీ సినిమానే ఈ వారం విడుదలైన 'గీత గోవిందం'.

'గీత గోవిందం' సినిమా కథ కొత్తదేమీ కాదు. గతంలో వచ్చిన 'ఇష్క్' సినిమా కథే.

తన అక్కను ఏడిపించిన అన్నయ్యనుకొట్టి, వాడి చెల్లిని ప్రేమించడం 'ఇష్క్' కథ. తను అనుకోకుండా లడాయి పెట్టుకున్న అమ్మాయి అన్నకు తన అక్కను ఇచ్చి పెళ్ళిచేయాల్సిరావడం.

అయితే ఇది ఒక పాయింట్ మాత్రమే. అసలు పాయింట్ వేరు. బుద్ధిమంతుడైన కుర్రాడు, తను ప్రేమించిన అమ్మాయి దృష్టిలో తరచూ పోకిరిలా కనిపించే దురదృష్టం అన్నది అసలు పాయింట్. రెండు పాయింట్లు జమిలిగా అల్లి 'గీత గోవిందం' కథ తయారుచేశారు.

విజయ్ గోవింద్ (విజయ్ దేవరకొండ) మంచి కుర్రాడు. మాంచి భార్యను పొందాలని, అమ్మాయి అంటే అచ్చమైన మంచి లక్షణాలున్న అమ్మాయి అయివుండాలని, ఇలా చాలా కోరికలున్న అబ్బాయి. ఓ అమ్మాయి గీత (రష్మిక మండొన్నా)ను చూసి తొలిచూపులోనే ప్రేమిస్తాడు.

కానీ అదే క్షణంలో ఆమె దృష్టిలో పోకిరిగా ముద్ర పడతాడు. దాంతో ఆమె తన అన్నకు (సుబ్బరాజు) ఫిర్యాదు చేస్తుంది. దాంతో అతగాడు, ఈ గోవింద్ పనిపట్టాలని చూస్తుంటాడు.

చిత్రమేమిటంటే గోవింద్ అక్కనే ఈ గీత అన్న చేసుకోబోయేది. దాంతో అసలు చిక్కుమొదలవుతుంది. అలా చిక్కుపడిన కుర్రాడి ప్రేమ వ్యవహారం చివరకు ఎలా ముగిసిందన్నది మిగిలిన కథ.

'గీత గోవిందం' సినిమా పక్కా కొలతలు సరిపోయిన సినిమా. గెలిచిన చదరంగం గేమ్ పిక్కల్లో ఒక్కటి అటూ ఇటూ జరిపినా మొత్తం పోతుందన్నట్లు, 'గీత గోవిందం'లో హీరో, హీరోయిన్లు వేరేవారైనా, ఏమైనా మార్పులుచేర్పులు చేసినా, ఇలా వుండే వ్యవహారం కాదు. అంత పక్కా కాలుక్యులేటెడ్‌గా సరిపోయిన సినిమా ఇది.

విజయ్ దేవరకొండకు పక్కా టైలర్ మేడ్ పాత్ర. అతగాడు కాకుండా మరెవరు చేసినా పక్కా సాదాసీదా సినిమాగా వుండిపోయేది. అలాగే రష్మిక మండొన్నాకు కూడా ఇది సరైన పాత్ర.

సినిమా కాస్టింగ్ సంగతి అలా వుంచితే, స్క్రీన్‌ప్లే, సీన్లు అన్నీ కూడా పక్కాగా తయారుచేసుకున్నారు.

## దక్షిణాది సూపర్

నటనకు మార్గం ఏర్పరచుకునేందుకు మాత్రమే మోడలింగ్ చేశానని, అందాల పోటీలో పాల్గొన్నానని నిధిఅగర్వాల్ ఫ్రాంక్‌గా చెప్పింది. ముందుగా 'మున్నా మైఖేల్'లో ముచ్చట గొలిపిన నిధికి ఆపైన తెలుగు 'సవ్యసాచి'అవకాశం దక్కింది.

దీనిపక్కన అఖిల్ సినీ అవకాశం. దక్కించుకోగలిగింది.

మొత్తానికి దక్షిణాదిలో బిజీ అయిపోయిన నిధి, ప్రాంతీయభాషాచిత్రాలపై ప్రశంసల వర్షం కురిపిస్తున్నది.

"బాలీవుడ్ నుంచి ప్రాంతీయ సినిమాకు రావడం తక్కువగా భావించడం లేదు. సంఖ్యలో, నాణ్యతలో దక్షిణాది సినిమాలు బాలీవుడ్‌కు ఏమాత్రం తీసిపోవడంలేదు. భాష తెలియకపోవడం ఒక్కటే నా సమస్య" అంటున్నది. ◆








ప్రతిసీన్ చాలా చిన్నగా, అప్ టు ది పాయింట్ వుంటాయి. ఆ సీన్లన్నీ వర్తమాన ప్రేక్షకులకు నప్పే మాటలతో చమక్కుమని మెరుస్తాయి. దాంతో ప్రతి సీన్ రక్తికడుతుంది. 'గీత గోవిందం' విజయ రహస్యం ఇదే. 'గీత గోవిందం' సినిమా బ్యాక్ టు స్టోరీ నెరేషన్ స్టైల్‌లో మొదలవుతుంది.

నిజానికి సినిమాకు అది అవసరంలేదుకానీ, అదో అదనపుహంగుగా దర్శకుడు భావించాడు.అది నిజం గానే సినిమాకు అదనపు హంగుగా మారింది.

**కు**ర్రాళ్ళ సరదా సంగతులు, సగటు కుర్రాళ్ళ భావనలతో సినిమా అలా అలా ముందుకు సాగి, ఒక్కసారిగా అసలు కథలోకి ప్రవేశిస్తుంది. పెద్దగా కాన్‌ఫ్లిక్ట్, ఉత్కంఠ, గోళ్ళు కొరికేసుకునేంత హడా వుడి లేకుండానే సినిమా ఇంటర్వెల్‌కు చేరిపోతుంది. గంట సమయం చులాగ్గా గడచిపోతుంది.

స్వీట్ నథింగ్స్ అన్నట్లు, సరదా సీన్లు, సరదా మాటలతో. ఇలాంటి కథలకు సినిమా ద్వితీయార్ధమే పెద్ద పరీక్ష.

ఆ వ్యవహారం కొద్దిగా పొడసూపుతోంది, గ్యాప్‌లో ఓ పాటతో కాలక్షేపం చేస్తున్నాడు దర్శకుడు అని ప్రేక్షకుడు అనుకునే టైమ్‌లో వెన్నెలకిషోర్ రంగంలోకి దిగుతాడు.

ఇంకేముంది ప్రేక్షకులకు కొత్త జోష్ స్టార్ట్ అవుతుంది. దాంతో సినిమా పక్కాగా వంద మార్కులతో పాస్ అయిపోతుంది.

'గీత గోవిందం'సినిమా పక్కా కమర్షియల్ సినిమా అయినా కూడా లాజిక్ మిస్సింగ్‌లు కూడా పెద్దగా ఏమీ వుండవు.

**గ**ట్టిగా కూర్చుని మాట్లాడుకుంటే తేలి పోయే సమస్యే. కానీ దాన్నే కాస్త పెద్దదిగా చూపించి, హీరోను ఫక్తు అమాయకుడిగా చేసి, హీరోయిన్‌ను కాస్త గడుగ్గాయినిచేసి ప్రేక్షకులతో ఆడేసుకున్నాడు దర్శకుడు.

వాస్తవానికి ఈ చిక్కుముడిని విప్పిన వైనం కాస్త మరీ తూతూమంత్రంగా అనిపి స్తుంది కానీ, ఈ సరదా జోష్‌లో ప్రేక్షకుడు అది పట్టించుకోడు. ఏదో విధంగా సమస్య పరిష్కారం అయిపోయింది చాలు అనేసుకుంటాడు.

అదే దర్శకుడు తన సన్నివేశాల్లో కుక్కేసిన ఫన్‌చేసిన మ్యాజిక్. ముందే చెపుకున్నట్లు ఈ సినిమాకు విజయ్‌దేవరకొండ పెద్ద అడ్వాంటేజ్. అతడు కాకుంటే ఈ సీన్లు ఇలా వచ్చి వుండేవి కాదు. ఈ సీన్లకు అలా డైలాగులు రాసుకునేవాడు కాదు దర్శకుడు.

అందుకే సినిమా మెయిన్ పిల్లర్ అతగాడే. ఆ తరువాత రష్మిక, వెన్నెల కిషోర్‌లు. ముఖ్యంగా వెన్నెల కిషోర్ స్క్రీన్ స్పేస్ తక్కువే అయినా, దున్నేసి, నవ్వుల పంట పండించింది ఎక్కువ. ఇక సినిమా సాంకేతికంగా మరీ అద్భుతంగా ఏమీలేదు. కానీ సినిమాకు మైనస్ మాత్రం చేయలేదు.

గోపీసుందర్‌నేపథ్య సంగీతం బాగుంది. 'ఇంకేం ఇంకేం కావాలే...' అంటూ సాగిన పాట చాలు సిని మాకు బోలెడు ప్లస్ చేసేసింది.

సినిమాటోగ్రఫీ ఓకె. దర్శకుడు పరుశురామ్ సహజంగానే మంచి డైలాగ్ రైటర్. అది ఈ సిని మాలో కూడా కనిపించింది. అతని డైరెక్షన్ స్కిల్స్ కన్నా, స్క్రీన్‌ప్లే, డైలాగ్స్‌నే సినిమాకు బాగా పని చేశాయి.మొత్తంమీద కుర్రకారుకే కాదు, అంద రికీ సరదాలు పంచే సినిమా 'గీత గోవిందం'.

**ప్లస్‌పాయింట్స్...**
స్క్రీన్‌ప్లే, ఫన్, విజయ్, వెన్నెల కిషోర్

**మైనస్‌పాయింట్స్...**
పెద్దగా లేవు

**పంచ్‌లైన్**
సింపుల్... సూపర్బ్ ◆

## 'గోల్డ్' అవకాశం

**బు**ల్లితెరపై బోల్డంత పేరు తెచ్చుకున్న నిఖితా దత్తా వెండితెరకు దూసుకువచ్చేసింది. ఇలా సినీ ప్రయత్నాలు ఆరంభించిందో లేదో అలా 'గోల్డ్' అవకాశం తలుపుతట్టింది.

"అక్షయ్‌కుమార్ వంటి స్టార్ హీరో సినిమాలో అవకాశం దక్కడం నా అదృష్టం. ఇటువంటి సిని మాతో పరిచయం కావడం సంతోషంగా ఉంది.

వచ్చిన ప్రతిసినిమా ఒప్పుకునే తొందరేం నాకు లేదు. నటిగా సవాల్ విసరగల పాత్రలకే నా ప్రాధాన్యం. సవాళ్ళు నాకిష్టం. దేశం రక్షణకోసం ప్రాణాలు ఒడ్డి విధులు నిర్వర్తించే కుటుంబనేపథ్యం నుంచి వచ్చాను కదా" అంటున్నది. ◆

## హార్డ్‌వర్క్‌వల్లనే...

యశ్‌రాజ్‌ఫిల్మ్‌తో కెరీర్ ఆరంభించిన భూమి పడ్నేకర్ విజయబాటలో సాగుతున్నది. కరణ్‌జోహార్ 'తఖ్త్'కు రెడీ అయింది. విజయ రహస్యం గురించి అడిగితే దరహాసాలు చిందించింది.

"అది రహస్యమో, కాదో నాకు తెలియదు కాని, నేను చాలా హార్డ్‌వర్క్ చేస్తాను.నేనీనాడు ఈ స్థితికి చేరడానికి కారణం నా ప్రయత్నాలే. ఏ రంగంలోనైనా హార్డ్‌వర్క్ లేనిదే రాణించలేము.

బాల్యంనుంచి నటిని కావాలని కోరుకున్నాను. ఇది కాన్ఫిడెన్స్, విల్‌పవర్, కొంచెం అదృష్టం అనుకుంటున్నాను. కొంత గైడింగ్ ఫోర్స్ నన్నిక్కడికి చేర్చివుండవచ్చు" అని చెప్పింది. ◆





## ఎలా ఆడుతున్నాయి?

- 'శ్రీనివాస కళ్యాణం' సినిమా పరాజయంగా మిగిలింది. బయ్యర్లకు దాదాపు సగానికి సగం నష్టాలు తప్పటంలేదు.
- 'విశ్వరూపం 2' సినిమా డిజాస్టర్‌గా మిగిలింది. 'గూఢచారి' సినిమా మంచి హిట్ అనిపించుకున్నా బయ్యర్లకు మరీ అద్భుతమైన లాభాల్ని తెచ్చిపెట్టలేదు. బయ్యర్లందరికీ 20 శాతం కమిషన్ గిట్టుబాటు అవుతుంది. 'చి॥ల॥సౌ' సినిమా బయ్యర్లకు లాభదాయకం కాలేదు.
- ఈ వారం విడుదలైన 'గీత గోవిందం' సినిమా అతిపెద్ద హిట్‌గా మారే సూచనలు క్లియర్‌గా కనిపిస్తున్నాయి. ◆

## ఏడాదికి 60 కోట్లు

స్టార్ హీరోలు ఒక్కో సినిమాకు తీసుకునే పారితోషికం లెక్కలు కడితే గుండె గుభిల్లుమంటుంది. హీరోల్ని పక్కనఉంచితే, బాలీవుడ్ భామ ప్రియాంక చోప్రా ఏడాది సంపాదన అక్షరాలా అరవై కోట్ల రూపాయలు.

అమెరికా టెలివిజన్ షోవల్ల ఓపక్క డాలర్లవర్షం కురుస్తున్నది. ఇంకోపక్క బాలీవుడ్ చిత్రాలకూ భారీపారితోషికాన్నే డిమాండ్ చేస్తున్నది.

మన దేశంలో వార్షిక సంపాదనలో మొత్తం మీద ప్రియాంకచోప్రా అవార్డులు నెలకొల్పుతున్నదనే చెప్పుకోవాలి. Ⓢ



## భాష తెలుసు

సగం ఇండియన్, సగం దక్షిణ అమెరికా అందాలను మూర్తీభవించిన బ్యూటిఫుల్‌గాళ్ ఎలినాఫెర్నాండెజ్ 'కపూర్ & సన్స్'లో క్యామియోతో బాలీవుడ్‌లోకి ప్రవేశించింది. బాలీవుడ్ కలలైతే కన్నది కాని, అది సంభవించగలదని మాత్రం ఆశించలేదట.

ఎన్నో క్యాంపెయిన్లు, కవర్లు తన బెల్ట్‌లో ఉన్నాయని, కెరీర్‌లో సాధించాల్సింది చాలా వుందని చెప్తోంది. "టెలివిజన్ కమర్షియల్స్‌కు సహజంగా మారాను. ధర్మ ప్రొడక్షన్స్ అవకాశంగురించి నా మేనేజర్ చెప్పారు. అలా సినిమాల్లోకి వచ్చేశా.

హిందీ అర్థంచేసుకోగలను.హిందీపాఠాలు అభ్యసిస్తున్నా" అని తెలిపింది ఎలినా ఫెర్నాండెజ్. ◆

# చివరి రోజుల్లో...

భారతదేశంలో మహిళలకు సరైన రాజకీయ పాత్ర లేదని ఇప్పుడు చాలామంది వాదిస్తున్నారు. కాని వారికి చరిత్ర సరిగ్గా తెలియక అనటమే కాని వాస్తవంలో మహిళలు రాజ్యాలను ఏలిన ఘన చరిత్ర కలిగిన దేశం భారతదేశం.అదికూడా ఇప్పటికి 450-500 సంవత్సరాలక్రితం.

మొఘలాయి రాజు అక్బర్ భారతదేశం మొత్తం పాలిస్తున్న సమయంలో. అక్బర్‌ని ధిక్కరించటమే కాదు, అతనితో పోరాటంచేసి చివరికి ప్రాణత్యాగానికి పాల్పడిన గోండు రాజ్యపు రాణి దుర్గావతీదేవి.

మొఘలాయిలు ఢిల్లీని పాలిస్తున్న రోజుల్లో బుందేల్‌ఖండ్ ప్రాంతాన్ని చండేలారాజు కీరట్ రాయి పాలించేవాడు.ఆ చండేలా రాజు ఏకైక పుత్రిక దుర్గావతి. ఆమె సౌందర్యవతి, వీరనారి.

దుర్గావతీదేవిని వివాహమాడతానని గోండురాజు సంగ్రామ్ షా ముందుకు వచ్చాడు. దుర్గావతీదేవి అందానికి ఏమాత్రం తీసిపోని అందగాడు. బలవంతుడు గోండు రాజు. ఆ రెండు రాజ్యాల సంబంధం పెరగటంతో దుర్గావతి తండ్రి ముస్లిమ్ రాజు షేర్ షా దాడులను విజయవంతంగా ఎదుర్కొన్నాడు.

దుర్గాదేవి సౌందర్య మోహంలో పడి గోండురాజు రాజ్య వ్యవహారాలు చూడటం మానేశాడు. నిత్యం ఆమె తోడిదే లోకం. రాజ ధర్మం తప్పకూడదని ఆమె హెచ్చరించినా 'నువ్వే నా లోకం' అంటూ గోండురాజు ఆమెను వదిలేవాడు కాదు.

1545లో ఆ దంపతులకు కొడుకు పుట్టాడు. ఆ కొడుక్కి పది ఏళ్ళ వయసు వచ్చేసరికి గోండు రాజు అనారోగ్యంపాలై మరణించాడు.

అప్పటికి ఆమె వయసు 31 సంవత్సరాలు. భర్త మరణం బాధ ఒకవైపు వేధిస్తున్నది. మరోవైపు రాజ్యరక్షణ భారం ఆమె మోయాల్సి వచ్చింది. దుఃఖంలోనుండి త్వరలోనే కోలుకుని ఆమె పదేళ్ళ కొడుకును సింహాసనంమీద కూర్చోపెట్టింది.

పదేళ్ళ పిల్లాడి పాలనాఅంటూ ఎద్దేవాచేసి కొందరు సర్దారులు తిరుగుబాటుకు యత్నించారు. ఇక తానే నేరుగా రంగంలోకి దిగింది.

పురుషవస్త్రధారణ మొదలుపెట్టింది. కొడుకును సింహాసనం మీదుంచి పాలన తానే చేసింది. రాజ్యమంతా ఆమెను ఒక దేవతలా అభిమానించారు. తిరుగుబాటుదారులను అణిచివేసింది.

దొంగలను సంహరించింది. పటిష్ఠ బలగాలను సమకూర్చుకుంది. గోండురాజ్యంమీద మొఘలాయిల దృష్టి వుందని ఆమెకు తెలుసు. ఆ రాజ్యపు గోండు కోట పెద్ద పర్వతంపై వున్నది. అయినా అక్కడకూడా దెబ్బతిని వుంది. కాబట్టి ముందుగా ఆమె కోటని పటిష్ఠపరిచింది.



రాణి దుర్గావతీదేవి
(1524-1564)

యుద్ధ ధర్మం తప్పి అక్బర్ విష బాణాలను ఆమె ఎక్కి వచ్చిన ఏనుగు మీద ఎక్కుపెట్టించాడు. ఇక ఓటమి తప్పదని అర్థమైంది. ముందుగా పరిగెట్టి ద్రోహి రెహమాన్ తల తెగ నరికింది. గాయాలతో స్పృహ తప్పుతూ కూడా మొఘలాయిలకు చిక్కకూడదని కత్తి తీసుకుని తనకు తాను పొడుచుకుని మరణించింది.

కోట చుట్టూ వుండే అగడ్తను మరింత లోతుగా తొవ్వించింది.గోండు రాజ్యం గెలవలేకపోతే అక్బర్ చక్రవర్తికి అవమానం. యుద్ధం చెయ్యటంలో ఫలితం ఎలా వుంటుందో తెలియదు. అందుకే ఒక దశలో రాయబారిని రాణీకి పంపించాడు.

తన సార్వభౌమాధిపత్యాన్ని అంగీకరిస్తే, గోండు రాజ్యానికి స్నేహహస్తం అందిస్తానన్నాడు.

కాని అందుకు ఆమె అంగీకరించకపోగా ఒక పళ్ళెంలో కాకరకాయను వుంచి దానిని మీ అక్బర్‌కి ఇవ్వమని పంపించింది. ఆ కాకరకాయ సందేశం ఏమిటో అక్బర్‌కి అర్థంకాలేదు. ఆయన సలహాదారులకు కూడా అర్థంకాలేదు.

చివరికి ఒక పండితుడు దానికి అర్థం వివరించాడు. అది తన గోండు రాజ్య స్వరూపాన్ని గుర్తు చేయుటం. కొండలు, గుట్టలకు కాకరకాయ మీదున్న బుడిపెలు సంకేతం అన్నాడు. అది ధిక్కారంగా భావించాడు అక్బర్. నాటినుండి దుర్గావతీదేవిని చూడాలి,బందీగా తెచ్చుకోవాలన్నది అక్బర్ కోరిక.

అక్బర్ 1562లో మాల్వారాజును ఓడించాడు. అంటే అప్పుడు అక్బర్ సామ్రాజ్యం, గోండురాజ్యం సరిహద్దులను తాకింది. అక్బర్ విస్తరణ కాంక్ష ఆగదని, తనని కబళించేంతవరకు నిద్రపోడని తెలుసు దుర్గావతికి. అయినా తనవంతుగా తగిన జాగ్రత్తలు తీసుకుంటున్నది. కాని తన మంత్రివర్గంలో పెట్టుకున్న రెహమాన్ అనేవాడు ఒక రాత్రికి రాత్రి మాయమై అక్బర్ పంచన చేరాడు.

సౌందర్యవతి దుర్గావతిమీద తనకెంతో మనసుందని, గోండురాజ్యకోట రహస్యాలన్నీ తనకు తెలుసు కాబట్టి తాను సహాయం చెయ్యగలనని, రాజ్యం తీసుకుని రాణి దుర్గావతిని తన వశం చేయమని రెహమాన్ కోరాడు.

తన సేనాని అసఫ్‌ఖాన్‌కి సహాయకుడిగా రెహమాన్‌ని వెళ్ళమన్నాడు అక్బర్. ఆ విషయం రాణీ దుర్గావతికి తెలిసింది. ఇక చెయ్యగలిగిందేమీ లేదు. గోండులకు అసలు విషయం చెప్పింది. వారంతా ప్రాణత్యాగానికి సిద్ధమన్నారు.

మొఘలాయిలది భారీ సైన్యం, నవీన యుద్ధ పరికరాలున్నాయి కాబట్టి సంధిగురించి ఆలోచించమన్నారు సలహాదారులు. కాని దుర్గావతి అంగీకరించలేదు. సింహగర్జన చేసింది.

సమరభేరి మోగించి సైనికదళాలను నడిపించింది. ఫలితంగా శత్రు సైన్యాలు వెనక్కి తగ్గాయి. గోండు రాజ్యపు పొలిమేరలను దాటి వెళ్ళేలా తరిమికొట్టింది. ఇది అక్బర్‌కి రాణీ దుర్గావతీదేవి చేతిలో రెండవ ఓటమి. ఈ ఓటమికి ప్రతీకారం తీర్చుకోకపోతే మిగిలిన సామంతులు తిరగబడవచ్చు.

ఆ భయమే మరిన్ని బలగాలతో మొఘలాయీ చక్రవర్తి కదిలివచ్చి, అసఫ్‌ఖాన్‌కి సూచనలు ఇస్తూ యుద్ధం చెయ్యమన్నాడు. మొగలుల సైన్యం సముద్రపు అలల్లా ఎగిసిపడివస్తున్నాయి.

అందులో నాలుగోవంతుకూడా లేదు గోండ్ రాజ్య సైన్యం.ఐనా రాణీ దుర్గావతి రంగంలోకి దిగి తనకు భౌగోళికంగా అనుకూలం అనుకున్న నర్హీ అనే గ్రామం దగ్గర శత్రుసేనలను ఎదుర్కొన్నది.

ఘోరమైన యుద్ధం. అందులో ఒకచోట కొడుకు వీరనారాయణ గాయపడి అమ్మను చూడాలని కలవరిస్తున్నాడు. ఆ వార్త అందుకున్న రాణీ దుర్గాదేవి "నేను యుద్ధం విడిచి రాలేను... యుద్ధం తర్వాత వీరమాతగా వచ్చి చూస్తాను... వీరమరణం సంభవిస్తే స్వర్గంలో వాళ్ళ నాన్న దగ్గర కలుస్తాను" అని కొడుక్కి చెప్పమని ముందుకు ఉరికింది.

యుద్ధ ధర్మం తప్పి అక్బర్ విషబాణాలను ఆమె ఎక్కి వచ్చిన ఏనుగుమీద ఎక్కుపెట్టించాడు. ఇక ఓటమి తప్పదని అర్థమైంది. ముందుగా పరిగెట్టి ద్రోహి రెహమాన్ తల తెగ నరికింది. శూలాలు, బాణాలు ఆమె వీపులోకి దూసుకుపోయాయి.

గాయాలతో స్పృహ తప్పుతూ కూడా మొఘలాయిలకు చిక్కకూడదని కత్తి తీసుకుని తనకు తాను పొడుచుకుని మరణించింది. అది జూన్ 24, 1564. ఒక వీరనారి మాతృదేశంకోసం నేలరాలింది.

# ఈ శీర్షిక మీదే

**ఉత్తమ ప్రశ్నకు ₹ 500**
**ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి**

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

* కె.వి.ఎస్.ఎస్.ఎల్.ఎన్.నగేష్, విశాఖపట్నం
**రోజూ అరగంట నడిచినా, వ్యాయామం చేసినా 'జి.ఎస్.టి' నుంచి తప్పించుకోవచ్చా?? ఎలా?**
(జి) గ్యాస్ట్రిక్, (ఎస్) షుగర్, (టి) థైరాయిడ్.

* ఆర్.ప్రశాంతి, విజయనగరం
**'కాకి' లెక్కలు ఎలా చెబుతారు?**
'చిలుక' పలుకులతో.

* పి.సి.సన్యాసిరావు, హైదరాబాద్
**'బానిస' కామెంట్ ప్లీజ్?**
'బా'గోగులతో పనిలేకుండా యజమాని చేసే ఎలాంటి 'ని'ర్ణయాలకైనా 'స'ర్దుకుపోయే ఓ గొప్ప పనోడు.

* బి.వెంకటేశ్వరరావు, హైదరాబాద్
**'హ్యాండ్'...'సమ్' పర్సన్?**
ఎప్పుడూ 'చేతిలో'... ఎంతో 'కొంత' (డబ్బు) ఉంచుకునేవాడు.

* బి.వి.సౌజన్య, హైదరాబాద్
**బాగా వంకలుపెట్టేవాడు?**
'మా తల్లిదండ్రుల్ని కళ్ళల్లో పెట్టుకు చూద్దామనుకున్నా... మధ్యలో కళ్ళజోడు అడ్డుగా వుంది...' అని చెప్పేవాడు.

* పి.ఆర్.బద్దిగం, కరీంనగర్
**గడసరి కోడలు?**
'అత్తయ్యా! నీవు నా బిడ్డను ఆడించు నేను నీ కొడుకును ఆడిస్తాను' అని చెప్పేది.

* ఎస్.కె.నాగేశ్వరరావు, మార్టేరు
**'ఎలోన్' అంటే?**
ఎలాంటి 'లోన్' అవసరంలేనివాడు.

* సిహెచ్.నాగేశ్వరరావు, పాములవలస
**విలాసకాలే?**
విపరీతబుద్ధీ.

* పి.యోబు, ముదునూరు
**కాపురాలు ఎలా కూలిపోతాయి?**
పక్క కుదరకపోయినా, పక్కకు జరిగిపోయినా.

* పి.వి.రమణకుమార్ చిలకలూరిపేట
**'గూర్ఖా' అవసరంలేనిది ఎవరికి?**
పెద్దగా 'గురక'పెట్టేవారికి.

## ఈ కార్టూన్ మీదే




## B హ్యాపీ

"నా చికిత్స ఫలించింది. మీరు మరెవరో అనే ఆలోచనల్లోనుండి మిమ్మల్ని బయటకు తెచ్చాను, అని సైకియాట్రిస్ట్ చెప్పినా పేషెంట్ విచారంగా వుండటం గమనించి ఎందుకు ఇంకా మీరు అలా వున్నారు" అన్నాడు.

"మరి నిన్నటివరకు చిరంజీవిని, రజినీకాంత్‌ని అనుకుంటున్న నాకు ఇవ్వాల్టినుండి ఏమీ కాదనుకుంటే విచారం కాక ఏం మిగులుతుంది డాక్టర్" అంటూ ఏడవటం మొదలుపెట్టాడు.

పి.వి.నరసింహారావు ఒకసారి ఎన్నికల సభలో ఉపన్యాసం ఇస్తున్నాడు. జనం వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకుంటున్నారు.

అది చూసిన పి.వి. "ఇప్పుడు నా ప్రసంగం సరిగ్గా విననివారికి ఆ తర్వాత ఎన్నికల వాగ్దానాలు సరిగ్గా ఆమలు అవలేదనే అవకాశం వుండదు" అనేసరికి సభ మొత్తం ఒక్కసారిగా నిశ్శబ్దం.

"రేపు మా ఆవిడ పుట్టినరోజురా పార్టీ ఇస్తున్నా... గొప్పవాడివిరా!" మీఆవిడ పుట్టినరోజు ఇంతగా గుర్తుపెట్టుకున్నావు."నా ముఖం పెళ్ళైన కొత్తల్లో ఒకసారి మరచిపోయా... ఇక అప్పటినుండి మరచిపోవటానికి వీలులేని పరిస్థితి సృష్టించింది మా ఆవిడ"

"మా ఆవిడ ప్రసవించే రోజు సార్" నన్ను షూటింగ్‌లో నుండి కొంచెం తొందరగా పంపండని ఒక కుర్రహీరో నాటి ప్రముఖ దర్శకుడు సి.పిల్లయ్య గారిని అడిగితే "కాల్ షీట్ రోజు నీ అవసరంగాని రిలీజ్ రోజు నువ్వెందుకయ్యా" అని సినీభాషలో కోపడ్డాడు ప్రముఖ దర్శకుడు సి.పిల్లయ్య.

బార్‌లో ఏడుపుముఖం వేసుకుని ఒక్కడే తాగుతున్నాడు. ఇంతలో అతని ఫ్రెండ్ వచ్చి "ఏమిట్రా ఎందుకు ఆ ఏడుపు ముఖం" అని అడిగాడు.

"మే నెలలో మా అత్తయ్య చచ్చిపోయింది. నా పేరున యాభైవేలు బ్యాంక్‌లో వేసింది"

"జూన్‌లో మా బాబాయిపోతూ లక్ష ఇచ్చి వెళ్ళాడు. జూలైలో మాపిన్ని మరో లక్ష ఇచ్చి చచ్చిపోయింది"

అంతమంది అంత ఇచ్చిపోతుంటే ఇంకా ఏడుపెందుకురా! "ఏడిచినట్టుంది. ఆగస్టువెళ్ళిపోతోంది... ఇంతవరకు ఏ ఒక్కరు చావలేదు మరి"

ఒక మత ప్రచారకుడు అడవిలోని గిరిజనులకు ప్రభువు సందేశం అందించాలని వెళ్ళాడు.

అతికష్టంమీద ఆ తెగ నాయకుడితో మాటలు కలిపి "ఎప్పుడైనా ప్రభువుతో పరిచయం ఎలానో తెలుసుకున్నావా" అని అడిగాడు. "ఆ.. పోయినసారి మీవంటివాడు ఒకడు వచ్చాడు... వండుకు తింటే ప్రభువు మంచి రుచిగానే వున్నాడు" అనగానే పరుగు ప్రారంభించాడు ఆ మతప్రచారకుడు.

"అమ్మా ముందే చెపుతున్నా... ఆ అబ్బాయికి దేవుడిమీద నమ్మకంలేదు" అన్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య. "మరేం పరవాలేదండి... పెళ్ళి కానివ్వండి... దేవుడి మీద నమ్మకమే కాదు... నరకం వుందనికూడా అంగీ కరించేలా చేస్తుంది మా అమ్మాయి" అంది పెళ్ళి కూతురి తల్లి.

ఫలితంపైనకన్నా, చేసే పనిపై దృష్టిపెడితేనే విజయం సాధించవచ్చు.

